భారత చరిత్రలో
భర్తను కాపాడగల్గిన
వీరనారి చరిత్ర!




సిందూర్ పిక్చర్స్

చిత్తూర్ రాణీ

# పద్మిని

రచన శ్రీశ్రీ .... సంగీతం: చంద్రం సూర్యం



దర్శకత్వం: చిత్రపు నారాయణమూర్తి B.A;

ఆంధ్ర, నైజాం: వాణీ పిడా: భాస్కర్

# చందన్ జీవితకాలపు ఉపయోగమునకు నిర్మితం

విపులంగా-పరిశీలించి చూడండి-అంతట మీకు తెలియునది ఏమంటే: ఉక్కు సామానులన్నీ ఒక్కటే మాదిరిగావుండవు. సాధన సామగ్రి మరియు నిర్మాణ నైపుణ్యం శీఘ్రమైన స్పష్టమైన వ్యత్యాసమును కలిగించుతాయి—అదే చందన్ కు పోటీలేని విశిష్టతను కలిగించింది. అది జీవితకాలపు ఉపయోగమునకు నిర్మింపబడినది. ఉదాహరణగా, లోహపు రేకులు రోలర్ తో చదును చేయబడి అత్యంత కచ్చితమైన ప్రమాణములకు యంత్రమూలంగా నిర్మింపబడి, తుప్పు నిరోధకంగా దీర్ఘకాల మన్నికను గలిగించుతుంది ఎందుకనగా అది అధికంగా తరచు గావింపబడుతుంది-ఎక్కువ ఖర్చుగునట్టి ముందుగా జరిపే ప్రయోగం తరువాత విపులంగా కాచబడిన ఎనామెల్ ముగింపుచేయబడును. చందన్ ఉక్కు సామాను కొనుట మాత్రమేగాక, అది మంచి పెట్టుబడి అని ఎందుకు అనిపిస్తుందో మీరే గ్రహించండి.








చందన్ అమర్చుకోదగిన అరలుగల ఉక్కు అలమరలు మూయబడనివి, మూయబడినవి మరియు తలుపులు అరగల రకములతో లభించుచున్నవి — స్టోర్లు, లైబ్రరీలు మొదలైన వాటికి దివ్యమైనవి.

ఉక్కుసామానులలో క్రొత్త విశిష్టతకు నిరపణ [illegible]

**చందన్ మెటల్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లి.**

[illegible]

చందన్ — గృహములకు, ఆఫీసులకు, మరియు సంస్థలకు.

[CMP. 1041 A. TEL EVEREST]

ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసుకు అధికారము పొందిన డీలర్లు: హైదరాబాద్: గోకుల్ ట్రేడింగ్ ఏజన్సీస్; నెల్లూరు: మధు ఏజన్సీస్; శ్రీకాకుళం: ఆటీవ్ ఏజన్సీస్; విశాఖపట్టణం: మేధి ఆరవ్స్ స్టోర్సు; మద్రాస్: పూర్ణిమా ఏజన్సీస్; కోయంబత్తూర్ & ఈరోడ్: కె. బాలగురువ శెట్టియార్ సన్; మధురై & కారైకుడి: సిన్సియర్ ఏజన్సీస్; సేలం, చిదంబరం, పాండిచ్చేరి: శివరాం ట్రేడర్స్; కుంభకోణం & తిరువారూర్: వి. రాజగోపాల అయ్యర్; తిరుచిరాపల్లి: శ్రీ వెంకటేష్ ఏజన్సీస్; తిరునల్వేలి: ఎస్. ఆర్. ఎస్. ఏజన్సీస్, ఇతర స్టేట్లలోకూడ డీలర్లు గలరు.

ప్రతినిధిత్వము లేని జిల్లాలనుండి డీలర్ షిప్ వివరాలకు వ్రాయగోరుతాము.

# ఉత్తరాలు

## కెనెడీ హత్య

అమెరికా ప్రెసిడెంట్ కెన్నెడీ హత్య చెయ్య బడ్డారని నన్ను నమ్మించడానికి పది నిముషాలు పట్టింది. డిపార్టుమెంటులో అందరం రేడియోలు పెట్టి వినగానే ఆశ్చర్యం, ఇంకా అపనమ్మకం, విచారం, దుఃఖం అన్నీ కలిసి మమ్మల్ని ముంచే శాయి.

ప్రెసిడెంట్ కెన్నెడీ ఇక్కడే కాదు, ప్రపంచ మంతటా అందరికీ ప్రేమపాత్రులు. ముఖ్యంగా భారతదేశానికి ఎవరికీ తీసిపోని స్నేహితులు ఆయన ప్రసన్న వదనం, హాస్యోక్తులూ కనీసం వారాని కొకసారి టెలివిజన్‌లో చూచి మురిసిపోనివా రుండరు.—ఇక్కడ. అమెరికాలో తన అధ్యక్ష పదవి ముగియక పూర్వమే ఆయన తన "తపన్ను తగ్గింపు", "సాంఘిక హక్కులు" బిల్లులు అమలు లోకి తేవాలని తాపత్రయ పడ్డారు. ఆయన అంత ర్జాతీయ రంగంలో ఈ మూడేళ్ల అధ్యక్ష పదవి లోను గడించిన ఖ్యాతి అందరికీ తెలిసినదే. అటు వంటి వ్యక్తిని ఇక్కడ ప్రతివారూ తమ ఆత్మ బాంధవునిగా తలచడం ఎన్నోసార్లు చూశాము. ఆయన హత్యచేయబడ్డారంటే "ఇంకా నమ్మ లేము" అనిపిస్తుంది. జనవరి 30, 1948 వ



తండ్రి మృతదేహం చర్చిలోనుంచి తీసుకు పోతూ వుండగా 'సెల్యూట్' చేస్తున్న శ్రీ శ్రీ కెన్నెడీ చిన్న కొడుకు జాన్.

భారతదేశం దుఃఖసాగరంలో మునిగిపోయిన విషయం మళ్లీ మళ్లీ జ్ఞాపకం వచ్చి, ఆ అనుభూతే నిన్నా, ఈరోజూ పొందాము. ఆయన గాంధీ, లింకన్— పోటివారు. పరితాపకంగా ప్రెసిడెంట్ కెన్నెడీ టెక్సాస్ రాష్ట్రంలో డల్లాస్ నగరంలో ప్లేను దిగి వేలాది జనులు హర్షధ్వానాలు చేస్తుంటే— నగరంలోకి ఊరేగింపులో వెళ్తుండగా—ఒక భవనం 6 వ అంతస్తు కిటికీలోనించి మూడు తుపాకి గుండ్లు వర్షించాయి. మొదటి గుండే ఆయన కుడి కణతలోంచి ప్రవేశించి మెడ వెనుక నించి బయటకు వచ్చింది. వెంటనే ప్రక్కనున్న జాకెలిన్ కెన్నెడీ వడిలోకి ఒరిగిపోయారు. ఎదురుగా కూర్చున్న టెక్సాస్ రాష్ట్ర గవర్నరుని రెండు గుండ్లు కొట్టాయి ఆయన భార్య, శ్రీమతి కెన్నెడీ లకు ప్రమాదం కలుగలేదు. వెంటనే వారి కారు అఘ మేఘాలమీద ఆస్పత్రికి పరుగెత్తింది. 35 నిముషాలలో ఆక్సిజన్, రక్తప్రదానం, వగైరా ఎన్నో ప్రక్రియలు చేయబడ్డా కెన్నెడీ మరణిం చారు. టెక్సాస్ గవర్నరు తీవ్రమైన స్థితిలో ఉన్నారు. దేశం అట్టుడికినట్టు వ్యాపించింది వార్త. ఆ క్షణంనించీ, క్షణక్షణానికీ అక్కడ ఏమి జరుగు తోందో. రెండుగంటలు లోపల లిండన్ జాన్సన్ ప్రెసిడెంటుగా వేయచబడడం, అనుమానితుల్ని పట్టుకోడం, కెన్నెడీ దేహాన్ని వాషింగ్టన్ చేర్చడం, అక్కడ వైట్‌హౌస్‌లో ప్రభుత్వోద్యోగులూ, అంత ర్జాతీయ ప్రముఖులూ ఆయుని అంత్య గౌరవాలూ చూపించడం—నిన్న 12—45 నించి రాత్రి 1—30 వరకూ ఈ ఉదయం 7—30 నించి మూడు టెలివిజన్ నెట్‌వర్కు, రేడియో నెట్ వర్కులూ చూపిస్తున్నాయి, వినిపిస్తున్నాయి. నిన్న మధ్యాన్నంనుంచీ చేష్టలుడిగి టెలివిజన్‌కి అంటుకుపోయి చూస్తున్నాము. నిన్న సాయంత్రం 8—30 గంటలకి ఇక్కడ భారత విద్యార్థి సంఘంవారం హటాత్తుగా కలుసు కుని శ్రీమతి కెన్నెడికి సానుభూతి పత్రం తయారు చేసి టెలిగ్రాం పంపాము. అమెరికన్లకి ఎంత విచారకరమయిన విషయమో ఇక్కడి భారతీయు లందరికీ కూడా అంతే.

ప్రెసిడెంట్ కెన్నెడీని మర్చిపోవటం సాధ్యం కాదు. ఆయన జ్యోతి వెలుగుతూనే ఉంటుంది.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
(ఇండియన్ స్టూడెంట్స్ ఎసోసియేషన్, ఈస్ట్ లాన్‌సింగ్, మిచిగన్ అమెరికా.)

## కథలు

29—11—63 పత్రికలో ప్రచురించిన కథలలో 'కంసకథ' లో రచయితగారు కేవలం హాస్యాన్నే ప్రధానంగా తీసికొన్నారు. ఇకమీదట ఇటువంటి కథలు వ్రాయవద్దని రచయితలకు మనవి చేస్తున్నాను.

దమ్మవళం రామారావు (అమ్మనబ్రోలు)

* * *

ఈ వారం పత్రికలోని సుప్రసిద్ధ ఆసియా కథ "పక్క బరిణె" ఇది వరకు ప్రచురించిన కథలకన్న చాలా బాగున్నది.

గోల్కొండ హేమగిరి (చిత్తూరు)

* * *

"పాడుపడిన మయ్యి" చాలా బాగున్నది. దానిలో పిట్టగుడ్లు "లెనిగర్"లో ఊరగాయ పెట్టి నట్లు వ్రాసినారు. "లెనిగర్" అనే బదులు చింత పండు అని వ్రాసినట్లయితే అందరికీ అర్థమయ్యేది. ఎందుచేతనంటే "లెనిగర్" అంటే చింతపండు అనే అర్థం. బొడ్డు అప్పారావు (తిరుపతి)

## సీరియల్ కథ

ఈ వారంతో "ప్రేమకు పగ్గాలు" కథ అయి పోయిందనగానే ఎంతో విచారం కల్గింది. ఇంతటి రసవత్తరమైన కథ మరో 5, 6 వారాలు నడుస్తుం దని అనుకున్నాను. ఈ కథలోని ఆఖరు భాగంలో "విరాజీ" గారు కరుణ రసం ఉట్టి పడేటట్టు వ్రాసారు. పిన్ని చావుకి భాస్కరం పడిన బాధ, దానిని వర్ణించిన విధము నన్ను ఏడిపించినంత పని చేసింది. ఆఖరు భాగంలోని కథ చాలా జోరుగా పోతుంది. కథాంతంలో పద్మావతియొక్క నిర్ణయం మెచ్చుకో తగ్గది. అరవింద్ ఆర్. పరీఖ్ (బరోడా)

* * *

"ప్రేమకు పగ్గాలు" పూర్తి కాగానే నాలో ఏదో ఒక అసంతృప్తి బయలుదేరింది. ప్రేమకు పగ్గాలు చివరివరకు చాలా సహజంగా, వాస్తవి కంగా ఉంది. కాని చివరలో కథను కట్ చేసి నట్టుగ ఒక్కసారిగా ముగించివేశారు రచయిత విరాజీ. సురేఖకు చాలా అన్యాయం చేసారు.

వె. విజయకుమార్ (బెల్గాం)

* * *

మీరు సీరియల్‌గా వేస్తున్న "ప్రేమకు పగ్గాలు అయిపోయింది. ఇంకా ఉంటే బాగనిపించింది. రచయిత విరాజీగారికి నా ప్రత్యేక అభివందనములు.

చౌదరి (శ్రీకాకుళము)

## రామచరితమానస్

రామచరిత మానస్ శ్రీ ముంగర శంకరరాజు గారి అనువాదం—పత్రికకు ప్రతివారం అమూల్య మైన శోభ చేకూర్చుతోంది.

సీతాస్వయంవరం సందర్భాన జనకుడి ప్రతిజ్ఞ "శివధనువు విరిచిన వారిని సీత వరిస్తుం"దని ఉంది. మేము విన్న, చదివిన రామాయణ కథలలో "శివధనస్సు నెక్కుపెట్టిన వారిని జానకి వరించ గలద"ని చాటినట్టు శ్రీరాముడు యెక్కు పెట్టే టప్పటికది ఫెళ, ఫెళార్భాటాలతో విరిగి పోయినట్టూ ఉంది. ఈ భేదం తులసీదాస్‌గారి రామచరిత మానస్‌లోనే ఉందో—లేక అనువాద కులు ఈ మార్పు తెచ్చారో దయచేసి తెల్పగలరు.

ముడార్ వేణు (హిందూపురం)

* * *

రామచరితమానస్ బాగానే ఉంది. కాని ఈ వారం 22—11—63 సంచికలో జనక మహా రాజు, విశ్వామిత్రునికి సీతను పరిచయము చేస్తూ సీత ఇల్లు అలుకుచూ, శివ చాపమును ప్రక్కకు నెట్టినదని చెప్పిరి. అది చాలా అసహజముగా నున్నది. ఎందుకనగా అంతటి జనక మహారాజు కుమార్తె సీత ఇల్లు అలుకుట అసహజము. అలాటి చక్రవర్తి కుమార్తె కూడ ఇల్లు అలుకుట చూస్తే మాకు చాలా విచారంగా యున్నది. సీతకు ఇల్లు అలికే కర్మేం పట్టింది? తులసీ రామాయణములో యట్లే యున్నదా? అనువాదములో పొరపాటా?

ఎస్. లలిత, ఎమ్. మీనాక్షి (శృంగవరపుకోట)

## కిలర్ జీవితచరిత్ర

మీ పత్రికలో ప్రచురింపబడుతూవున్న క్రిస్టీన్ కీలర్ కథ పాఠకులకు ఏ విధంగానూ ఉపయోగ కారికాదు. ఆ కథలో అశ్లీల విషయాలు చాలా ఉన్నవి. అవి యువతీ యువకులలోని పశు ప్రవృ త్తితో గూడిన కామోద్రేకాన్ని రెచ్చగొట్టగలవు. ఇట్టి రచనలు మీ పత్రిక స్థాయిని (అనగా మీ పత్రికకు గల కీర్తి?) నిలబెట్టజాలవు.

జంధ్యాల వెంకటేశ్వర్లు (గొడవర్రు అగ్రహారం)

★

కొత్త
కీలర్ శీర్షిక
ఎదురు చూడండి!

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 13—12—63
శోభకృన్నామసం॥ నిజకార్తీకమార్గశీర్ష బ॥ త్రయోదశి
సంపుటము : 56 సంచిక : 15

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వార (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా · 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




'నర్తనశాల' తార సావిత్రి.

# మనలోమాట

రామాయణంలోనే 'జావా' పేర్కొనబడినప్పుడు 'జాతక కథ' లలో ఇండోనేసియా మొదలయిన ప్రదేశాల ప్రసక్తి ఉండటంలో ఆశ్చర్యం లేదు. కనీసం క్రీస్తుశకం మొదలయినప్పటినుంచీ భారతదేశానికీ ఆగ్నేయ ఆసియా ప్రాంతాలకీ సన్నిహిత సంబంధం ఉండేది; సంస్కృతంలో ఎన్నో శాసనాలు దొరికాయి.

ఇండోనేసియాకి సంబంధించి సంతవరకు 5వ శతాబ్దంలో పూర్ణవర్మ అనే రాజు పశ్చిమ జావా ప్రాంతాలలో పరిపాలించినట్లు తెలుస్తుంది.

1025 లో రాజరాజ నరేంద్రుని మామగారయిన చోళరాజు రాజేంద్రుడు ఈ ద్వీపంలో ఉండేదనుకునే శ్రీ విజయరాజ్యంమీద దండెత్తి గెలిచాడుట.

ప్రాచీన పాశ్చాత్య భూగోళ శాస్త్రజ్ఞుడు క్లాడియస్ టాలెమీ (2వ శతాబ్దం. క్రీ. శ.) ప్రకారం 'బారూసాయ్' అనే అయిదు ద్వీపాలలో నరమాంస భక్షణ ఉండేదిట; వీటి పేర్లు ఇప్పుడు ఏవో చెప్పటం కష్టం కాని ఇండోనేసియా ప్రాంత ద్వీపాలు కొన్నిటిలో మనుష్యులని తినే అలవాటు ఇప్పటికీ ఉంది! (అని అక్కడికి వెళ్ళివచ్చినవారు వ్రాస్తున్నారు!)

వనితాలోకం వ్యాసం, 'ఇండోనేసియా యాత్ర' రచయిత్రి శ్రీమతి క. దివ్యజ్ఞాన సరోజినీదేవిగారు ఇండోనేసియాకి ఏ సందర్భంలో వెళ్లారో వ్యాసం చదివితే తెలుస్తుంది.

* * *

జాతి విచక్షణకి సంబంధించిన వ్యాసాలు కొన్ని ఈ సంచికలో వేశాము. కీ. శే. కెన్నడీ హత్య సందర్భంలో ఈ సమస్య పైన ఏదయినా ప్రచురిస్తే బాగుంటుందని ఈ చిన్న వ్యాసాలు తయారు చేశాము. కాని స్థలాభావం వల్ల ఎక్కువ వివరాలు ఇచ్చే అవకాశం లేకపోయింది.

ఇదే సంచికలో అమెరికా నుంచి వచ్చిన ఉత్తరం ఒకటి దానికి సంబంధించిన శీర్షికలో వేశాము.

* * *

సకాలంలో అందనందున 'సరాగమాల' ఈవారం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించలేకపోతున్నాము.

జ్యోతిశ్శాస్త్రంమీద అభిమానం, నమ్మకం, ఉన్నవారికి ఇటీవల సంభవించిన మరణాలను గురించిన వ్యాసం ఒకటి తయారుచేస్తున్నారు దైవజ్ఞ శ్రీపాతూరి శ్రీరామమూర్తి గారు! త్వరలో పాఠకులకు అందచేయగలము... ★

# విషయానుక్రమణిక


పౌరహక్కుల బిల్లు
నీగ్రోలకు అండ
బడుగుదేశాలకు సాయం
బడుగు దేశాలు
చైనా వాడు పలాయనం ఫలించేలా భారత్‌కు సాయం!
అణుప్రళయం నుంచి ప్రపంచానికి రక్షణ

# మంత్రిత్వ శాఖల వ్యవహారాలు

**శ్రీకృష్ణ**

రాష్ట్రపతి ఉత్తర్వుచేసిన సవరణలవల్ల గనులు, ఇంధన మంత్రిత్వశాఖా రద్దయి దానిస్థానే (1) పెట్రోలియం విభాగం, (2) రసాయనిక ద్రవ్యాల శాఖ ఏర్పడతాయి. పాత గనుల ఇంధన శాఖ నుంచి పెట్రోలియంకు సంబంధించిన విభాగాలుగా కొత్త పెట్రోలియం శాఖలోకి వస్తాయి. పరిశ్రమలు, ఎరువులు, భారీ పరిశ్రమ శాఖ నుంచి తీసి, రసాయనిక ద్రవ్యాల శాఖలో చేరుస్తారు. ఇక భారీ పరిశ్రమలు, ఉక్కు మంత్రిత్వ శాఖ రద్దు ఐ ఆ స్థానే (1) ఉక్కు ఇనుము శాఖ, (2) భారీ సాంకేతిక శాఖ, (3) గనులు లోహాలు శాఖ అనే మూడు విభాగాలు ఏర్పాటుఔతాయి. ఇందులో ఉక్కు, ఇనుము శాఖకు చెందిన వ్యవహారాలు అలాగే ఉంటాయి. కాని ఎరువులకు చెందిన వ్యవహారాలు తప్ప తతిమ్మా భారీ పరిశ్రమలకు చెందిన వ్యవహారాలన్నీ కొత్త శాఖ భారీ సాంకేతిక విభాగంలోకి వస్తాయి. వెనుక గనులు యింధనం శాఖలో గనులకు, బొగ్గుకు చెందిన వ్యవహారాలను ఉక్కు (నాన్ ఫెర్రస్) గని లోహాలకు చెందిన వ్యవహారాలను కొత్తగా ఏర్పడిన గనులు, లోహాలు శాఖ క్రిందకు చేరుస్తారు.

అలాగే శాస్త్ర పరిశోధన సాంస్కృతిక వ్యవహారాలు శాఖ కూడా పోతుంది. ఇక విద్యా మంత్రిత్వ శాఖ రెండు భాగాలై పోతుంది. (1) విద్యాశాఖ, (2) శాస్త్రం.

విద్యాశాఖలో వెనుకటి పరిశోధన సాంస్కృతిక శాఖలోని సాంస్కృతిక వ్యవహారాలను విద్యా శాఖలో చేర్చారు. తతిమ్మా పరిశోధనకు చెందిన వ్యవహారాలన్నీ—ఏ ఒకటో, రెండో మినహా, శాస్త్ర విభాగంలోకి వస్తాయి.

అయితే ఈ మార్పుల ప్రకటన ప్రభుత్వ యంత్రాంగం పునర్వ్యవస్థీకరణాన్ని పూర్తిచేసిందా అంటే లేదనే చెప్పాలి. మరోసారి ప్రభుత్వ వ్యవహారాల పునర్వ్యవస్థీకరణం యీ నెలాఖరుకీ—యింకోసారి బహుశా జనవరి మూడోవారంలోనూ మరి రెండుసార్లు యిలాంటి మార్పులతో జరగవచ్చు.

ఇప్పుడు ప్రకటించిన యీ పునర్వ్యవస్థీకరణం అనబడే మార్పులు, సెప్టెంబర్‌లో వెలువడిన ఖేరా నివేదిక ననుసరించి చేశారు. ఖేరా కమిటీ 'బ్లాకులు' లేదా విభాగాలను ఏర్పర్చాలి అని నివేదించింది. ఈ "బ్లాకు" అనేది అన్నిటికీ వర్తిస్తుంది. తైలం, రసాయనిక ద్రవ్యాలు, (ఎరువులు పెట్రో కెమికల్స్ సహా) గనులు, ముడి లోహాలు, ఉక్కు ఇంజనీరింగ్ పరిశ్రమలు, చిన్న పరిశ్రమలు, (మాలు, నార పరిశ్రమల సహా) అన్నీ యీ నివేదికలోని ఈ సలహాకి చెందుతాయి. ఇంకా ఇందులో పారిశ్రామిక విధానం, వాణిజ్యం, విద్య, సాంకేతిక విద్య, శాస్త్ర విద్య ఇవన్నీ ఉన్నాయి. వీటిని 'బ్లాకులు'గా పునరుద్ధరించాలని ఖేరా కమిటీ నివేదిక సూచన.

రెండో విడత మార్పులలో యీ నెల ఆఖరుకు బహుశా మాలు, నార పరిశ్రమలు, అంతర్జాతీయ వ్యాపారం మంత్రిత్వ శాఖ నుంచి, పరిశ్రమల మంత్రిత్వ శాఖకు కేటాయించ వచ్చును. యింజనీరింగ్ శాఖలో ఉన్న సిమెంట్ పరిశ్రమల శాఖకు రానూవచ్చును.

ఇది ఇలా ఉంచి కొస్త గతావలోకనం చేద్దాం. 1919 నాటి సంస్కరింపబడిన రాజ్యాంగం ప్రకారం వాణిజ్య రైల్వే శాఖ, లేబర్ పరిశ్రమల శాఖా ఉండేవి. 1935 భారత ప్రభుత్వ చట్టం రాగానే వాణిజ్యం రైల్వే రెండు వేరైపోయాయి. రైల్వే కొత్త శాఖ 'రవాణా' శాఖ కిందకు వచ్చింది. అలాగే లేబర్ నుంచి పరిశ్రమలకు ఎడబాటు కలిగింది. కొత్త శాఖలకు "పరిశ్రమలు, మరియు సరఫరా" అనీ 'లేబర్' అనీ రెండు పేర్లు వచ్చాయి. ఈ లేబర్ విభాగంలోనే పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ ఉండేది. ఇంచుమించుగా ఇదే 1947 లో బ్రిటిషువారి నుంచి కాంగ్రెసు ప్రభుత్వం తీసుకున్న వ్యవస్థీకరణం. కాని, అనుభవం మీద యీ పద్ధతిలోని లోపాలు తెలిసొచ్చాయి.

**వాణిజ్యశాఖకీ, పరిశ్రమల శాఖకీ మధ్య దేవదారు చెక్కలు పేచీ తెచ్చాయి!**

దేవదారు చెక్క దిగుమతి, భారత పరిశ్రమల అభివృద్ధి దృష్ట్యా నిలుపు చెయ్యాలని పరిశ్రమల మంత్రి శాఖ అడిగితే, వాణిజ్య దృష్ట్యా విదేశీ దేవదారు కావాలని వాణిజ్యశాఖ కోరింది. ఎందుకంటే మన దేవదారు చెక్క అప్పుడు టీ గుండ పెట్టెలు చేయడానికి పనికివచ్చేది కాదు. టీ ఆకు మన దేవదారు పెట్టెల్లో ఎగుమతిచేస్తే లండన్‌లో పుచ్చుకునేవారు కాదు. ఇలాంటి అనుభవాలవల్ల కృష్ణమాచారిగారి సారథ్యాన కొత్త వాణిజ్య మంత్రిత్వశాఖ రూపొందింది. ఆ తర్వాత శ్రీయుతులు మొరార్జీ, లాల్‌బహదూర్ శాస్త్రి, కె. సి. రెడ్డి ప్రభృతులు ఈ శాఖ సారథ్యం చేపట్టారు. రెడ్డిగారు దీనికి స్వస్తి వాచకం కూడా పలికారు. రెడ్డిగారి హయాంలోనే, ఈ వాణిజ్య పరిశ్రమల శాఖ నుంచి భారీ పరిశ్రమల విభాగాన్ని తీసి సి. సుబ్రహ్మణ్యం గారికి అప్పగించడం జరిగింది. మాలు, నార పరిశ్రమలు వాణిజ్య శాఖలో చేరాయి. కె. సి. రెడ్డి రాజీనామాతో యిది రెండు ముక్కలై సహాయ మంత్రుల హస్తగతమైంది.

చివరికి రసాయనిక ద్రవ్యాలు కూడ లేక పోవడంతో పరిశ్రమల మంత్రిత్వశాఖ ఇలా ఉంది :

(1) సామాన్య పారిశ్రామిక విధానం (2) పరి

47 వ పేజీ చూడండి



అమెరికా 35—వ అధ్యక్షుడు జాన్ కెనడీ హత్యకు సంతాపసూచకంగా ఢిల్లీలోని అమెరికన్ రాయబార కార్యాలయం మొన్న 25—వ తేదీన ప్రత్యేకప్రార్థనలు జరిపింది. రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్, ప్రధాని నెహ్రూ హాజరైనారు. అమెరికన్ వ్యవహారాల ప్రత్యేకోద్యోగిగా పనిచేస్తున్న శ్రీ జోసెఫ్ గ్రీన్ (జూనియర్) మాటాడుతున్నారు.

# అమెరికాలో జాతి

ఏ। చ। ఉ। ఆ।



*పూర్తిగా కాకపోయినా స్వాతంత్ర్యం సమాజంలో గౌరవం నీగ్రోవారు ఎప్పటికి సాధిస్తారో చెప్పటం కష్టం .... కాని అది ఆలస్యంగా జరిగితే మాత్రం ప్రమాదకరం.*

## నీగ్రోల స్వతంత్ర ఉద్యమం సంక్షిప్త చరిత్ర:

మొదటి నుంచీ అమెరికాలో నీగ్రోలు బానిసలుగా ఉన్నారనుకోనటం పొరబాటు, కొలంబస్ తోపాటే కొందరు అమెరికాకి వలస వచ్చారు. స్వతంత్రులుగా స్థిరపడిపోయి పెద్ద భూస్వాములుగా పేరు పొందిన వారు కూడా ఉన్నారు. జార్జి వాషింగ్టన్ సైన్యాలలో 5,000 మంది నీగ్రో సైనికులు (బ్రిటీషు వారికి ఎదురుగా) పోరాడారు.

క్రమంగా నీగ్రో జాతివారు బానిసలయిపోయారు. కాని, బానిసత్వాన్ని 'వినయంగా' స్వీకరించలేదు. అమెరికన్ అంతర్యుద్ధానికి ముసుపే నీగ్రో తిరుగుబాట్లు రెండు వందల పైయిన్నైగా జరిగాయి.

ఇదికాక బానిసవృత్తి అమానుషమైనదనే వైతన్యం శ్వేతజాతివారిలోనే కొందరిలో కలిగింది.

1807 లో బానిసల దిగుమతి నిషేధించారు. (1804 కే ఉత్తర అమెరికా రాష్ట్రాలలో బానిస వృత్తి రద్దుచేశారు.)

1815 తర్వాత బానిస పద్ధతి రద్దు చెయ్యాలనే ఉద్యమాలు, సంఘాలు ప్రారంభం అయ్యాయి. వీరిలో ప్రముఖుడు బెంజమిన్ లుండీ అనే క్వేకర్ మతస్థుడు ఒకడు. ఈ ఉద్యమాల నాయకులు బానిస వృత్తి క్రమంగా, శాంతియుతంగా పోవాలని ఆశించారు. వారి ఆశ ఫలించలేదు.

బోస్టన్ (కే. శే. కెన్నెడి ఊరు) బానిస పద్ధతి వ్యతిరేక ఉద్యమాలకి కేంద్రంగా ఉండేది. 1840 కి సుమారు 2 లక్షల సభ్యులు కల 2000 సంఘాలు వెలిసాయి.

1837 ఇల్లినాయ్ (అబ్రహాం లింకన్ రాష్ట్రం; చికాగో ముఖ్య పట్నం కలది) లో ఆల్టన్ అనే ఊరిలో ఎలిజాలవ్‌జాయ్ అనే వ్యక్తిని బానిస వృత్తి రద్దు చెయ్యమని ప్రచారం చేసినందుకు బహిరంగ హత్య చేశారు.

1830—60 మధ్య కాలంలో సుమారు 60,000 మంది నీగ్రో బానిసలు దక్షిణ రాష్ట్రాల నుంచి ఉత్తర రాష్ట్రాలకి పారిపోయారు.

దక్షిణ అమెరికా రాష్ట్రాల ఆర్థిక పరిస్థితి పత్తి వ్యవసాయంమీద ఆధారపడి ఉండేది. ఈ వ్యవసాయం, అధికంగా, నీగ్రో బానిస కృషి మీదనే ఆధారపడి ఉండేది. దక్షిణ ప్రాంతాలవారు బానిస వృత్తి రద్దుకి అంగీకరించక పోవటానికి బలమయిన కారణాలలో ఇది ఒకటి అంటారు.

అమెరికాలో అంతర్యుద్ధం రావటానికి బానిస పద్ధతి ముఖ్య కారణం అనవచ్చు. ఉత్తర అమెరికా ప్రాంత రాష్ట్రాల నాయకుడు అబ్రహాం లింకన్. అమెరికా సంయుక్త రాష్ట్రాల ఏకీకరణకి కారణభూతుడయిన ఈ అమెరికన్ అధ్యక్షుడే నీగ్రోలను విడుదల చేశాడనవచ్చు.

"I do order and declare that all persons held as slaves within said designated States and parts of States are, and henceforth shall be, free" అన్నాడు అబ్రహాంలింకన్ 1863లో.

1861 లో మొదలయిన యుద్ధం 1865 లో ముగిసింది. 1865 ఏప్రిల్ 14 వ తేదీన అబ్రహాం లింకన్ హంతకుడి తుపాకి దెబ్బకి గురి అయ్యాడు.

లింకన్ మరణించిన సంవత్సరమే అమెరికన్ రాజ్యాంగంలో మూడు సవరణలుచేసి, బానిస పద్ధతిని పూర్తిగా రద్దు చేశారు. పూర్తి స్వతంత్రానికి అవకాశం కల్పించారు. కాని నీగ్రోలు స్వతంత్రులు కాలేదు. మొదట్లో ఉత్తర అమెరికా రాష్ట్రాలవారి ప్రోత్సాహంతో నల్లవారు కూడా శాసన సభలలోనే చేరినప్పటికీ, తర తరాలుగా బానిసలుగా అణగ దొక్కబడిన వీరు తమ వ్యవహారాలను సక్రమంగా నిర్వహించుకొనలేక పోయారు. దీనిని

చిన్న పిల్లవాడితో ఏదో సమాలోచనలో ఉన్న అబ్రహాం లింకన్.



# తరతరాల బానిసత్వం: ఒక ప్రత్యేక సమీక్ష

పురస్కరించుకొని ఆ ప్రాంతాల తెల్లవారు నీగ్రోలని తిరిగి అణిచి వేశారు జాతి విచక్షణ అన్ని విధాలుగానూ, ఆచరణలో పెట్టారు విచక్షణ బలపరచేందుకు కావలసిన చట్టాలు కూడా అమలులోకి తెచ్చారు వీటిని రద్దు చేసి గౌరవ మర్యాదలతో అమెరికన్ సమాజంలో స్వతంత్రులుగా తెల్లవారితో సమానంగా బ్రతకాలని నీగ్రోలు చేసే ప్రయత్నాలే నేడు ఇన్ని అల్లర్లకి, ఆందోళనలకి దారితీశాయి. ఒక విధంగా జాన్ ఫిట్జ్ జెరాల్డ్ కెన్నెడీ హత్యకు మూల కారణం ఈ సమస్యే అనుకోవచ్చు.

1918 దాకా ముప్ఫయి ఏళ్ళలో 3224 నీగ్రోలని తెల్లవారు దారుణంగా హత్య చేశారు. ఈ హత్యలని 'లించింగ్' అంటారు. (వాల్డోస్టా అనే ఊరిలో నేరం చెయ్యని తన భర్తని అనవసరంగా చంపుతున్నందుకు ఏడుస్తున్న ఒక నీగ్రో వనితని ఉరితీశారు. అప్పు డామె గర్భవతి)

ఈ శతాబ్దం ప్రారంభంలో డబ్ల్యు. ఇ. బి. డుబాయిస్ (దుబ్వా అవుతాడు అసలు ఫ్రెంచిలో!) అనే ఒక అమెరికన్ నీగ్రో మేధావి 'నయాగరా మువ్‌మెంట్' అనే ఉద్యమం లేవదీశాడు. (1905 లో నయాగరా జలపాతం దగ్గర మొదటి సమావేశం జరిగింది)

ఈ సందర్భంలోనే నేడు ప్రసిద్ధి పొందిన సంస్థ ఎన్. ఎ. ఎ. సి. పి. (నేషనల్ ఎసోసియేషన్ ఫార్ ది ఎడ్వాన్స్‌మెంట్ ఆఫ్ కలర్డ్ పీపిల్) జన్మించింది

## లించింగ్ నేరం కాదా?

లించింగ్ ఇంతవరకూ నేరంగా గుర్తించటం లేదు అమెరికన్ చట్టం! కాని ఎన్. ఎ. ఎ. సి. పి. కృషి వల్ల ప్రజలే ఈ రకమయిన బహిరంగ హత్యలని, క్రమంగానూ మానివేశారు.

1959 లో చివరి (నేటి దాకా) లించింగ్ జరిగింది (1940 లో 5 నీగ్రోలని 'లించ్' చేశారు)

కాని వీటన్నిటికన్నా గొప్ప విజయం 1954–55 లో అమెరికన్ సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు: పాఠశాలలలో జాతి విచక్షణ చట్ట విరుద్ధమని.

ఇది పెద్ద విజయమే అయినప్పటికీ తీర్పుని ఆచరణలోకి పెట్టటం ఇంతవరకూ సరిగ్గా జరగ లేదు

మిసిసిపీలో, అలబామాలో అన్ని విధాలా అర్హులయిన నీగ్రో విద్యార్థులు చట్ట ప్రకారం విద్య అభ్యసించకపోతేనే ఇంత అలజడి జరిగింది. పూర్తిగా కాకపోయినా, చెప్పుకోతగ్గ స్వాతంత్ర్యం, సమాజంలో గౌరవం నీగ్రోజాతివారు ఎప్పటికి సాధిస్తారో చెప్పటం కష్టం కాని అది ఎంత ఆలస్యంగా జరిగితే అంత ప్రమాదకరం. నీగ్రోజాతివారి సహనానికి నియతం ఒక పరిమితి అంటూ ఉంది ★

● విష్ణు, మను, బృహస్పతి, పరాశర, యాజ్ఞవల్క్య, స్మృతులలో (నేడు) హరిజనులన బడేవారు చెయ్యవలసినవని చెప్పిన పనులు: అన్నిటి కంటే అతి నీచమయిన పనులే అవి, అందరూ తమవి కావని వదిలిన శవాలు మొయ్యటం, నేరస్తులకి మరణశిక్ష విధించటం, రాత్రివేళల గ్రామాలలో, పట్నాలలో తిరగకుండా ఉండటం, పగటి వేళలలో ఊరిలోకి వచ్చినట్లయితే వారు ఫలానా వర్ణం వారని తెలిపే చిహ్నాలు ధరించటం.

● ఒక జాతక కథలో హరిజనులని చూసినందుకు కొందరు 'అగ్రజాతి' వనితలు తమ కళ్ళను సుగంధ జలాలతో కడుక్కున్న సంఘటన ఉంది

● మను సంహిత ప్రకారం బ్రాహ్మణుడు ఒక శూద్రుని చంపితే చేసే ప్రాయశ్చిత్త కర్మ ఒక పిల్లి, కప్ప, కుక్క లేక కాకిని చంపినట్లయితే చేసే దానికి సమానంగా ఉంటే చాలు.

● అత్రి, అంగీరస శాతతాప ఔశనస స్మృతుల ప్రకారం చండాలుని నీడ పడినంత మాత్రాన స్నానంతో శుద్ధి అవసరం. (మేధాతిథి మాత్రం నీడ పడితే 'అశుచి' కాదన్నాడుట.)

● విజయనగర సామ్రాజ్య కాలంలో కూడా బానిస పద్ధతి భారతదేశంలో వాగావాడుకలో ఉండేది.

● 20 వ శతాబ్దంలో కూడా, ఆంధ్ర దేశంలో ఒక గ్రామంలో, తమ చెరువులో చేపలు పట్టినందుకు కొంతమంది బ్రాహ్మణులు ఒక హరిజనుడిని రాళ్ళతో కొట్టి చంపారు.

● సాధారణంగా 'దండా' అని తలని వంకరిస్తూ వచ్చిన ఒక హరిజన వ్యక్తి ఒకరోజున 'నమస్కారం' అన్నందుకు చెప్పుతో కొట్టాడుట ఒక పెద్ద మనిషి. ఎందుకని అడుగగా, అంత పెద్ద మాట వాడే హక్కు వాడికి లేదన్నాడుట ఈ పెద్దమనిషి. (ఈ సంఘటన ఒక ప్రసిద్ధ ఆంధ్ర రచయిత అనుభవంలో జరిగింది.)

[ఈ క్రింది 'వ్యాసం' రచయిత పోయిన సంవత్సరం అమెరికా పర్యటించారు.]

## 'నా అనుభవాలు'

కొన్ని వారాలు అమెరికా పర్యటించినంత మాత్రాన ఆ దేశంలో జాతి విచక్షణని గురించి ఎక్కువగా తెలుసుకొన్నా ననుకోవటం సాహసమే కాని కొందరు వ్యక్తులు, కొన్ని సంఘటనలు కొన్ని సందర్భాలలో రాజకీయ—సాంఘిక చైతన్యం కలవారెవరిమీదనయినా తమ ప్రభావం లేకుండా ఉండవు. జాతి, వర్ణం, వీటికి సంబంధించిన కొన్ని సంఘటనలని ఇక్కడ వర్ణిస్తాను.

న్యూయార్క్‌లో నాలుగు వారాలున్నప్పటికీ, 'తెలుపు—నలుపు సమస్యలు' అధికంగా గమనించే అవకాశం లేకపోయింది. నీగ్రోలతో పరిచయం కూడా ఎక్కువగా లభించలేదు.

మేము వాషింగ్‌టన్‌కి వెళ్ళే సమయానికి మిసిసిపీలో జేమ్స్ మెరిడిత్ అక్కడ విశ్వ విద్యాలయంలో చేరినందువల్ల అల్లర్లు మొదలయ్యాయి. అమెరికాలో మేము ఎవరి ఆతిథ్యం పొందుతున్నామో వారు మా బృందానికి అమెరికా ఎటార్నీ జనరల్ అయిన శ్రీ రాబర్ట్ కెన్నెడీతో సమావేశం ఏర్పాటు చేశారు.



ప్రత్తి పొలాలలో పనిచేస్తున్న నీగ్రోలు: పాత చిత్రపటం

# అమెరికాలో జాతివిచక్షణ

శ్రీ కెన్నెడీ ఆఫీసు ఉన్న కట్టడం ప్రవేశించిన కొన్ని నిముషాలలో ఆయన గదిలోకి వెళ్ళాము పొట్టిగా, చాలా పడుచుగా కనిపిస్తున్న బాబ్ కెన్నెడీ మమ్మల్ని అందరినీ కరచాలనంతో ఆహ్వానించి కుర్చీలు చూపించారు రెండు మూడు కుర్చీలు తక్కువయితే తామే వేగంగా నడిచివెళ్ళి పక్క గదిలోనుంచి కొన్ని కుర్చీలు తీసుకువచ్చి వేశారు.

కొంతసేపూ ఇవీ అవీ గురించి మాట్లాడాము సంభాషణ చివరికి జాతి విచక్షణమీదకి వెళ్ళింది నీగ్రోల పరిస్థితి ఎప్పటికయినా బాగుపడుతుందా అని అడిగారు మాలో ఒకరు. దానికి బాబ్ కెన్నెడీ చెప్పిన సమాధానం సారాంశం: ఒక తరం క్రితం తమ తండ్రి శ్రీ కెన్నెడీ బాస్టన్‌లో చాలా ధనవంతుడుగానూ, మేయర్‌గానూ అందరికీ పరిచితుడయినప్పటికీ 'మంచి' క్లబ్బులలోకీ, కొన్ని సంస్థలలోకీ అతన్ని రానిచ్చేవారు కాదుట—దీనికి కారణం ఆయన ఐరిష్ 'జాతి' వాడవటం. బాస్టన్‌లో ఐర్లాండ్ దేశం నుంచి వలస వచ్చిన వారంటే తక్కువగా చూసేవారుట. నేడు చూస్తే తన అన్న అమెరికా సంయుక్త రాష్ట్రాలకి అధ్యక్షుడయిపోయాడు కదా! క్రమంగా నీగ్రోలు తెల్లవారితో సమానం అవుతారని శ్రీ బాబ్ కెన్నెడీ నమ్మకం......

* * *

మరొక సంఘటన: ముగ్గురు దక్షిణ భారతీయులం ఒక్లహామా పట్నానికి వెళ్ళాము. అక్కడ విమానాశ్రయంలో ఒక పెద్ద వార్తా పత్రిక సంపాదకుడు (కొన్ని లక్షల కాపీలు అమ్మకం కలది) మాకు స్వాగతం ఇచ్చాడు. మా పెట్టెలు కూడా మోశారు. మేము నలుగురూ, ఆయన కూతురూ, ఒక పెద్ద హోటల్‌కి వెళ్ళాము మా రిజర్వేషన్‌ల సంగతి మా సంపాదక మిత్రుడే మాట్లాడి ఖాయం చేశాడు ఉన్న నాలుగు రోజులూ హోటల్‌లో మాకే ఇబ్బందీ కలగలేదు

అయితే ఒక సాయంత్రం మేము షికారుకి వెళ్ళినప్పుడు జాతివిచక్షణ ప్రసక్తి వచ్చింది. అప్పుడు ఆయన చెప్పాడు, మేము ఉండే హోటల్‌లో నీగ్రోలని ఉండనివ్వరని మేము మాత్రం ఎలా సరిపోయామని నేను అడగ్గా, "భారతీయుల సంగతి వేరు" అని ఆయన జవాబు చెప్పాడు (నాకు ఆయన జవాబు సంతృప్తికరంగా తోచలేదు). చాలామంది నీగ్రోలు శ్వేతజాతి వారిలాగే ఎర్రగా, కందగడ్డలాగ కూడా ఉంటారు. ఈ విషయం గుర్తుచేసి, మా జుట్టు ఉంగరాలలాగ లేకపోవటం తప్ప ఎందరో నీగ్రోలు, కొందరు మెక్సికన్‌లు, అరబ్బులు మాలాగే ఉంటారన్నాను. చివరికి తేలిందేమిటంటే జాతి విచక్షణ సరిహద్దులు ఎక్కడ ప్రారంభం అవుతాయో చెప్పటం కష్టం అని. (వైట్ అనే నీగ్రో నాయకుడికి బంగారు జుట్టు, నీలం కళ్ళు ఉంటాయి.)

ఈ చర్చ తర్వాత మాత్రం ఆ హోటల్లో ఎందుకు దిగామా అనుకున్నాము కాని గత్యంతరం లేక అక్కడే ఉండిపోయాము......

* * *



రాబర్ట్ కెన్నెడీ

శాన్‌ఫ్రాంసిస్కోలో నలుగురం ఒక టాక్సీలో ప్రయాణం చేస్తున్నాము: మలయానుంచి ఒక చైనా జాతి వ్యక్తి (అంటే ఆయనకి చైనీస్ రాదు. తర తరాలుగా వలసకివచ్చి స్థిరపడిపోయిన వంశంవాడు), ఒక పాకిస్తానీ— హైదరాబాద్, సింధ్‌లో ఒక పత్రిక సంపాదకుడు, ఇద్దరు దక్షిణ భారతీయులం, మా టాక్సీ డ్రయివర్ నీగ్రో. మాలో ఒకరు అతనితో జాతివిచక్షణ చర్చ ప్రారంభించాడు. శ్రీ లూథర్‌కింగ్—అమెరికాలో గాంధీ పద్ధతిలో సత్యాగ్రహం ఉద్యమం లేవదీసిన ఫాదరీ, నీగ్రో నాయకుడుని— కొద్దిగా విమర్శించాడు. నేను కింగ్ చాలా గొప్పవా డన్నాను. టాక్సీ డ్రయివర్ కారు ఆపి మీరంతా ఎక్కడి వారని అడిగాడు. నేను వివరాలు చెప్పి, మనమంతా 'శ్వేతేతరులం' లేక నల్లవాళ్లం అన్నాను. "నో మై ఫ్రెండ్. బ్లాక్ ఈజ్ ఏన్ ఆబ్‌స్ట్రాక్షన్. ఇటీజ్ ది వైట్స్ హూ ఆర్ కలర్డ్!" అన్నాడు టాక్సీ డ్రయివరు. నేను నిరుత్తరుడయిపోయాను. కాని తేరుకుని లూథర్ కింగ్ అంటే గౌరవంలేదా అని అడిగాను.




ఇటీవల వాషింగ్‌టన్‌లో తెలుపూ-నలుపూ కలిసి లక్షమంది పాల్గొన్న 'సివిల్ రైట్స్ మార్చ్'

అతని సమాధానం నా కింకా ఆశ్చర్యం కల గించింది. అతను ఒక "బ్లాక్ ముస్లిం", ఈ బ్లాక్ ముస్లిం ఉద్యమం ఇటీవలే ప్రారంభం అయింది. వీరికి శాంతి యుతమయిన పద్ధతు లంటే అసహ్యం. తెల్లవారందరినీ ఒకప్పుడు హత మార్చాలంటారు.

మా పాకీస్తానీ మిత్రుడు వెంటనే అతనిమీదకి వంగి, "అర్ యు ఎ ముస్లిం?" అని అడిగాడు. అతను అవునని చెప్పాడు. మళ్ళీ.

"అబ్ సలామలైక్కుం!" (కనీసం హిందీ ఉర్దూ రాని నాకు అలా వినిపించింది) అని ఇతను నీగ్రో డ్రయివర్‌ని కౌగలించుకున్నాడు సీటు అడ్డంగా ఉన్నా. అందరం కారు దిగాము. మళ్ళీ వా రిద్దరూ కౌగలించుకుని ఏవో మాట్లాడు కుంటుంటే తక్కిన ముగ్గురం డబ్బులు చెల్లించి నడిచి వెళ్ళి పోయాను...... రై.

[ఒక అమెరికన్ నీగ్రో సాధించ లేనంత పరిపూర్ణంగా ఎందరో ఆశియన్లు పశ్చిమ (దేశాలని) ద్వేషించడం గమనించాను నేను... అతనికి ప్రత్యేకంగా జరిగిన అన్యాయాలు తీరగానే (అమెరికన్) నీగ్రోల దృక్పథం మామూలు అమెరికన్ దృక్పథంగా మారి పోయేది. కాని, తను స్వీకరించిన, లేక స్వీకరించినట్లు నటించిన పాశ్చాత్య సంస్కృతికి ముందు ఆసియన్‌కి స్వంత సంస్కృతి ఒకటి ఉండేది. అందుకనే పాశ్చాత్య (సంస్కృతి) పట్ల అతనికి ఒక విధ మయిన దూరభావం, నిష్పక్షపాత దృష్టి ఉండేది; పశ్చిమ వాతా




జాతివిచక్షణలేని ఒక స్కూలులో దృశ్యం.

వరణంలో కలిగిన అత్యంత గాఢాను భూతులలో కూడా ఇవి అడ్డువచ్చేవి.]

రిచర్డ్ రైట్
(ప్రఖ్యాత నీగ్రో రచయిత.) ★

# జాతి విచక్షణ స్వరూపాలు:

అనాదిగా వర్ణ విభేదాలు పాటిస్తూ, తక్కువ జాతివారని కొందరికి తీరని అన్యాయం చేసిన భారత దేశీయులు నేడు అమెరికాలో జాతి విచక్షణ ఉందని వేలెత్తి చూపటం విడ్డూరంగానే ఉంటుంది. అయితే, మనదేశం ఎన్నో విధాల వెనుక బడిన దేశం. ఆధునిక భావాల ప్రభావం క్రింద భారత దేశంలో కూడా కులానికి (వర్ణానికి) సంబంధించిన విచక్షణ క్రమంగా నశిస్తోందనే నమ్మవచ్చు. ఇతర విషయాలలో ఇంత ముందుకి వచ్చిన అమెరికాలో ఇంకా నల్ల జాతి వారయిన నీగ్రోల పరిస్థితి ఇంకా దుర్భరంగా ఉండటం ఆశ్చర్యకరమే.

నీగ్రోలకి ఉద్యోగాలలో, చదువులో, రాజకీయ—సాంఘిక హక్కుల విషయంలో అన్యాయం జరుగుతోంది.

**విద్య:**—నీగ్రో జాతివారికి విద్యా సౌకర్యాలు సరిగ్గా లభించటంలేదు. ఒక నీగ్రో విద్యార్థి కాలేజిలో చేరినందువల్ల దేశమంతా అల్లర్లు జరిగాయి. వేలకొలది, తెల్లవారు తమ అభ్యంతరం తెలిపారు. అమెరికా కేంద్ర ప్రభుత్వం కలగజేసుకునేదాకా శాంతియుతమయిన పరిస్థితులు ఏర్పడలేదు.

1962 దాకా 17 దక్షిణ అమెరికన్ రాష్ట్రాలలో మిశ్రమ పాఠశాలలలో చేరిన నీగ్రో విద్యార్థు(ర్థిను)ల సంఖ్య మొత్తం నీగ్రో పిల్లల సంఖ్యలో 7.9% మాత్రమే. అంతకు ముందు ఏడాదిమీద అభివృద్ధి 0.1% కన్నా తక్కువ. అలబామా, మిసిసిపీ దక్షిణ కేరొలినా రాష్ట్రాలలో 'నట్ కాలేజీ' తరగతులలో ఒక్క నీగ్రో విద్యార్థి కూడా లేడు. ఇది దక్షిణ ప్రాంతాలలో పరిస్థితి. ఉత్తర అమెరికా ప్రాంతాలలో కూడా 'అనధికార' విచక్షణ చాలా ఉంది. దీనిని నిర్మూలించటం ఇంకా కష్టం. (మన దేశంలో హరిజనేతరులు తమ ఇళ్ళలో వాటాలని హరిజనులతో పంచుకొనటానికి ఎంత సిద్ధంగా ఉన్నారో ఆలోచించటం అవసరం. బ్రిటన్ వంటి దేశంలో సైతం తెల్లజాతికి చెందని వారి విషయంలో విచక్షణ జరుగుతోందని అందరూ ఒప్పుకుంటున్నారు.)

**ఓటింగ్ హక్కులు:**— దక్షిణ ప్రాంతం రాష్ట్రాలలో నీగ్రోల ఓటింగ్ హక్కుల విషయంలో అన్యాయం జరుగుతోంది. నీగ్రోలు తమ పేర్లను రిజిస్టర్ చేసుకోకుండా అడ్డు పడుతున్నాయి అక్కడ అధికార వర్గాలు. మొత్తం ఓట్లు హక్కులున్న వారిలో 29% మాత్రమే రిజిస్టర్ అయ్యారని అంచనా. ఈ అన్యాయాలని అరికట్టే చట్టాలు ఇంకా పూర్తిగా అమలులోకి రాలేదు. శాసనసభలో వీటి పురోగమనం చాలా మందంగా సాగుతోంది. (కీ. శే. జాన్ ఎఫ్. కెన్నెడీ, అతని తమ్ముడు రాబర్ట్ కెన్నెడీ మొత్తం మీద నీగ్రోల హక్కుల విషయంలో కృషి చేశారనే అంగీకరించాలి. శాసన సభలలో, కృషికి హత్య చేయబడ్డ అధ్యక్షుడు కెన్నెడీ చాలా తోడ్పడ్డాడు.)

**ఉద్యోగాలు:**—శ్వేతేతర జాతివారి సగటు సాంవత్సరిక కుటుంబ ఆదాయం నేడు 3191 డాలర్లు.(అంటే సుమారు 15,950 రూపాయలు.) శ్వేతజాతి ఆదాయంలో ఇది 53% మాత్రమే.

నిరుద్యోగుల సంఖ్య మొత్తంలో 10.7% (శ్వేతజాతివారిలో నిరుద్యోగుల శాతం ఇందులో సగం కూడా లేదు). కార్మిక సంఘాల విధానాలు సైతం జాతి విచక్షణ పద్ధతులు అవలంభిస్తున్నాయి. ఉద్యోగాలలో వాటాలు ఉండాలని కొందరు నీగ్రో నాయకులు వాదించినా మొత్తంమీద ఈ వర్గంవారు దీనికి ఇష్టపడటం లేదుట. కేవలం అర్హతమీదనే ఉద్యోగాలు రావాలంటున్నారుట.

**గృహవసతి:**—తెల్లవారు ఉండే పేటలలో నీగ్రోలకి సాధారణంగా ఇళ్ళు దొరకవు. కావాలన్నా దొరకవు. ఒక వేళ నీగ్రోలు కొందరు స్థలాలు, ఇళ్ళు సంపాదిస్తే అక్కడి ధరలు పడిపోతాయిట. అందుకోసం కూడా ఇతరత్రా అభ్యంతరం లేనివారు నీగ్రోలతో ఈ వ్యాపారం చెయ్యరుట.

**విచక్షణ ఉదాహరణలు మరికొన్ని:**—బస్సులలో, రైలు బళ్ళలో, పాయిఖానాలలో, హొటళ్ళలో, సినిమా థియేటర్లలో విచక్షణ ఉంది.

ఇది క్రమంగా తగ్గుతోందని అంగీకరించాలి కాని నీగ్రోలు ఇంకా ఎన్నాళ్ళు తమకి జరిగే అన్యాయాలని శాంతంగా సహిస్తారనేది పెద్ద ప్రశ్న. ఈ సంవత్సరం మధ్యలో జరిగిన ప్రదర్శనలే ఈ ప్రశ్నకి జవాబేమిటో సూచిస్తున్నాయి. ★

కళాసాన్ దేవాలయం



జావా, బాలి, సుమిత్రా కుమాంతాన్ మొదలైన ద్వీపాలతో; 960 లక్షల జనాభాతో-రకరకాల సంస్కార, సంస్కృతులతో నిండిన దేశం.

## మూడు వేల ద్వీపాల దేశం

క. దివ్యజ్ఞాన సరోజినీదేవి.

# ఇండోనేషియా యాత్ర!

'ఇండోనేషియా వనితా కాంగ్రెసు' అధ్యక్షురాలు శ్రీమతి సుభాద్రియో ఆహ్వానముపై మమ్ముల నలుగురును ఇండోనేషియా పంపుటకు అఖిలభారత మహిళా సభవారు నిర్ణయించిరి. జూలై మూడవ తేదీనే ఇండోనేషియాలో ఉండవలయును కాబట్టి జూలై రెండవ తారీఖున ఢిల్లీలో బయలు దేరుటకు నిశ్చయింపబడినది. కాని దేవుడు వరమిచ్చిన పూజారి వరమివ్వడన్నట్లు జూలై ఒకటవ తారీఖు సాయంకాలము వరకు రిజర్వు బ్యాంకునుండి సమ్మతి పత్రము రాలేదు. ఇహ వెళ్ళే ఆశలు వదులుకోబోతుండగా ఆ రోజు సాయంకాలము అయిదు గంటలకు రిజర్వు బ్యాంకు తన సమ్మతిని తెలిపింది. మరునాడు పదిగంటలక ప్రయాణము. ఇహ చూసుకోండి! టిక్కట్లు కొనటమేనా, అక్కడివారి కివ్వటానికి బహుమతులు కొనటమేనా, స్నేహితులకు వెళ్ళుతున్నామని చెప్పటమేనా, సర్దుకోవటమేనా ఒకటే హడావుడై పోయింది.

మరునాటి ఉదయము తొమ్మిది గంటలకు పాలం విమానాశ్రయము చేరాం. పది గంటలకు విమానం బయలుదేరుతుంది. కస్టమ్స్ వారు మా దగ్గిరున్న విలువైన వస్తువుల నన్నిటిని వ్రాసుకొన్నారు. పాస్‌పోర్టుల, హెల్తు సర్టిఫికెట్ల పరీక్షానంతరము పది గంటల కింకా పది నిముషము లున్నందనగా విమాన మెక్కాం. మేము ఎక్కిన బి. ఓ. ఎ. సి. విమానము ఇండోనేషియాకుపోదు. సింగపూర్ మీదుగా పశ్చిమ దేశములకు పోతుంది. అందుచేత సింగపూర్‌లో ఆరోజాగి మరునాటి సాయంకాలము ఇండోనేషియాకు వెళ్ళేటట్లు ఏర్ లైన్స్‌వారు ఏర్పాటు చేశారు.

## సింగపూర్ బజారు

మా విమానము హాంకాంగ్ మీదుగా సింగపూర్‌ను సాయంకాలము చేరుకొన్నది. సింగపూర్‌లో ఒక హోటలులో మాకు బస ఏర్పాటు చేయబడినది. అప్పటికే చీకటై పోవటం వలన మాకానాడు యేమీ చూడటానికి వీలుపడ లేదు. కార్లో మాత్రము నగరమంతా చుట్టి చూచాం. విద్యుద్దీప కాంతిలో ఆ నగరము చాల అందముగా ఉంది. దుకాణముల బోర్డులపై మలయా భాషేగాక, అక్కడక్కడ తమిళ అక్షరములు కూడ కనపడినవి. ఇక్కడ మన దేశీయులు, అందులో ముఖ్యముగా తమిళులు చాలామంది ఉన్నారు.

మరునాటి ఉదయము మా మిత్రు లొకరు వచ్చి మమ్ములను అక్కడి దుకాణాలు చూపించటానికి తీసుకు వెళ్తామన్నారు. సింగపూర్ దుకాణాలనగానే యేస్త్రీకైన ఎక్కడలేని ఉత్సాహము వస్తుంది. కాని మా చేతి సంచులలోవున్న 45 రూపాయలు (ఇండియా ప్రభుత్వమంతే అనుమతిస్తున్నది) జ్ఞాపకము రాగానే మా ఉత్సాహము చప్పగా చల్లారిపోయింది. అయినా కళ్ళతోనైన చూసి ఆనందించవచ్చుగదాని వెళ్ళాము. ఇక్కడ ఎగుమతి, దిగుమతి సరుకులపై పన్నులేదు. అందుచేత ఇక్కడ దొరకని వస్తు వంటులేదు. ఖరీదులు కూడ చాల తక్కువే. మధ్యాహ్నము వరకు దుకాణములలోని వింతలన్ని చూసి, భోంచేసి మరల ప్రయాణానికి సిద్ధమైనాము.

సింగపూర్‌లో అయిదు గంటలకు బయలుదేరిన విమానం రెండు గంటలనంతరము ఇండోనేషియా రాజధానియైన 'జకార్తా' చేరింది. అక్కడ విమానాశ్రయములో వనితా కాంగ్రెసు ప్రతినిధులు మమ్ములను పూల మాలలతో ఆహ్వానించారు. ఈ వనితా కాంగ్రెసు సమావేశానికి మన దేశమునుండేగాక, సిలోను, మలయా, ఫిలిప్పీన్స్, బ్రిటన్, అమెరికాలనుండి కూడ ప్రతినిధులు వచ్చారు.

## మూడు వేల ద్వీపాలు!

ఇండోనేషియా మూడువేల ద్వీపములతో కూడిన దేశము. వీటియందు జావా బాలి, సుమిత్రా, సులవేసి, కలిమాంటాస ముఖ్యమైనవి. ఇండోనేషియా రాజధానియైన జకార్తా పట్టణము జావా ద్వీపములోది. ఇండోనేషియా ప్రస్తుత జనాభా 960 లక్షలు. అందులో 630 లక్షల జనాభా జావా ద్వీపములోనే. జకార్తా పట్టణములో జనాభా ముప్పది లక్షలు ఉంటుంది. ఇక్కడ కూడ మగవారికన్నా ఆడవారే ఎక్కువట.

జకార్తా స్వాతంత్ర్యము పిమ్మ టిప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న నగరము ఇక్కడ రెండే రెండు పెద్ద భవనము లున్నవి. ఒకటి ఆసియన్ గేమ్స్ పెవలియన్. రెండవది పదునాలుగంతస్థుల 'హోటల్ ఇండోనేసియా' భవనము. ఇక్కడే మా బస ఏర్పాటు చేయబడినది. పాశ్చాత్య నవనాగరికతతో చక్కగా కట్టబడినదీ భవనము. కాని ఇటువంటి హోటళ్ళు ఇండోనేషియాలో మరెక్కడా కనపడవు. ఈ దేశముగో హోటలు వసతు లింకా అభివృద్ధి చెందలేదనే చెప్పాలి. ఇక్కడ నన్నెక్కువగా ఆకర్షించినది ఇక్కడి స్త్రీల శక్తి సామర్థ్యములు. వారన్ని ఏర్పాట్లను యేమాత్రము లోపము లేకుండా చక్కగా చేయగలిగారు. ఇక్కడి స్త్రీలు తలుచుకొన్న పని సాధించేదాక విడవరనిపించినది నాకు.

## "ఇండోనేషియాలో లావుపాటివారు ఎక్కడో నూటికి ఒకరు కనిపిస్తారు సన్నగా, పడుచుదనంతో ఉండటానికి వాళ్లు కషాయాలు సేవిస్తారు."

ఆ రోజు రాత్రి శ్రీమతి సుబాంద్రియో గృహములో విందు భోజనము. అక్కడ మేము మిగిలిన దేశ ప్రతినిధులను కూడ కలుసుకోగలిగాము. మరువాటి ఉదయమునుండి పదకొండవ తారీఖు వరకు ఒక్క నిముషము వ్యవధి లేకుండా మాకు ప్రోగ్రాము ఏర్పాటు చేయబడిందని, మాకు జావా అంత తిరిగి చూడటానికి మూడు బస్సులు ఏర్పాటు చేయబడినవని, తను కూడ మాతోపాటే జావాఅంత ప్రయాణము చేస్తానని శ్రీమతి సుబాంద్రియో మా కిక్కడ తెలిపారు.

### సుకార్నో: చిత్రకళ!

మరువాటి ఉదయము తొమ్మిది గంటలకు మేమంతా తయారై అధ్యక్షుడు సుకర్నోను చూడటానికి వెళ్లాము. ఈయనకు చిత్ర కళంటె చాలా మక్కువట. ఆయన భవనములో ఎన్నో చిత్ర పటము లున్నవి. వాటి నన్నిటిని చూపించాడాయన. అక్కడినుండి 'ఇండోనేషియా మహిళ కాంగ్రెసు' సమావేశమునకు హాజరైనాము. అక్కడ సమావేశమైన వివిధ దేశ ప్రతినిధులు స్త్రీల సమస్యలపై తమ దేశములా సందర్భములో 'చేయగలిగిన పురోభివృద్ధి గురించి ప్రపంచ స్త్రీ ఐక్యత అవసరము గురించి ప్రసంగించిరి.

అక్కడినుండి మేము ప్రసిద్ధి గాంచిన జకార్తా వస్తు ప్రదర్శనశాలకు వెళ్లాము. ఇక్కడ వారి పూర్వీకుల గృహముల నమూనా లున్నవి. సమిష్టి కుటుంబమునకు సరిపోయేటట్లు కట్టబడినవి. వివాహము కానివారికి వేరేగాను, పెళ్లయిన దంపతులకు వేరేగాను, వేర్వేరు గదులు, చిన్న చిన్నయిళ్లలాగా ఒకే ప్రాంగణములో కట్టబడెడివట. ఇంకా ఈ వస్తు ప్రదర్శనశాలలో కృత్రిమ ముఖములు, తోలు, చెక్క బొమ్మలు, మన టిబెట్టు నగలను పోలిన నగలు, మన బెనారస్ జరీ చీరెలను పోలియున్న సుమిత్రా ద్వీపవాసులు చేజరీ పని చేసిన నేత పట్టు వస్త్రములు, బాలీ ద్వీపవాసుల పల్లకీలు, జావనీయులు, వివాహ వేదికలు ప్రాచీన శిల్పములు, ఆయుధములు, నార వస్త్రములు, చైనీయుల పింగాణి పాత్రలు మొదలగునవన్ని ప్రదర్శింపబడియున్నవి ఇందానాటి నార వస్త్రములపై పులవేసి, (సెలబస్) ద్వీపవాసులు అద్దకపు పని కూడ చేసి యున్నారు. ఇక్కడ ప్రదర్శింపబడిన అనేక వస్తువులలో మనకు వారికి ఒకనాడున్న సంబంధ బాంధవ్యములను మనము చూడగలము కడకు వారి తోలు బొమ్మలందు సైతము రామాయణ భారతములందలి నాయకీ, నాయకుల రూపములు కలవు ఇంకను ఇక్కడ ప్రాచీన, వినాయక, (గణేష్), శివ (సివ), కృష్ణ, విష్ణు, విగ్రహములు కూడ ఉన్నవి (ఇట్టి విగ్రహము లిక్కడి వస్తు ప్రదర్శన శాలలోనేగాక, ఇక్కడ (జావా) పట్టణము లనేకములందలి పార్కులలో సైతము కానవచ్చినవి అంతేగాకుండ ఈ వస్తు ప్రదర్శన శాలలందున్న క్రీ. శ. 1వ శతాబ్దమునకు చెందిన పెద్ద పెద్ద రాతిపాత్రలు సైతము మనదేశము నుండే వచ్చినవని అక్కడివారు తెలిపారు.

### మూడు పూటలా అన్నమే!

వస్తు ప్రదర్శనశాల దర్శనాంతరము జకార్తా గవర్నరు ఇంటికి వెళ్లాము. అక్కడ మాకు అల్పాహార విందు. ఇండోనేషియన్ల ముఖ్య ఆహారము వరి. వారు మూడు పూటలు అన్నమే భోంచేస్తారు. చివరకు అల్పాహారవిందుకు సైతము వారు ఉడకబెట్టబడిన బియ్యముతోనే రక రకాల తిను బండారాలు చేస్తారు. ఇక్క డింకొక విశేష మేమంటె వారు నీటికన్నా తేనీరే ఎక్కువ త్రాగుతారు. త్రాగడానికి నీరు ఇక్కడ తొందరగా దొరకవు. ఈ తేనీరు కూడ పాలు పంచదార లేకుండ నీళ్లు త్రాగినట్లు ఫలహారము చేస్తూ, చేస్తూ, అరిపోయినాసరే త్రాగుతారు. తాజా పాలు కూడ ఇక్కడ దొరకవు. వారెక్కువగా డబ్బా పాలే వాడుతారు. పాలనేది ఇక్కడివారు కేవలము చిన్న పిల్లల ఆహారముగా భావిస్తారు.

మధ్యాహ్నము కొంచెముసేపు విశ్రాంతి తీసుకొన్న పిమ్మట పట్టణము చూడటానికి మరల బస్సులో బయలుదేరాము. జకార్తా పట్టణములో ఆసియన్ గేమ్స్, పెవిలియన్‌దాని దగ్గరున్న వారధి తప్ప ఎక్కువగా చూడదగిన స్థలములు లేవనే చెప్పాలి. ఇక్కడ రోడ్ల మీ దెక్కడ చూసిన అంతులేని కార్ల వరుసలు కనపడుతూ ఉంటవి. మన సైకిలు రిక్షాల వంటివి కూడ ఇక్కడున్నవి. కానిక్కడ రిక్షాలకు సైకిలు ముందుప్రక్కగాక, వెనుక ప్రక్కన ఉంటుంది.

ఆ రోజు రాత్రి మాకు మరల శ్రీ సుబాంద్రియో గృహములో విందు. అనేక ఇండోనేషియన్ స్త్రీలు కూడ (ఇతర ఇండోనేషియన్ ద్వీపములకు చెందిన వారు కూడ) ఆహ్వానింపబడ్డారు. వారందరికి వేర్వేరు ప్రాంతీయ భాష లున్నప్పటికి అందరు ఒక దేశీయ భాషనే వాడుతారు. దీనిని వారు 'భాస ఇండోనేసియా' అంటారు. భాష అనే పదము వారికి కూడ వాడుకలో ఉన్నదన్నమాట. వారు మరికొన్ని సంస్కృత పదములు కూడ వాడతారు. 'పుత్ర పుత్రీ', 'వనితా' మొదలగు పదములు ఇట్టివి. కొన్ని (జకార్తా ప్రక్కనే మధురా అనే పల్లె కూడ ఉన్నదట.)

ఈ విందు సందర్భములో అక్కడి వనితలు తమ వివిధ ద్వీపవాసులు ధరించే దుస్తులను ప్రదర్శించారు. ఇందులో బాలి ద్వీపపు స్త్రీలు వస్త్రములు ధరించే రీతి అతి సుందరముగా ఉంటవి. వారికి దేశ భాష ఉన్నట్లే దేశీయ దుస్తులని కూడ ఒక నిర్ణీత దుస్తు లున్నవి. ఇవి పూర్వము జావనీయులు ధరించెడివే. వారు లుంగీ వంటి మూడు గజాల 'సరోంగ్'ని ధరిస్తారు. ఇది సాధారణముగా చేనేత నూలు వస్త్రము (ఇవి ఎక్కువగా నిలువు చారలలో నేయబడతవి) లేక 'బాతిక్' అద్దకపు వస్త్రమైనా ఉంటుంది. ఒక్కొక్కసారి వారు జరీపూలు నేయబడిన పట్టు 'సరోంగ్' లని కూడ కట్టుతారు. ఈ సరోంగ్ ని వారు నాలుగు గజముల పొడవు, ఎనిమి దంగుళముల వెడల్పుగల రంగు వస్త్రముతో నడుము చుట్టు బిగిస్తారు. దీనిపై 'కబాయి' అనే బెట్టుగా నుండే పొడుగు చేతుల చొక్కాను ధరిస్తారు. ఈ 'కబాయి'లు నేత వస్త్రములనుండి నైలాను వల్



ఇండోనేషియన్ పెండ్లి కొడుకు పెండ్లికుమార్తె, తదితర బంధువర్గం

# ఇండోనేషియాయాత్ర:
## "మీ మగవారు యిద్దర్ని ముగ్గుర్ని భార్యలను చేసుకోవచ్చా?" ఇండోనేషియామహిళ ప్రశ్న ఇండోనేషియాలో బహు భార్యాత్వంచెల్లుతుందిట!

పెట్లుదాక ఏ బట్టతోనైన కుట్టబడుతవి. దీనిపై మరల మరొక 'సరోంగ్' వంటిదాన్ని పైవంచగా వేసుకొంటారు. ఇది కొంచెము పొడుగ్గానైన, పొట్టిగానైన ఉండవచ్చు. కలిమందాన్ ద్వీపవాసులు దీనిని తలపై ముసుగులాగ వేసుకొంటారట. ఇండోనేషియన్ పురుషులు కూడ పూర్వము లుంగీలు కట్టేడివారటగాని, ఇప్పు డెక్కువగా వాడుకలో లేవు. ఆఫీసులలో పని చేసే స్త్రీలు కూడ పాశ్చాత్య దుస్తులనే ధరిస్తారు.

## కేశసందపై మక్కువ

ఇండోనేషియన్ స్త్రీలకి సాధారణముగా పొడుగు వెంట్రుకలే ఉంటవి. లేకపోతే సవరములైన పెట్టుకొని రక రకాల ముడులు వేస్తారు. కొందరు స్త్రీలు ప్రొద్దుటిపూట కత్తిరించిన వెంట్రుకలతో ఉండి సాయంకాలము విందులకు మాత్రము చక్కటి ముడులతో ప్రత్యక్షర మవుతారు! ఈ ముడులపై వెండి, బంగారు పిన్నులతోను, రాళ్ల ఆభరణములతోను చక్కగా అలంకరిస్తారు. వీరు పూర్వము కాళ్లకు, చేతులకు కూడ మురుగులు వంటివి ధరించేవారట. కానిప్పుడు వారు చేతులకు మాత్రమే ధరిస్తారు.

ఆ విధముగా 'జకార్తా' పట్టణమంత చూసిన పిమ్మట మరునాడు మేము బస్సులలో 'బోగర్' ప్రయాణమైనాము. ఈ ప్రయాణము చాల బాగుంటుంది. మలయ మారుతము, చక్కటి ప్రకృతి, ఇండోనేషియాలో ఎండాకాలము, చలి కాలము అని ఉండవు. వానాకాలము, వానలేని కాలము అని మాత్రమే ఉంటవి. జకార్తాలో చలి లేదు. పెద్ద ఎండ లేదు. కాని 'బోగర్' సమీపించు తున్నకొలది వాతావరణమం చల్లబడట మారంభించినది. కారణమది ఎత్తు ప్రదేశ మవటమే.

## పల్లెలే ఎక్కువ

ఇండోనేషియాలో కూడ మన దేశములో వలెనే పట్టణములకన్నా పల్లెలే ఎక్కువ ఉన్నవి. వారి ముఖ్య వృత్తి వ్యవసాయము. వరి, సోయోబీన్స్, మొక్కజొన్నచేలు నాకు త్రోవలో కనపడినవి. వరి ఎక్కువగా 'టెరస్' విధానమున పండించబడుతుంది. వారు పలు విధముల ఫలములను కూడ విరివిగా పండిస్తారు. ఇక్కడవి చాలా చౌక. త్రోవలో ఇంకా నాకు రబ్బరు, కొబ్బరి, వెదురు చెట్లు కూడ కనపడినవి. కర్మాగారములు మాత్రము ఒకటో, అరో తప్ప కనపడలేదు. ఆ విషయములో మట్టుకు ఇండోనేషియన్లు ఇంకా ముందంజ వేయలేదనే చెప్పాలి. కాని వీరి గురించి చెప్పుకో తగ్గది వారి అక్షర జ్ఞానము. కొన్ని కొన్ని పల్లెల్లో 45 సంవత్సరములకన్నా తక్కువ వయస్సుగల వారిలో నిరక్షరరాస్యులే లేరట. ప్రతి పల్లెయందు కనీసము ఒక స్కూలైన ఉంటుందట. వారు వీటిని 'ఎస్కూలు' అంటారు. ఇట్టి 'ఎస్కూలు'లు త్రోవలో చాలా కనపడినవి. వీరిలో మరొక విశేషము వారి మతము. నా రీనాడు ఎనభై వంతులు ముస్లిమ్‌లట. పదిహేనువంతులు క్రిస్టియన్‌లు. మిగిలినవారు హిందువులు, బౌద్ధ మతస్థులు, (వారికి హిందూమతమునకు, బౌద్ధమతమునకు భేదము తెలియదు) లేక ప్రాచీన జావనీయ మతస్థులు. వారి దేశములో ఇన్ని మతము లున్నప్పటికిని వా రెప్పుడు తమ తమ మత విభేదాలను తలచినట్లగుపించదు.

త్రోవలో కనబడిన ఇండ్లన్ని ఎక్కువగా చెక్క, వెదురు బొంగులతోనే కట్టబడినవి. వా రిప్పుడిప్పుడే ఇటుక కట్టడములు మొదలు పెట్టారట. ఇల్లంత ఇటుకతో కట్టలేనివారు సైతము ముందు గోడైన ఇటుకతో కట్టనారంభించారట.

ఈ విధముగా త్రోవలో కనపడుతున్నవాటి నన్నిటిని వివరించి చెప్పుతున్న నా ఇండోనేషియన్ మిత్రురాలు ఉన్నట్లుండి "మీ మగవారు ఇద్దరు ముగ్గురు భార్యలను చేసుకోవచ్చా" అని అడిగింది. విడాకులు తీసుకొంటేగాని, అది చట్ట సమ్మతము కాదన్నాను. అప్పుడామె చెప్పింది. అక్కడి స్త్రీ సమస్యలు. అక్కడి పురుషులు ఎంతమంది స్త్రీలనైన చేసుకోవచ్చుట. అందుకనే అక్కడి స్త్రీలు తమ శరీర, ముఖ సౌందర్యాలకు చాలా ప్రాముఖ్యత నిస్తారట. సన్నగా ఉండటానికి నిత్య యౌవ్వనవతులుగా ఉండటానికి వారికి కషాయముల వంటివి ఉన్నవట. వాటిని వా రెప్పుడు అందులో ముఖ్యముగా ప్రసవానంతరము త్రాగుతారట. నిజమే, అక్కడి స్త్రీల వయస్సు కనుగొనటము కష్టమే. చక్కగా సన్నగా ఉంటారు. లావుపాటివారు ఎక్కడో నూటి కొకరు కనిపిస్తారు. ఇంకా ఇక్కడ వివాహ సమయములలో మగ పెళ్ళివారే ఆడ పెళ్లివారికి బహుమతు లివ్వటము, వాడుకని, వారి వివాహ పద్ధతుల గురించి నాకు వివరించసాగినది నా మిత్రురాలు.

ఇంతలోనే 'బోగర్' సమీపించాము. ఇది జకార్తాకు 33 మైళ్ల దూరంలో ఉన్నది. ఇక్కడ ముఖ్యముగా చూడదగినది బొటానికల్ గార్డెన్సు. ఇది 1817 నాటిది. దీని విస్తీర్ణము 275 ఎకరములు. ఈ తోట రక రకాల చెట్లతో (10 వేల వృక్ష జాతులున్నవట) చూడటానికి చాలా మనోహరముగా ఉంటుంది. ఇక్కడి వృక్షము లన్ని పొడుగ్గా, నిటారుగా ఉన్నవి. ఈ తోట ప్రేమికులకతి ప్రీతి పాత్రమైన స్థలమట. ఇక్కడ విష వృక్ష జాతులు సైతమున్నవి. ఇంకా ఈ తోటలో నాకు ప్రాచీన పశ్చిమ జావా రాజ్యాలనికి చెందిన శివ, గణేష, నంది విగ్రహములు కూడ కనపడినవి. అక్కడనుండి మేము 'తెలాగవార్నా' సరస్సు చూడటానికి మరల బస్సులలో బయలు దేరాము. ఆ రోడ్డు పర్వతములమీద మెలి తిరిగి పోతుంది. త్రోవలో కాఫీ, టీ ఎస్టేటులు ఎక్కువగా కనపడినవి. 'తెలాగా' వార్నా' సరస్సు చేరాలంటె కొద్ది దూరము కాలినడకను వెళ్ళాలి. ఆ సరస్సు ఒక దురదృష్ట ప్రేమికుల కంటి నీటితో ఏర్పడినదని ఒక గాథ ఉన్నది. ఆ సరస్సు ఆ పరిసర ప్రకృతి ఎంతో ప్రశాంతముగా, మనోహరముగా ఉంటుంది. ఒకసారి చూస్తే మరచి పోలేని స్థల మిది.

(మిగతా పైవారం) ★

# వనితావాణి

## వంటలు

'వనితావాణి'లో అరటికూరల గూర్చి చదివేను. కాని, అంతగా బాగులేదు. అరిటికాయ ముక్కలు ఆవ పులుసు బెట్టితే చాల బాగుంటుంది. అసలు, ఆ కూర విషయమే సుగుణగారు మరచిపోయారు.

ఎ. యస్. దేవి, వి. కోలనీ, (హైదరాబాద్)

* * *

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో ప్రచురించిన అడ (తీపిది) వంటచేసి చూశాము. చాలా బాగా కుదిరింది. ఎప్పుడూ ఇలా వంటలే కాకుండా క్రొత్తరకం చేతిపను లేవైనా ప్రచురించిన మాబోటి తెలియని సోదరీమణులకు చాల ఉపయోగపడును. ఇప్పుడు ప్లాస్టిక్ వైరుతో రకరకాల బాగ్‌లు వస్తున్నయి. అల్లిక తెలిసిన సోదరీమణు లెవరైనా పత్రిక ద్వారా తెలుపగోరెదను.

కుమారి టి. బాల (తాడికొండ)

* * *

ఎం. సుశీలగారు అరటిచెట్టు ఎన్ని రకాలుగా ఉపయోగించుకోవచ్చో బాగా చెప్పేరు. వారికి నా అభివందనములు. అరటి తొక్కు ఉడకబెట్టి పచ్చడి చేసే బదులు వేయించి చేస్తే ఇంకా బాగుంటుంది.

ఎం. వెంకటసర్వ (బర్సువ)

## గరల్స్ హైస్కూళ్ళు సమాధానం

నా "గరల్స్ హైస్కూళ్లు" వ్యాసంపై డి. జయమ్మగారి (కావలి) తీవ్రవిమర్శ 8—11—63 వనితావాణిలో చదివాను.

డి. జయమ్మగారు నా వ్యాసాన్ని సరిగా చదవలేదో, లేక చదివినా అవగాహన చేసుకోలేదో, లేక ఉట్టివే భూజాలు తడుముకుని బాధపడ్డారో తెలియటంలేదు.

మరొక్కమారు ఈ విషయంలో ఈ క్రింది విషయాలను చదువుకొని, ఇకమీదటయినా జయమ్మగారు ఏ విషయాన్ని గురించీ క్షుణ్ణంగా చదివి అర్థం చేసుకొనకుండా విమర్శలు చేయరని ఆశిస్తున్నాను.

"బొండు వోట్బులు ప్రతి సబ్జక్టుకూ పెట్టాలనే నిర్బంధం పెట్టకూడదని వ్రాశాను గానీ 'గురుకులం' లోలా 'పుస్తకాలు లేకుండా చదువు' వగైరా అర్థంలేని విషయా లెక్కడా వ్యాసంలో వ్రాయలేదు.

సగటు గరల్సు హైస్కూళ్ళ, ఆడటీచర్ల పద్ధతులను గురించి వాస్తవాలే వ్రాశాను. భూతద్దము క్రింద పెట్టి పరిశీలిస్తే, ధనవంతులైన పిల్లలిచ్చే బహుమానాలు పుచ్చుకుని, వారిని పాస్ చెయ్యటం, మత ప్రసక్తులు వగైరా మరికొన్ని విషయాలు కూడా వ్రాయవలసి ఉండేది. పోతే "సీటొనెస్" పేరుతో శుభ్రంగా తయారయి రావాలని విద్యార్థినులను హెచ్చరించడం ద్వారా ఎంతమంది ఆడటీచర్లు, ఎంతమంది తమ విద్యార్థినులను, ఝాన్సీ లక్ష్మీబాయి, దుర్గాబాయిల వంటి వారిని తయారుచేశారో, లెక్క తేలటంలేదు.

గరల్స్ హైస్కూళ్లను గురించిన వ్యాస మిది! కిండర్ గార్డన్, నర్సింగ్ (ఇంకా మహిళా సంక్షేమ సంఘాలను గురించి జయమ్మగారు మరిచి పోయారు కాబోలు) వగైరాలను గురించి ఏలాటి సంబంధమూ లేనిది.

అన్ని వృత్తులలోనూ ఆదర్శప్రాయమైన వృత్తి కాబట్టే, ఆదర్శప్రాయంగా టీచర్లు మెలగాలని హెచ్చరించాను.

అనుభవంతో టీచర్ల పద్ధతులు అర్థం చేసుకుని, అందుకు తగ్గట్లు విద్యార్థినులు టీచర్లు చెప్పినట్లు చేస్తున్నారని వ్రాయటం హాస్యాస్పదం. బలిపశువు, వధ్య శిలముందు తలవంచక నిలబడితే, చంపబోయే పూజారి అది తననూ, తన ఆదర్శాలనూ అర్థంచేసుకుని అలా వినయంగా నిల్చున్న దనుకోవటం ఎంతో వెర్రితనం.

ఆడటీచర్లు గురు స్థానానికి తగరని వ్యాసంలో మరొక్కమారు చదివి అయినా వ్రాయబడ లేదని తెలుసుకోవటం మంచిది.

నేను వ్యాసంలో ఉదహరించినట్లు పిల్లల ప్రాణాలు తోడే ఆడటీచర్లు నూటికి 95 మంది ఉన్నారనేది ఇప్పుడు కూడా చెబుతున్నాను. ఎవరికి వారు ఆత్మవిమర్శ చేసుకుని సరిదిద్దుకోవలసిన సమస్యిది. నే చెప్పానని బాధపడటంలో అర్థంలేదు.

వవని నిర్మల ప్రభావతి (మొగలిచర్ల)

---




జ రి గి న క థ

జానకిరామయ్య రిటైర్డైన బడిపంతులు. ఆయనకు నిరంజనం, శంకరం, సుశీల అని ముగ్గురు సంతానం. శంకరం ఉద్యోగ ప్రయత్నంలో వుంటాడు. జానకిరామయ్య సుశీల పెళ్ళిగురించి ఆలోచిస్తూ వుంటాడు. ఉద్యోగం కోసం మిత్రుడు రంగారావు ఇంటికి వెళ్లిన శంకరం ఆ దంపతులు ప్రవర్తన నచ్చక ఇంటికి వచ్చేస్తాడు. మామగారు తనపై అధికారం చెలాయిస్తున్నాడని నిరంజనం బాధపడ్తాడు. తండ్రికి సాయంగా శంకరం నిరంజనం ఇంటికి వస్తాడు. అక్కడ శారదతో పరిచయమౌతుంది. విజయవాడలో శంకరానికి ఉద్యోగం వచ్చింది. సినిమాహాల్లో శారద కన్పించి ఇంటికి రమ్మని ఆహ్వానిస్తుంది. శంకరం రాసిన నవల త్వరలో ప్రకటిస్తామన్న పత్రికాప్రకటనచూసి సుశీల ఎంతో ఆనందిస్తుంది, అదేవిషయం ఆఫీస్‌లో కొందరికి అసూయాజనకమౌతుంది. సమయం చూసి వాళ్లపై దెబ్బతీయాలని వాసు, పతి, ప్రసాదం ఎదురుచూస్తుంటారు. శంకరం నిర్భావంగా ఉంటాడు.

# 8

అతను వరండా ఎక్కగానే మృణాళిని గదినుండి ఎవరిదో మగ గొంతు వినిపిస్తోంది. ఆ గొంతు లోగడ విన్నట్టు జ్ఞాపకం.

ప్రసాదం మృణాళిని గది దగ్గరిగా వెళ్ళి బయటే నిలబడి వాళ్ల మాటలు వింటూన్నాడు.

"నటుడై రాణించాలంటే అతను కృషి చేయాలి. నాటక రంగానికి పూర్తిగా అంకితమై పోవాలి."

ఈ మాట వినగానే ప్రసాదం పళ్లు పట పట కొరికాడు. గుప్పిట బిగించాడు. అతనికోపం మిన్నంటుకుంది. వెంటనే గదిలోకి పరుగెత్తి శాస్త్రి గాడి పీక పిసికేద్దా మనుకున్నాడు. కాని — ఇంకా ఏమి సెలవిస్తాడో విందామని ఆగిపోయేడు.

"కాబట్టి నటించడం గూడా ఒకానొక జీవిత మన్నమాట. ఆ జీవితాన్ని అనుభవిస్తూ, ప్రేక్షకుల్ని భ్రమింపజేయడం తమాషా కాదు. దానికెంతో చాతుర్యం కావాలి. ఉదాహరణకి నే నున్నాను. నా పేరు శాస్త్రి. ఏదో ఉద్యోగం చేసుకుంటో, ఖర్చు పెడుతూ కులాసాగా గడుపుతున్నానా? ఇది నిజ జీవితం. ఇప్పుడు ఈ శాస్త్రి అనబడేవాడు స్టేజి ఎక్కి ఏ దొంగ గానో, ఏ ఖూనీకోరు గానో నటించాలి అంటే, వాడు తనని తను మరిచిపోవాలి. అప్పుడు వాడు శాస్త్రికాడు, గుమాస్తా కాడు, కులాసాగా తిరిగే విలాస పురుషుడూ కాడు. నెంబర్ వన్ కేడి. మర్డరర్. ఆ భీభత్సాన్నీ, క్రూరత్వాన్నీ వాడి ముఖంలో, వాడి ప్రతి కదలికలో చూపించి ప్రేక్షకులచేత భేష్ అనిపించుకుంటేనే నటుడు. ఏ క్లాసు నటుడు." ఇక్కడ కాసేపు శాస్త్రి మాటలు ఆగాయి. బయట నిలబడ్డ ప్రసాదం 'గొప్పగా కోసేస్తున్నాడు' అనుకున్నాడు. అసలు వీడికీ, మృణాళినికీ ఏమిటి సంబంధం? అని కూడా అనుకున్నాడు.

శాస్త్రి మళ్లా మొదలెట్టాడు.

"రేపు మేము ప్రదర్శించ బోయేది ఒకానొక సాంఘిక నాటకం. మంచి థీమూ, డైలాగులూ ఉన్న నాటకరాజం. మెయిన్ రోల్ నాది. 'కళాపూర్ణోదయం' అనే కావ్యం పేరు మీరు వినే ఉంటారు. దాన్ని పింగళి సూరనా, షేక్స్పియరూ ఇద్దరూ ఇటు తెలుగులోనూ, అటు ఇంగ్లీషులోనూ ఒకేసారి రాసినట్టు ఆధారా లున్నాయని చాలా మంది అంటున్నారనుకోండి. అది వేరే విషయం. ఇప్పుడు ఆ కథని ఆధారంగా చేసుకుని, నేటి సాంఘిక పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని మార్చి రాశారు మా నాటకాన్ని. కాబట్టి ఈ నాటకం ఎంత గొప్పదో మీరీపాటికి అర్థం చేసుకునే ఉంటారు. దాంతోపాటు మా ప్రదర్శన విలువనీ తెలుసుకునే ఉంటారు. ఇంతకీ నే చెప్పొచ్చే దేమిటంటే— ఇది బెనిఫిట్ షో కాబట్టి — ఒక నిరుపేద గుమాస్తా సహాయార్థం ప్రదర్శిస్తున్నది. కాబట్టి మీరు తప్పకుండా ఒక టిక్కట్టు కొనాలి. ఆ రోజు మా ప్రదర్శన చూచి తీరాలి. టిక్కట్టు మా చెల్లాయితో పంపుతాను" అన్నాడు శాస్త్రి.

"అలాగేనండి" అన్నది మృణాళిని.

"చాలా థాంక్స్. మీలాటి అభిమానులు లేక పోతే ఈ నాటక సంస్థ లెప్పుడో మూసేయబడేవి. షేక్స్పియర్ ఏమన్నాడూ, ఎవడు రస హృదయుడూ, కళాభిమానీ కాడో వాడు వట్టి దద్దమ్మ అని చెప్పాడు. మనకి కళలు చాలా ఉన్నాయి. ఆదరించే వారు మాత్రం బహు కొద్దిమంది. ఇది కళా ప్రపంచానికే తీరని అవమానం దుగ్ధ. మార్పు రావాలి. ప్రజానీకంలో ప్రతివాడూ కళాకారుడై రాణించాలి. ఆరోజెంత త్వరగావస్తే అంత మంచిది. అప్పటిగ్గాని మా సంఘ ఆశయం, మా సంస్థ ఆదర్శం ఫలవంతంగావు. మీ కాలాన్ని చాలా పాడుచేశాను కాబోలు. వస్తాను మరి. సెలవు అన్నట్టు టిక్కట్లు మా చెల్లాయితో పంపుతాను" అని చెప్పి గదినుంచి బయట కొచ్చేడు శాస్త్రి. బయట ప్రసాదాన్ని చూచి గతుక్కుమన్నాడు.

"నమస్కారం శాస్త్రిగారూ! ఇది మావయ్య గారిల్లే. ఏం!.....ఇలా దారి తప్పి వచ్చారూ?" అని నిలబెట్టి అడిగాడు ప్రసాదం.

"ఏం లేదండీ......మా నాటక మొహటి...."

"అన్నట్టు మీ నాటకాలు ఇంతకుమునుపు నేనెం చూడలేదు సుమాండి ...... అయినా చూశారూ.....వెధవది నాటకాలంటే నా కసలు సదభిప్రాయం లేదండి. అందరి సంగతి ఏమోగాని ఇప్పుడు నాటకాలు వేస్తున్న వాళ్ళల్లో చాలా మంది 'వెధవ' అని ఈ మామిత్రుడు అంటారులేండి. వాడెందుకు ఈ మాటన్నాడంటె, ఇప్పటి కొన్ని సమాజాల్లో రగులుకున్న 'అవినీతి' ఉంది చూశారూ....."

"సారీ......మా సమాజం"

"మీ సమాజం గురించి కాదులేండి. మాటాడుతూంటే. పాపం, మీ కవతల బోల్డు పనులున్నాయేమో......వెళ్ళి రండి మరి."

శాస్త్రి మెట్లు దిగి వెళ్లబోతూండగా మళ్ళా పిలిచాడు ప్రసాదం.

"అన్నట్టు మీకు సినిమాల్లో వేషా లేయాలనే సంకల్పం?"

"ఏదో లేండి. అవకాశం రావద్దూ!" అన్నాడు శాస్త్రి సిగ్గుపడుతూ.

"అదేం మాట గురువుగారూ! టాలెంట్ ఉండాలే గాని మీలాటి వాళ్ళకి అదెంత పని చెప్పండి. నాకో ఫ్రెండ్ ఉండేవాడు. వాడు అచ్చం మీలాగే నాటకాలంటే ప్రాణం పెట్టేవాడు. పరిషత్తులూ, పగైరాలంటూ గొప్ప హడావిడి చేసేవాడు. చివరి కేమైందంటె—జస్టెమినిట్—ఈ మాట వినిపోదురుగాని ఉండండి. ఆ చివరి కేమైందంటే, వాడు మదరాసు వెళ్ళి, ప్రయత్నంచేసి సినిమాల్లో చోటు చేసుకున్న మాట నిజమే గానిండి అప్పట్నుంచీ ఇప్పటి వరకూను వాడికి దొరికేవన్నీ ఎందుకూ పనికిరాని చిన్న వేషాలే పాపం! ఒక సినిమాలో ముని బాలకుడు, మరొక సినిమాలో జేబులు కొట్టే వాడు—ఇలా తగులడింది. వాడి నట జీవితం. ఇంతా ఎందుకు చెప్తున్నానంటె—"

"సారీ......నా కవతల......"

"అవును పాపం. వెళ్ళిరండి. శ్రమనుకోకుండా ఇంతదూరమూ వచ్చి చక్కటి విషయాలెన్నో చెప్పినందుకు సంతోషం శాస్త్రిగారూ!"

శాస్త్రి వెళ్లిపోయేడు.

ప్రసాదం పళ్ళు నూరాడు.

"వెధవ్వేషా లేస్తాడూ నా దగ్గిరే. సినిమాలో చేరుతుందిట మోహం" అని విసుక్కున్నాడు.

అతను విసుగ్గా తన గదిలోకి వెళ్లేడు. పుస్తకం ఒకటి చేత్తో పట్టుకుని చెడామడా చదివేయడం మొదలెట్టాడు. అలా అరగంట ఊరికే పేజీలు తిప్పేశాడు. దానికి తగ్గట్టు తన ఉనికిని ఆ ఇంటి వాళ్ళెవరూ పట్టించుకున్నట్టు కనిపించలేదు. దాంతో మరింత వళ్లు మండిపోయింది.

మంచంమీద వాలిపోయి మెడ వరకూ దుప్పటి కప్పుకుని గట్టిగా నిట్టూర్చాడు ప్రసాదం.

మృణాళిని ఆవేళకి వచ్చింది.

"అమ్మ నిన్ను భోజనానికి పిలుస్తోంది బావా!"

"..........................."

"ఓబావా! నీకే చెప్తూంటె.భోజనానికి లేవయ్యా"

"ఇప్పటికి నా విషయం గుర్తు కొచ్చిందన్న మాట"

"అదేమిటి? అదేం మాట?"

"ఏ......నీకు గొప్ప ఇదిగా ఉందా? పాపం....." అన్నాడు అవతలి వైపుకి మొహం తిప్పుకుంటూ.

"ఈ అలకకి కారణం ఏమిటో"

"తమ వదనం"

"అనగా"

"నీ ముఖం"

"అంటె"

"గాడిద గుడ్డు"

మృణాళిని పక పకా నవ్వేసింది. ఆ నవ్వుతో మరింత కోపం వచ్చింది ప్రసాదానికి.

"నవ్వుతావ్......ఛీ......మీ ఆడవాళ్లంతా ఇంతే"

"నువ్వు మాటాడే దేమిటో బొత్తిగా తెలీడం లేదు"

"తెలుగు"

"అది తెలుసు. నీ కోపానికి. కారణం చెప్పకుండానే ఖస్సు బుస్సనడం ఏం బాగోలేదు బావా!"

"అవునవును. నీకేం బాగుండదు."

"ఇంతకీ నువ్వు భోజనానికి వస్తావా రావా?"

"రాను."

"అలా అని అమ్మతో చెప్పనా?"

"ఏం......నాకేమైనా భయమా? అసలు నా మీద మీ అందరికీ పెత్తనం ఏమిటి? మీ రెవరూ? నేనెవర్ని"

"నువ్వు నా బావవి"

"సిగ్గులేకపోతె సరి"

"ఎవరికి?"

"అనవసరంగా వాగించకు. నాకు కోపం వస్తే మనిషిని కాదనలు. తెలుసా"

"ఏమిటీ? అయితే ఆ విద్వార మేదో చూడాలని ఉంది."

"ఉంటుందుంటుంది. ముందు నువిక్కడ్నుంచి కదుల్తావా? లేక నన్నే కదలమంటావా?"

మృణాళిని రెండు క్షణాలు నిశ్శబ్దంగా ఉండి, తర్వాత అడిగింది.

"అయితే ఇదంతా నిజమైన కోపమేనన్న మాట"

"కాకపోతె నేనేమైనా గొప్ప నటుడినా ఏల్లి కాడా?"

"కారణం చెప్పకుండా నిష్ఠూరాలు పలికే వాళ్ళని ఏమంటారో తెలుసా?"

"నువు నాకేం పాఠాలు చెప్పక్కర్లేదు. నేనేమీ పసిపిల్లవాడినీ, అమాయకుడినీ కాను."

"నాకు నమ్మకంలేదు."

"అంటే నీ ఉద్దేశ్యం?"

"బావా సీరియస్‌గా అడుగుతున్నాను. నీ కోపానికి కారణం చెప్పవూ" అని ప్రాధేయపడింది మృణాళిని.

అతను చల్లబడిపోయాడు.

"కొందర్ని చూస్తుంటె నాకు చెడ్డ చిరాకు. ఆ శాస్త్రిగాడు లేడు — అదె ...... నీ ఫేవరేట్ యాక్టర్......"

"ఇదేమిటి? అతను నా ఫేవరేటని నీ కెవరు చెప్పారు?"

"ఎవరో చెపితే తలాడించే రకం కాదు."

"మరి."

"నాటక కళ గురించి వాడి బొంద వాడి కేమిటో



# మనిషి - మిథ్య

తెలిసినట్టు గొప్ప ఉపన్యాసమిస్తుంటే తమరు వినలా? విని మెచ్చుకోలేదూ?"

"అయితే కావచ్చు. అతను మా కాలేజీ బెస్ట్ యాక్టర్"

"అవునవును. మహ బాగా తెలుసు. వాడు పయోముఖ విషకుంభం. మేకతోల కప్పిన పులి, దౌర్భాగ్యుడు. వాడు మా ఆఫీసులో ఎంత గందరగోళం చేస్తున్నాడో, ఎందర్ని ఏడిపిస్తున్నాడో నీకేమైతే తెలుసా?"

"నాటకాలకీ, వ్యక్తిగత విషయాలకీ ముడి పెట్టడ మెందుకు?"

"అయితే నువ్విప్పుడేమంటావ్?"

"అదేం ప్రశ్న?"

"నువ్వు వాడితో మాటాడటం నా కిష్టంలేదు"

"ఎందుకనిట"

"చెప్పాగా వాడు ఉత్తఫూలని......"

"కాని, అతను మా స్నేహితురాలికి అన్నయ్య. మా కాలేజీ బెస్ట్ యాక్టర్."

"అందుకనే అంటాను మీ ఆడవాళ్లందరూ..."

"బావా......నీ ఇష్టం వచ్చినట్టు మాటాడితే నే సహించేది లేదు....."

"అవును. నువ్వు సహించవు. సరే...... ఈ విషయమేమిటో మావయ్యని అడిగి తేల్చుకుంటాను. నేను మీ అందరిముందూ ఈ ఇంట్లో ఉండాలనుకుంటే ఆ రోగ్‌తో నువ్వు మాటాడటం మానుకోవాలి. లేదూ—నే నేదైనా ఇల్లు చూచుకుని నా తిప్పలేవో నేను పడతాను."

మృణాళిని మరేమీ మాటాడలేదు. ప్రసాదం అత్తయ్య భోజనానికి రావలసిందిగా పిలవడంతో, గబ గబా వంట గదిలోకి పరుగెత్తాడు.

అతని పద్ధతికి లోలోన నవ్వుకుంది మృణాళిని.

* * *

"వీడు నాటకాలువేసి ఆ యొక్క కళతో సంఘాన్ని గజంన్నర మందాన్న పెంచేస్తాడట. షేక్‌స్పియర్, నాటకాలు వేయని వాళ్లందర్నీ వొట్టి వెధవలూ అన్నాట్ట. కళాపూర్ణోదయం ఆ పెద్దమనిషీ పింగళి సూరన్నా ఇద్దరూ రాశారుట. అబ్బ.. వాడు వాడిన 'గ్యాస్' ఇంతా అంతా కాదు ఈ ఫూల్‌కి సినిమాల్లో చేరాలని ఉందిట. ఆకాడికి అవతల ఆ ఫీల్డు వీడు లేని వెలితిచేత లబోమని ఏడుస్తున్నట్టు! వెధవ పోజూ వీడూను. వీడి వరస చూస్తుంటే నాకు భయంగా ఉంది. ఆడపిల్లల మనసు కనిపెట్టడం, సృష్టించిన ఆ బ్రహ్మదేవుడికే తెలీదంటారు. నువ్వేమంటావ్" జరిగినదంతా చెప్పేడు ప్రసాదం పతితో.

పతి సిగరెట్టు పొగ గట్టిగా పీల్చి నింపాదిగా వదులుతూ.

"నీది ఉత్తి పిరిగి గుండె అంటాను" అన్నాడు.

ఈ మాటతో చలించిపోయేడు ప్రసాదం. తీక్షణంగా పతివైపు చూస్తూ

"నువ్వు గనక సరిపోయింది. మరోడు ఆ మాటంటె"

"నే నొకటి చెప్తా వింటావ్?"

"తప్పకుండాను."

"మీ మృణాళినికి నువ్వంటే అమితమైన ప్రేమ"

44 వ పేజీ చూడండి

# పఠకాని కథలు

## ఆడిటర్ చిన్నతనం

అవి నేను హైస్కూలులో చదువుకుంటున్న రోజులు. ఆ సంవత్సరమే స్కూలులో చేరాను ఇప్పటికీ ఆ సంఘటన తల్చుకుంటే నవ్వు వస్తుంది ఈజిక్వేల్టు, అని మేష్టారు లెక్కలు చెబుతుంటే మహేశం వెర్రిమొహం పెట్టి చూస్తున్నాడు, ఉత్త గుణకారమే అది. 'ఊ' కొడుతున్నాడే గాని మహేశం బుర్ర కెక్కడంలేదది! "ఎనిమిది ఇంటు ఆరు యీజిక్వేల్టు నలభై ఎనిమిది, ఏడు యింటు నాలుగు యీజిక్వేల్టు ఇరవై ఎనిమిది, ఐదు యింటు తొమ్మిది యీజిక్వేల్టు-" మొత్తం ఒక్కసారి క్లాసంతా నిశ్శబ్దమై పోయింది. "ఓరి జడ్డి మొహాలూ మాట్లాడరేం?" ఔట్ బెల్ కోసం చూస్తున్నారంతా! అంతమందిలో ఒక్కడూ మాట్లాడ లేదు. మహేశం తపీమనిలేచి 'బ్లాక్ బోర్డు' వైపు నడిచాడు. అంతా ఆశ్చర్యంగాచూస్తున్నారు. మహేశం బ్లాక్‌బోర్డు వెనక్కి వెళ్ళి ఒక నిముషంలో వచ్చి కూర్చున్నాడు. "అదేమిటిరా! లెక్క చెయ్యలేదేం?" మేష్టారడిగారు. "లెక్కాండి! నాకు రాదండి!" "మరెందుకొచ్చావు? బోర్డు వెనక ఏం చేసావు!" మహేశం భయపడుతూ చెప్పాడు. "మరండీ! నా లాగు బొందు ఊడి పోయిందండీ! కట్టుకు వచ్చానండీ!" అంతా గొల్లున నవ్వారు! ఆమహేశం యిప్పుడు ఆడిటర్.

అమంచి (రాజమండ్రి)

* * *

## మరుపురాని సంఘటన

ఒకసారి నేను కాకినాడ నుంచి ఏలూరుకి ప్రయాణం చేస్తున్నాను. అప్పట్లో నాకు సిగరెట్లు విపరీతంగా కాల్చే అలవాటు ఉండేది. రోజుకి డజనుకి తక్కువ కాల్చేవాడిని కాను. గూడెం దాటిన తర్వాత సిగరెట్టు పెట్టి చూసుకున్నాను. ఒక్క సిగరెట్టు లేదు. బహుశా మళ్లీ ఏలూరులోగాని దొరకవు. ఆ ఆలోచనతోటే నాకు హఠాత్తుగా తలనొప్పి వచ్చినట్లయింది. ఎలా భగవంతుడా అని చూస్తున్నా రైలులో అమ్మేవాళ్లు కూడా ఎవరూ రాలేదు. తల పట్టుకుని కూర్చొన్న సమయంలో సిగరెట్లవాడి కేక వినపడింది. ఆతృతగా అటు చూశాను. ఎవరో బాగా పసికుర్రాడు పదెనిమిదేళ్లుంటాయి జంగిడీలో సిగరెట్లు ఇంకా ఏవేవో పెట్టుకుని అమ్ముతున్నాడు. ఇంతలో రైలు కదిలింది.

'ఒక సిగరెట్ పాకెట్ యియ్యి' అన్నా తొందరగా "నిండుగా లేవు బాబూ, నాలుగే ఉన్నాయి" అని పెట్టి ఇచ్చాడు. రైలు వేగం అందుకుంది. జేబులో చెయ్యి పెడితే పావలా తగిలింది. వాడి జంగిడీలోకి విసిరాను. 'చిల్లర లేదు బాబూ' అన్నాడు పరిగెడుతూ కంగారుగా. 'పర్వాలేదు ఉంచుకో' అన్నాను. వాడి ముఖాన భయం ఆవరించింది. "బాబో! మా నాన్న తిడతాడు" అంటూనే పావలాను కంపార్టుమెంటులోకి విసిరేశాడు. చూస్తూండగానే వెనక్కి వెళ్లిపోయాడు. ఎప్పటికీ మర్చిపోలేకపోయా నీ సంఘటన.

కె. రామచంద్రరావు, (వాల్తేరు)








ఉన్నపళంగా చిన్నబాబుగారు పిలుచుకొనిరమ్మంటున్నారు-అని నరసింహులు ద్వారా పిలుపందగానే నేననుమానించాను. చినబాబు బుర్రలో ఏదో ఒక కొత్త ఊహ తళుక్కున మెరసి ఉంటుంది అతడి బుర్రలో అలా ఒక కొత్త ఊహ మెరిసినప్పుడల్లా దాన్ని కార్య రూపంలో పెట్టడానికి ఒకరి సలహానో, కాక తోడ్పాటో అవసరమౌతూ ఉంటుంది.

ఊరంతా చిన్నబాబుగా వ్యవహరించే ఆ బక్క పలచటి ఎర్రటి యువకుడి పేరు శ్రీహరి. అతడు పుట్టడానికైతే ఈ ఊరిలోనే పుట్టాడు గానీ పెరిగింది మాత్రం ఈ ఊరుగాదు. 'ఆయువు నూరు సంవత్సరములందు సగంబు గతించె నిద్రలో'— అంటూ మునుపటి కొకాయన వాపోయాడు. ఆ మిగిలిన సగంలో సగం విద్యాభ్యాసానికే సరిపోతోంది గదా అని చింతిస్తూ కూర్చోవలసిన అసంఖ్యాక భారతీయ విద్యార్థుల్లో శ్రీహరి ఒక్కడు. అలాగని ప్రతి తరగతిలోనూ నింపాదిగా రెండు మూడేళ్ళు కూర్చున్నాడని శ్రీహరిని అపార్థం చేసుకోడం అన్యాయం. అయిదేళ్ళ వయసులో అతడు మహానగరంలోని ఒకానొక కాన్వెంటు పాఠశాలలో చేర్పించబడ్డాడు. ప్రాథమిక విద్య ముగిసిన తర్వాత అక్కడే ఉన్నత పాఠశాలలో చేరాడు. ఆపైన కాలేజీ చదువు. లోకం దృష్టిలో పట్టి బి. య్యే. వరహీనపు పెళ్ళి కొడుకులా చులకనగా ఉండడం వల్లనైతేనేమి, జీవితాంతం చదువుకుంటూనే ఉండిపోయినా జరుగుబాటుకు కొదువలేకపోవడం వల్లనైతేనేమి, శ్రీహరి మళ్ళీ ఇంజనీరింగులో చేరాడు. చిన్ననాడే వివాహమై కాపురానికి వెళ్ళిపోయిన అమ్మాయి పుట్టింటి కోసం ముఖం వాచిపోవడం సహజం! అత్తింటి కోడల్లా ఏడాది కొకసారి స్వగ్రామానికి వచ్చేస్తాడు శ్రీహరి. అమ్మాయికి అమ్మగారింట్లో తీరే ముద్దు ముచ్చటల్లా శ్రీహరికి స్వగ్రామంలో తీరే సరదాలు కొన్ని ఉన్నాయి. కోనేటి బావిలో ఈదులాట. చిట్టడివిలో సెలయేటి జన్మస్థానం కోసం అన్వేషణ. వెన్నెల రాత్రుల్లో గ్రామీణ యువకులకు బస్తీ ఆటల్లో తరిఫీదు. ఇలాంటి వ్యాసంగాలతో దినాలు క్షణాలుగా గడిపివేసే శ్రీహరిని గురించి ఇక్కడే ఇంకొక మాట గూడా చెప్పవలసి ఉంది. ఎలాంటి సామాన్యమైన పని చేస్తున్నా, దాన్ని సాహసికపు పైపూతలో నుంచి చూచి ఆనందించడం శ్రీహరి స్వభావం. టెంకాయ చెట్టుపై కెగ్రాకుతూ అతడు టెన్సింగులా ఉప్పొంగి పోగలడు. సెలయేటి కెదురుగా చిట్టడివిలో నడుస్తూ, ఆఫ్రికాఖండ దుర్గమారణ్యాల్లో సంచరించిన సాహసిక యాత్రికులకు మల్లే నిర్భీతిని ప్రకటించగలడు. ఐనా చేస్తున్న పనిలో ఏముంది? అంతా అనుకోడంలోనే ఉంది. పరమానందయ్య శిష్యుడికి తీసిపోని శాంకోఫాంజాయే అంగరక్షకుడుగా, ఎముకలు పైకి తేలిన బక్క గుర్రమే గంధర్వాశ్వంగా, తాతల కాలంనాటి త్రుప్పు పట్టిన పోరాటపు పనిముట్లే యుద్ధ సాధనాలుగా దేశం పైకి బయల్దేరిన డాన్‌క్విక్ సాట్ అన్న పెద్ద మనిషి తాను చేస్తున్న పనిని వీరోచిత కృత్యంగా, అంతకుమించి దిగ్విజయ యాత్రగా తలపోశాడంటే అందుకు కారణం అతడి మనసులోగాక మరెక్కడుంది?

వెళ్ళేసరికి హాల్లో తూగుటుయ్యాలపైన కూర్చుని ఊగుతున్నాడు శ్రీహరి. పై కప్పునుంచీ వ్రేలాడుతున్న గొలుసుల్ని భూమ్యాకర్షణ శక్తితో పోలిస్తే తూగుటుయ్యాలను కొంచెం ఇంచుమించుగా అంతరిక్ష నౌకతో ఉపమించవచ్చు. బహుశా శ్రీహరి అలాంటి అనుభవాన్ని పొందుతున్నాడేమో తెలియదు.

''సుస్వాగతమయ్యా రాజశేఖరం! పాలేరు ద్వారా కబురు పెట్టినా తమ దర్శనాలు దొరకడం లేదు. ఇంతకూ జరుగుతున్నవి బడి రోజులైనా కావు. వేసవి సెలవులు. ఈ వూళ్ళో నీ ప్రొద్దు పోకడకు అభ్యంతరాలుగానీ కాలక్షేపం లేమిటో తెలియదు. అసలీ

**ఊళ్లో ఎవరిని చూచినా నా కదే ఆశ్చర్యం. ఊరి** ప్రక్కనే రోడ్డుంది. రోడ్డులో బస్సులు తిరుగుతుంటాయి. ఆ బస్సుల్ని చూచినప్పుడైనా ఈ ఊరికి చుట్టూరా విశాలమైన ప్రపంచం ఉన్నదన్న విషయం వీళ్ళకు స్ఫురించవలసింది! అలాంటి ఆలోచనైనా లేకుండా వీళ్ళిలా ఇంత నిశ్చింతగా ఎలా బ్రతకగలుగుతున్నారో నా కర్థం గాదు. అది నీ బోటి విజ్ఞుడు నా బోటి అనుభవంలేని వాడికి విప్పి చెప్పవలసిన రహస్యం......''

ఆ రహస్యం మాట కేమిగానీ ఈ ఉపోద్ఘాతమంతా దేనికి ఎత్తుగడో నా కర్థమై చావడం లేదు—

''చూడవయ్యా శ్రీహరీ! కష్టసుఖాలుగానీ, ఖేదామోదాలుగానీ అనుభవంలో లేవనీ, అనుభవించే వాడి మనసులోనే ఉంటాయని పెద్దలంటారు. ఒకడికి దేశాలు తిరగడం ఆనందమైతే, మరొకడికి హాయిగా ఇంటి పట్టున కాలం వెళ్ళబుచ్చడమే ఆనందం! ఈ మానసికమైన కారణాన్ని అటుంచి లౌకిక దృష్టితో చూచినా దేశం తిరగడమనేది అందరికీ వీలయ్యే పనిగాదు. పచ్చిక బీడులో గూటానికి గట్టిగా కట్టివేయబడిన ఎద్దు నెప్పుడైనా చూచినావా శ్రీహరి! అది తన పగ్గాలు అనుమతించిన పరిమిత వలయంలో మాత్రమే తిరగ గల్గుతుంది. అంతకుమించి ఓ అంగుళమైనా జరగడం దానితరం గాదు. ఇంకా నీ సంగతి చెప్పు! దేశాలు తిరగదలచుకుంటే విన్నడ్డుకునే పరిస్థితు లేవీ లేవు. పైగా అందుకిదే తగిన అదను గూడా! పూర్వం పట్టాభిషిక్తులు గావడానికి మునుపు రాకుమారులు దేశాటనం చేసి వచ్చేవారని ప్రతీతి. నువ్వూ ఆ పని చేయవచ్చు......''

''నిజమే, నిజమే!'' తన అంతరంగంలోని ఊహను పసిగట్టగలిగినందుకు నన్ను అభినందిస్తున్న వాడిలా అన్నాడు శ్రీహరి. ''కానీ యువరాజులు ఒంటరిగా దేశ సంచారాలు సలిపినట్టు నిదర్శనాలు లేవు! వెన్నంటి ఓ వేడుక చెలికాడు ఉండాలి గదా!''

''ఆ స్థానాన్ని నా కివ్వ దలచుకున్నావా ఏమిటి?'' విస్మయంతో ప్రశ్నించాను.

''అబ్బే! నువ్వు వేడుక చెలికాడిక్రింద జమ కట్టదగిన వాడివా శేఖరం! నా కన్నా పెద్దవాడివి. జీవితాన్ని గురించి ఎన్నో విషయాలు తెలిసినవాడివి. కొత్త ప్రదేశాల్లో, కొత్త వ్యక్తుల మధ్య మెలగుతున్నప్పుడు అనేక విషయాలకు వివరణలు, వ్యాఖ్యలు అవసరం గావచ్చు. అలాంటి పరిస్థితుల్లో నేను నీలాంటివాడి సాహచర్యాన్ని అభిలషించడంలో ఆశ్చర్య మేముంది?''

ఎలాగైనా సునిశితమైన మేధస్సు శ్రీహరిది! అతడు ఒక క్షణంలో ఎదుటి మనిషిని కించపరచనూ గలడు. మరుక్షణంలో అంచెలంచెలుగా ఆకాశానికి ఎత్తనూ గలడు.

''ఇంతకూ నువ్వు తలపెట్టిన పయనానికి గమ్యస్థాన మేదో చెబుతావా శ్రీహరీ!''

''అదే సమస్య! ఏడెనిమిది రోజులుగా నే నాలో చిస్తున్న విషయం గూడా అదే! తీరా ఒక చోటకు వెళ్ళిన తర్వాత, వేరొక చోటకు వెళ్ళి ఉంటే మరింత బాగుండేది కదా అన్న అసంతృప్తి మనల్ని **వెంటాడుతుందేమోనని నా భయం! పోనీ, నీ అభి**ప్రాయం చెప్పరాదా శేఖరం!''

''నాదేముంది శ్రీహరీ! పిండికొద్దీ రొట్టె! శ్రీమంతుల్లో కొందరు ఉదక మండలాలకు వెళ్తారు. మరికొందరు బెంగుళూరు ఎన్నుకుంటారు. ఆపద మ్రొక్కులకైనా, ఆనందంగా విహరించడానికైనా అనువైన యాత్రాస్థలం తిరుపతి—అందుబాటులోవున్న పుణ్యక్షేత్రం. పోనీ శిథిలాలు చూడదలచుకుంటే హంపీ వెళ్ళొచ్చు. సముద్ర సౌందర్య విలోకించాలనుకుంటే మహాబలిపురం......''

''సముద్రాలు, నగరాలు, శిథిలాలు మన కెందుకులే శేఖరం! అవన్నీ జీవిత పటానికి చివరి అంచులు. నిజమైన జీవిత దృశ్యాలు కావాలి మనకు. పైగా వెళ్ళినచోట మన అవసరాలను మనమే గమనించుకోవలసిన దురవస్థ మనకు పట్టగూడదు! ఎందుకంటావేమో! అలాంటి బాదరబందీలన్నీ యాత్రానందానికి ఆటంకాలు......''

గడ్డు కోరికే మరి! ఏదైనా విదేశ ప్రభుత్వం ఆహ్వానం పంపితే చెప్పలేనుగానీ లేకుంటే అలాంటి సౌకర్యాలు సమకూరడం దుర్లభం!

''అదేమిటి శేఖరం! మునుపటి కొక ఈగ ఇల్లలుకుతూ తన పేరు మరచి పోయిందట! అలాగే ఉంది నీ ధోరణి. కాకపోతే పట్టణాలను గురించి, శిథిలాలను గురించి ప్రస్తావించిన వాడివి నువ్వు పల్లెటూళ్ళను గురించి మరచి పోవడ మేమిటి? భారతదేశం యొక్క నిజ స్వరూపాన్ని చూడదలచుకుంటే పల్లె సీమల్లోనే చూడాలి. రమణీయమైన తోటలు, పచ్చని శాలువా పరిచినట్టుండే పైరు పచ్చలు. కొండ కొలకులు. అబ్బో చూడ నేర్చిన కళ్ళుండాలంతేగానీ, నిండైన ప్రకృతి సౌందర్యమంతా అక్కడే ఉంది......''

''కానీ వెళ్ళిన ప్రతి పల్లెలోనూ ఆతిథ్యాని **ఆశించడానికిగానీ పొందడానికిగానీ మనమేమన్నా** రాజకీయ నాయకులమా శ్రీహరీ!''

''కాకపోవచ్చు! కానీ మనం ఆతిథ్యం లభించే పల్లెలకే వెళ్తాము. తరిగొండలో సుధాకరం ఉన్నాడు. గుర్రాల మహల్లో గోపాలమున్నాడు. తిమ్మ సముద్రంలో కేశవు లున్నాడు. వీళ్ళంతా ఎవరో నమకునేవు! ఆత్మీయులైన మిత్రులు. కాలేజీలో నా సహపాఠకులు......''

''కానీ అల్లుడితో బాటుగా గిల్లడు గూడా అవసరమా శ్రీహరీ!''

''అబ్బే, నువ్వలాంటి సందేహాలు పెట్టుకోవద్దు శేఖరం! నా మూలంగా నీలాంటి స్నేహితుడు దొరికితే వాళ్లెంతగానో సంతోషిస్తారు. తరిగొండలో సుధాకర మున్నాడన్నాను కదూ! వాడూ నాలాగే తండ్రి కొక్కడే కొడుకు. వాళ్ళ నూరెకరాల మాగాణిలో నాసిరకం వడ్లు పండవు. కిచ్చిలి సంబావులు, బంగారు తీగలు, రాజనాలు పండుతాయి. రెండు మూడేళ్ళపాటు పాతరలో పోసి ఉంచిన పాత వడ్ల బియ్యాన్ని కానీ వాళ్ళు వాడరు. ప్రతి రోజూ బెంగుళూరునుంచీ వాళ్ళయింటికి కూరగాయల బుట్ట వస్తుంది. ఇది మామిడి పళ్ళ కాలం గదూ! తరిగొండ మామిడి పళ్ళంటే బొంబాయి దాకా ప్రసిద్ధి. ఇంత చెప్పి, పాడి సంగతి చెప్పాను కాను. ఒక్కమాటలో చెప్పొచ్చు. వాళ్ళ ఇంటి కాకి గూడా నేతి వంటకమైతేగానీ రుచి చూడదు......''

''ఇళ్ళల్లో కుక్కల్ని పెంచడం రివాజు! కాకుల్ని గూడా పెంచడ మన్నది అసలు సిసలు తాజా వార్త. ప్రసంగ సౌలభ్యం కోసం సామెతలను నుడికారాలను ఎవడిష్టం వచ్చినట్లు వాడు సర్దుకోవచ్చు అభ్యంతరంలేదు. కానీ నే నాశ్చర్యపడటం అందుకు [illegible] శ్రీహరి ఎదుటి [illegible] భోజన ప్రియు[illegible]



ఊహించి, వాటిలోని భోజన ప్రియత్వాన్ని కప్పి గొట్టే ప్రయత్నంలో ఉన్నాడు!

"చూడు శ్రీహరీ! పెద్దలు ప్రపంచంలోని జనాభాను రెండు రకాలుగా వర్గీకరించారు. బ్రతకడానికే తినేవాళ్లు కొందరు. తినడానికే బ్రతికే వాళ్లు మరికొందరు. పై రెండు తెగల్లో నన్ను ఏ తెగకు చెందిన వాణ్నిగా తలపోస్తున్నావు నువ్వు?"

శ్రీహరి తెల్లబోయినట్టు కనిపించాడు. కానీ అతంలో తేరుకుని, "అదేమిటి శేఖరం! నా మాటల్లో లేనిపోని భావాన్ని దేన్నో నువ్వు పైకి లాగజూస్తున్నావు" అంటూ తప్పించుకోజూచాడు.

"కాదులే శ్రీహరీ! మానవుడికి ప్రాణశక్తి నిస్తున్న అన్నం పట్ల ఏవో దురూహ లున్నట్టున్నాయి నీకు! ప్రియంగా భోజనం చేసేవాళ్లు నీ కంటికి తిండికోసం కక్కుర్తి పడే వాళ్ళల్లా కనిపిస్తారు. నన్నడిగితే బాగా భోజనం చేయడం ఆరోగ్యానికి చిహ్నం. భోజనాన్ని చూడగానే మొహం మొత్తినట్టుండడం అనారోగ్యానికి గుర్తు! నీకు ఆరోగ్యమంటే ఏమిటో తెలుసు. దానికంటే మహా భాగ్యం లేదని ఏ కుర్రకుంక నడిగినా చెబుతాడు..."

"అబ్బబ్బ, దులిపేశావయ్యా శేఖరం! పోనీలే బాబూ! నాది పొరపాటే ననుకో! ఐనా తినబోతుండగా రుచుల్ని గురించి చెప్పడ మెందుకు? ఎప్పుడు బయల్దేరుదామో చెప్పు......"

"ఆ నిర్ణయాన్ని మాత్రం నువ్వు నాకు వదిలిపెడతావా శ్రీహరీ! ఈ పాటి కదీ నీ బుర్రలో తయారయ్యే ఉంటుంది" అన్నాను.

"అయితే ఎప్పుడో ఎందుకు! రేపుదయాన్నే బయల్దేరుదాం. ఆరు గంటలకల్లా నువ్వు సిద్ధంగా ఉంటే చాలు......"

"ఆవేళప్పుడు బస్సులు లేవే!"

"బస్సా! బస్సెందుకు? లక్షణంగా కారుండగా మనం బస్సుల్లో వెళ్తామా శేఖరం!"

కారా!! ఆ కారు......

నిర్ఘాంతపడిపోయాను నేను.

శ్రీహరి తండ్రి పెదబాబుగారికి కారు కొనాలన్న ఉద్దేశం ఏ కోశానా ఉండేదిగాదు. కానీ సన్నిహితులైన బంధువులు కొందరు సంపన్నులకుండవలసిన హంగుల్లో కారొక్కటే అని చెవిలో ఇల్లు

# తృప్తి

గట్టుకుని పోరడంతో ఆయన ఆ కారును కొని తీసుకొచ్చేశారు. తీసుకొచ్చారేగాని, అలా తీసుకరావడంలో కారులాంటి ఆకారం గలిగిన దొకటి ఇంటి దగ్గర పడి ఉంటే చాలునన్న ఉద్దేశమే తప్పా, అది ఎప్పుడంటే అప్పుడు పరిగెత్తి తీరాలన్న కోరిక ఆయన కున్నట్టు లేదు. నాలుగు చక్రాలు, పైకప్పు, లోపల ఆసనాలు, వాటి ముందు స్టీరింగు చక్రం, దాని కివతల ఇంజను లాంటివన్నీ వాటి వాటి యధాస్థానాల్లో వున్న మాట నిజమే. కానీ వాటిల్లో ఏది ఎప్పుడు మిగిలిన భాగాలతో సహాయ నిరాకరణ ప్రారంభిస్తుందో ఊహించడం కష్టం. తన ఇబ్బందులు తనకెన్ని ఉన్నా, అప్పుడప్పుడూ పరుగెత్తగలగడమే దాని ప్రత్యేకత. సెలవుల్లో ఇంటి కొచ్చిన శ్రీహరి ఆలనా పాలనా లేక పడి ఉన్న ఆ కారుపైన తన ధ్యాసను కేంద్రీకరించాడు. తీసుకెళ్ళి మరమ్మత్తుల కార్ఖానాలో చేర్పించి సాంగోపాంగంగా కాయ కల్ప చికిత్స జరిపించి దట్టంగా రంగు పూయించి దాని ఆకృతిలో మార్పు తీసుకురావడంలో కృత కృత్యుడు కాగలిగాడు. వన్య మృగాన్ని మచ్చిక చేసుకుంటున్నట్టుగా ఎప్పుడు వెళ్ళి చూచినా ఆ కారుపైన అత డేవో సాధనలు చేస్తుండేవాడు. రక రకాల ఉపాసనలతో క్షుద్ర దేవతను ప్రసన్నం చేసుకునే మాంత్రికుడికి మల్లే తన నిర్విరామ కృషితో శ్రీహరి ఆ కారును కొంతవరకూ తన అదుపులోకి తెచ్చుకో గలిగాడు. డబ్బా రేకుల పైన రాళ్ళ వాన పడినట్టుగా శబ్దం వినిపించి నప్పుడల్లా 'అదిగో పెద్దబాబుగారి కారు' అంటూ కుర్రవాళ్ళు వీధుల్లోకి రావడం ఇటీవలి పరిణామాల్లో ఒకటి. తన స్వభావానికి విరుద్ధంగా అది ఇలా పరుగులు ప్రారంభించిన తర్వాత ఊల్లో కోళ్ళకు, కుక్కలకు రక్షణ లేకపోయింది. ఒకటి రెండుసార్లది దారి ప్రక్కన నిల్చున్న కుర్రాళ్ళ పైకి గూడా వెళ్ళబోయి, అంతలో ఎందుకో దయదలచి వదిలి పెట్టింది. పెద్దబాబుగారి కారు. చిన బాబుగారి సారధ్యం. చిన్న చిన్న ప్రమాదాలు జరిగితే జరిగాయి లెమ్మనుకుని గ్రామస్తులు సరకుచేశారు కారు.

ఆ కారులో తరికొండకు గుర్రాల మహాలుకు బయల్దేరుదా మంటున్నాడు శ్రీహరి. దీన్నతడు ఒక సాహసకృత్యంగా భావిస్తున్నాడేమో గూడా! ఇంతకంటే డాన్‌క్విక్‌సాట్ నయం! ఆతడి బక్క గుర్రం మార్గ మధ్యంలో చనిపోతే చనిపోవచ్చు అంతేగానీ బ్రతికిందా చనిపోయిందా అని విచారించుకోవలసిన అవసరం అతని కేర్పడి ఉండదు.

* * *

రథం కదిలింది.

ఉదయం ఎనిమిది గంటలవేళ కొండకోనల పైనుంచీ చల్లటి గాలి వీస్తోంది. ఏపుగా పెరిగి ఏటవాలుగా క్రిందికి వ్రాలి అలలు అలలుగా కదిలి పోతున్న వరిపైరు పైన నీరెండ మిల మిలలాడుతోంది. ఆవేళప్పుడు వాతావరణం ప్రశాంతంగా ఆహ్లాదకరంగా ఉండడం సహజమే! కానీ కారు ఇంటి దగ్గర బయల్దేరి నప్పటినుంచీ పరుగెడుతూ ఉండడమే విచిత్రం! అది బహుశా శ్రీహరి దగ్గరినుంచీ ఎంతో కొంత ఆత్మ విశ్వాసాన్ని అరువు పుచ్చుకున్నదేమో తెలియడం లేదు.

సైకిళ్ళు త్రొక్కడం దగ్గరినుంచీ మొదలుపెట్టి విమానాల్ని నడిపించేదాకా వివిధ శకటాల సారథ్యంలో సారధికి ఎదురయ్యే చిక్కుల్ని గురించి చెబుతున్నాడు శ్రీహరి. తంతి కంబాలకు ఢీకొని ముక్కలైన సైకిళ్లు, చెట్లకు మోదుకుని తలక్రిందులైన లారీలు, సముద్రంలో బుడుంగుమని మునక వేసిన ఓడలు, ఫల్టీలు కొడుతూ భూపతనమైన విమానాలు—మున్నగు దృశ్యాలను కళ్ళకు గట్టినట్టుగా వర్ణిస్తున్నాడు శ్రీహరి. పరుగెడుతున్న కారులో గనుక కూర్చోకపోతే అలాంటి ప్రసంగాన్ని ఎంతసేపైనా విని ఆనందించవచ్చు! ఇదివర కెవరికో తటస్థించిన ప్రమాదాల కంటే ఈ క్షణాన్నో మరుక్షణాన్నో మనకు ఎదురు కానున్న అపాయం వెయ్యి రెట్లు దారుణమైనది! ఈ వాస్తవం శ్రీహరికి లీలామాత్రంగానైనా స్ఫురించినట్టు లేదు!

"పోనీలే శ్రీహరీ! ఫర్లాంగుకు నాలుగుచోట్ల వంకరలు తిరుగుతున్న రోడ్డిది. నువ్వు కాస్త రోడ్డు పైకి చూస్తూ రథం తోలు" అన్నాను.

శ్రీ హరి గొల్లున నవ్వేశాడు—"అలాగైతే నీకో విశేషం చెప్పాల్సిందే! ఏం జరిగిందో తెలుసా శేఖరం! విదేశీయు డొకడు కళ్ళకు గంతలు కట్టుకుని కారు నడిపేశాడు. అదీ మదరాసు మహానగర వీధుల్లో!"

"కావచ్చు. మట్టి గుర్రంపైన కూర్చుని మహా నదిని దాటడం మహానుభావులకే సాధ్యం! అలాగని అందరూ వాళ్ళని అనుకరించడం ఏమంత మంచిది?"

కారు డ్రయివింగులో తన నేర్పరితనాన్ని శంకించినందుకు శ్రీహరికి నాపైన ఇంచుక కోపమే వచ్చింది. "ప్రాణాలపైన తీపి నీ కొక్కడికేనా శేఖరం! ప్రాణాలు అంత నిర్లక్ష్యంగా త్యజింప దగినవి కావని నాకూ తెలుసు! నీ కెందుకూ, నువ్వు నిశ్చింతగా కూర్చో! సురక్షితంగా గమ్యస్థానం చేర్చే బాధ్యత నాది......"

చెప్పడమేగాదు. చెప్పిన మాటను నిలబెట్టుకున్నాడు శ్రీహరి. గమ్యస్థానం చేరువలో ఉండగా మదిలో ఓ సాంప్రదాయికమైన ఊహ మెదిలింది,



బయల్దేరిన వేళా విశేషం మంచిదేమో! మనసులో ఉంచుకోలేక ఆ మాట పైకనేశాను. శ్రీహరి కీసారి కాస్త ఎక్కువ మోతాదులోనే వచ్చింది కోపం! "చివరంటా వచ్చేశాము గనుక అందుకు కారణం బయల్దేరిన వేళా విశేషం! మధ్యలో ఆగిపోయి ఉంటే అందుకు కారణం నా అసమర్థత! చూడు శేఖరం! నువ్వు ఉపాధ్యాయుడివి! నీపైన నమ్మకంలేని శిష్యుడికి నువ్వేం పాఠం బోధించగలవు? అలాగే ప్రయాణీకుడికి గూడా డ్రయివరుపైన నమ్మకం ఉండాలి......"

నిజమే! నమ్మి చెడినవారు లేరు, నమ్మక చెడిపొయ్యేరు— అంటూ బైరాగులు పాడుతుంటే అంతరార్థం తెలిసిందిగాదు. ఇప్పుడు శ్రీహరి వ్యాఖ్యానం మూలంగా తత్వం బోధపడింది.

పైరు పచ్చనచేత, వాటికి వెనుక మామిడి తోపులచేత, ఆ పిమ్మట పచ్చటి కొండలచేత పరివేష్ఠింపబడి మిగిలిన ప్రపంచంనుంచి దూరంగా విసరి వేయబడినట్టున్న చిన్న పల్లెటూరు తరిగొండ. అలాంటి పల్లెలో సెలవు రోజులు గడుపుతున్న కాలేజి విద్యార్థికి మిత్ర సమాగమం అత్యంతానందదాయకం గావడంలో ఆశ్చర్యంలేదు. సుధాకరం గాలి కొట్టిన బెలూనులా ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైపోయాడు. మిత్రుడెక్కి వచ్చిన పాత పాత కారు అతడి కళ్ళకు పుష్పక విమానంలా గోచరించింది.

"రండి రండి. అబ్బే, ఇక్కడెందుకు? పైకే వెళ్ళడం బాగుంటుంది. ప్రయాణంలో బాగా అలసిపోయి వచ్చారు. మొదట స్నానం చేస్తారా శ్రీహరీ! పోనీ, కాఫీ తీసుకోగూడదూ......"

"భోజనాల వేళప్పుడు ఇప్పుడు కాఫీ ఎందుకు" అన్నాను.

నా మాటకు బదులు చెప్పడాని కక్కడ సుధాకరం లేడు. ఏవో పురమాయింపులకోసం అతడు క్రిందికి వెళ్లాడు. స్నేహితుడి బాధ్యతను శ్రీహరి తానే స్వీకరించాడు—

"భోజనాలకు గూడా ధోకా ఉండదు" అన్నాడతడు పిల్లైనంత అమాయకంగా ముఖం పెట్టి!

"అప్పటి కది నీపాలిటికి భ్రాంతిగా పనికిరాని వస్తువా శ్రీహరీ!" నేనూ పిల్లైనంత అమాయికంగానే ప్రశ్నించాను.

అంతలో మళ్ళీ సుధాకరం ప్రత్యక్షం— శుభ వార్తలతో సహా! శుభ వార్తల్లో మొదటిది వేడినీళ్ళు సిద్ధంగా ఉన్నాయి. రెండోది కాఫీ తయారౌతోంది.

"వీరిని పరిచయం చేశావు కావే" అన్నాడు సుధాకరం.

"వీరే రాజశేఖరంగారు! చదువుకున్నవారు. చదువు చెబుతున్నవారు......"

"అలాగా! నమస్కారమండీ రాజశేఖరంగారూ! శ్రీహరి మిమ్మల్ని గురించి మాటి మాటికీ చెబుతుండేవాడు. అన్నట్టు ఎండలోపడి వచ్చారు. మొదట చల్లగా మంచి నీళ్ళు పుచ్చుకుంటారా శ్రీహరీ!"

మంచి నీళ్ళకోసం మళ్ళీ ఎక్కినంత దూరం క్రిందికి దిగి వెళ్ళేవాడే సుధాకరం. అంతలో పొగలెగసే కాఫీ పానీయమే పైకి వచ్చేసింది.

కాఫీ తీసుకోమని చెప్పి చరాలున పైకి లేచాడు సుధాకరం! "ఇప్పుడే వస్తాను శ్రీహరీ! మరేం లేదు"

41 వ పేజీ చూడండి

# మనమూ - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## చిన్నప్రేగు : దాని నిర్మితీ ధర్మములు

చిన్నప్రేగు చుట్టలు చుట్టుకున్న ఒక గొట్టమువంటి నిర్మితి. అది పైలోరస్ దగ్గర ఆరంభమై పెద్ద ప్రేగులో అంతమవుతుంది. దాని పొడుగు 16, 17 అడుగులు ఉంటుంది. పెద్ద ప్రేగు ఒక చుట్ట కుదురులా ఏర్పడి ఉంటుంది. ఆ చుట్ట కుదురు మధ్యవున్న ఖాళీలో చిన్న ప్రేగు పాము చుట్టుకున్నట్లుగా చుట్టుకుని ఉంటుంది. చిన్న ప్రేగులో మొదటి భాగమును డుయోడినం అంటారు. దాని పొడుగు షుమారు 10 అంగుళములు (1) డుయోడినం (2) జెజునం (3) ఇలియం అని చిన్నప్రేగు మూడు భాగములుగా విభజించ బడ్డది. డుయోడినమును గురించి ఇదివరకే తెలుసుకున్నాము.

జెజునం (Jejunum) కూడా నానా క్షపి కలదే ' దాని వ్యాసము నాలుగు సెంటీమీటర్లు, అంటే రెండు అంగుళాలకు కాస్త తక్కువ. చిన్న ప్రేగును 5 భాగములు చేస్తే, మొదటి రెండు భాగములు జెజునం, మిగతా భాగం 'ఇలియం' అవుతుంది. ఈ విభాగం నిర్మితీ భేదమువల్ల యేర్పడింది. స్థూల నిర్మితి రెంటిలోనూ ఒకేలాగే ఉంటుంది. కాని సూక్ష్మ నిర్మితిలో మాత్రం కొన్ని భేదములు కనుపిస్తవి.

జెజునం గోడ ఇలియం గోడకంటె మందం గానూ రక్త పుష్కలంగానూ ఉంటుంది. చిన్న ప్రేగు మ్యూకస్ మెంబ్రేను నిర్మాణానికి, మిగతా జీర్ణనాళములో మూకస్ పొర నిర్మాణానికి కొన్ని ముఖ్య భేదాలున్నవి. చిన్న ప్రేగంతా "మెసెంటరీ"ని అంటుకుని ఉంటుంది. మెస్ (Mes) అన్న లేటిన్ విశేషణానికి "మధ్య ఉన్న" అని అర్థము. ఎంటిరాన్ అంటే ప్రేగు కదా ! ఈ మెసెంటరీ (Mesentary) ఉదర కుహరం వెనుక గోడను అంటి ఉండి, రెండు పొరలు చీర కుచ్చెళ్ళ లాగా అమరి ఉన్న నిర్మితి. దీని నిండా రక్త నాళములూ లింఫు గ్రంథులూ అత్యధికంగా ఉంటవి. ఉదర కుహరమును చుట్టి 'పెరిటోనియం' (Peritonium) అనే సీరస్ మెంబ్రేను, ఉన్నది. అది రెండు మడతలుగా ఉంటుంది. వెలుపలి పొర ఉదర కుడ్యమును అంటి ఉంటుంది. రెండవ పొర మడతలు మడతలుగా యేర్పడి ఉదరాంతర్భాగములో ఉండే వివిధాంగములను బట్టి ఉంటుంది. కొన్ని అంగములను పూర్తిగా చుట్టి ఉంటుంది. మరి కొన్నింటిని కొంత వరకే చుట్టి ఉంటుంది. ఈ విధంగా ఉదర కుహరంలో "పెరిటోనియాంతరము" (Intraperitoneal) "పెరిటోనియ బాహిరము" అని రెండు ఉప అంతరాళములు ఏర్పడతవి. ఈ నిర్మాణ విశేషము శస్త్ర వైద్యములో చాలా ముఖ్యమైనది. చిన్న ప్రేగును చుట్టి ఉండే పెరిటోనియం మడతను 'మెసెంటెరీ' అంటారు. ఇది విసనకర్ర ఆకారం గలది. ఇది వెనకవైపున ఉదర కుడ్యమును అంటి ఉంటుంది. దీని దూరాంతము చీరకుచ్చెళ్లలాగా మడతలు పడి ఉంటుంది. ఆ మడతలను అంటి ఉన్న చిన్న ప్రేగూ మడతలు పడి ఉంటుంది. 16 అడుగుల పొడుగూ. రెండు అంగుళముల లావూ కలిగిన ప్రేగు, ఇంకా అనేక ఉదరాంగములూ పరిమితమైన ఉదర కుహరములో ఇమిడి ఉండడానికై సృష్టి శక్తి ఈ ఏర్పాటు చేసింది. చిన్న ప్రేగుకు పోయే ఆర్టెరీలు, దానిలో రక్తమును హృదయానికి చేరవేసే వెయినులూ, అక్కడ నుండి పోయే లింఫు నాళములూ, వాటికి సంబంధించిన లింఫు గ్రంథులూ, ఇవన్నీ ఈ మెసెంటరీలోనే ఉంటవి. ప్రేగుల్లో యేర్పడిన క్షయ వ్యాధిలో ఈ భాగం మెత్తబడి, మైదాపిండి ముద్దలాగా తయారవుతుంది. ప్రేగుల్లో ఏర్పడిన క్రిమి వ్యాధుల్లో ఇక్కడ ఉండే లింఫు గ్రంథులు పెద్ద వవుతవి. అక్కడ ఏర్పడే కేన్సరులోనూ ఇవి పెద్ద వవుతవి. అనేక ప్రమాదకర పరిస్థితుల నుండీ, చిన్న ప్రేగును రక్షించడానికై యేర్పడిన అంగ రక్షకులుగా వీటిని భావించవచ్చును.

'జెజునం', అన్న లేటిన్ మాటకు, ఖాళీగా ఉన్నది. అని అర్థము మరణానంతర 'జెజునం'లో ఏమీ ఉండదు. అది ఖాళీగా ఉంటుంది. జీవితకాలంలోనే దానిలో పదార్థములు ఉండడం గాని, దాని విన్యాసంగాని కనుపిస్తవి. సింపతెటిక్ దండ నుండి వచ్చే నరముల కూడలు అయిన వివిధ ప్లెగ్జసులలో రెండు ప్లెగ్జసులు చిన్న ప్రేగుకు సంబంధించిన మెసెంటరీలో ఉంటవి.

చిన్న ప్రేగు మ్యూకస్ పొరకూ, డుయోడినం మ్యూకస్ పొరకూ నిర్మితీ ధర్మములో భేదం ఉన్నది. చిన్న ప్రేగు మ్యూకస్ పొర మందంగా ఉండి, వలయాకృతి గల మడతలుగా ఏర్పడి ఉంటుంది. ఆహార పదార్థమును అంటి ఉండే ప్రదేశపు వైశాల్యము అధికం కావడానికై ఈ ఏర్పాటు చేయబడింది. ఈ మూకస్ పొర నునుపుగా ఉండదు. దీని నుండి, చేతివ్రేళ్ళ వంటి నిర్మితులు ఆంత్రాంతరాళంలోకి చొచ్చుకొని ఉంటవి. వీటిని 'విల్లసులు' అంటారు. విల్లసుల (Villus) నిర్మితీ ధర్మములను తరువాత వివరిస్తాను. ఇవి జెజునంలో కంటె ఇలియంలో అధికంగా ఉంటవి. కాని జెజునంలో ఉండే విల్లసులు ఇలియంలో ఉండే వాటికంటె పెద్దవిగా ఉంటవి. ఇలియంలో మ్యూకస్ పొరలో జెజునంలో కనుపించే వలయాకృతి గల మడతలు కనుపించవు. ఈ నిర్మితీ భేదములను బట్టే చిన్న ప్రేగులో ఇది జెజున భాగమని, ఇది ఇలియ భాగమనీ నిర్ణయించవచ్చును.

ప్రాదేశికంగా జెజునం నాభి చుట్టూ ఉండే ప్రదేశంలో ఉంటుంది. ఉదరాంగములనూ, అవి ఉండే ప్రదేశములనూ తెలుసుకోడానికై ఉదరము ముందు వైపును కొన్ని భాగములుగా శాస్త్రజ్ఞులు విభజించారు. ఈ విభజన కేవలం ఊహాజనితమైనది. దీనికీ అంతర్నిర్మితులకూ, ఆయా ప్రదేశాలలో వాటి భాగములు ఉండడం తప్ప మరే సంబంధమూ ఉండదు. చిత్రంలో చూపబడిన నాభి భాగం (5)లో జెజునం ఉంటుంది. కాని తరంగచలనంలో అది ఇతర ప్రదేశాలలోకి కూడా పోవచ్చును. చిన్న ప్రేగు మడతలు వాన పాములలాగా ఎటు బడితే అటు కదులుతూ ఉంటవి. వాటిమధ్య అతుకులు గాని, వాటి చలనమును నిరోధించే మరే కారణం గాని ఆరోగ్య స్థితిలో ఉండదు. కాని కొన్ని పరిస్థితులలో చిన్న ప్రేగు మడతల మధ్య అతుకులు (Adhesions) ఏర్పడి ఆంత్ర గతికి నిరోధం కలిగించ వచ్చును. ఈ నిరోధం సంపూర్ణం కావచ్చును, అసంపూర్ణము కావచ్చును. ఆ సమయంలో కలిగే బలవత్తరమైన సంకోచ వ్యాకోచములకు ఫలితంగా ప్రేగు మెలికబడ్డ రబ్బరు గొట్టం లాగా అయి పోయి, ఆహారగతి ఆగిపోయి ఉదర ప్రదేశంలో తీవ్రమైన బాధా, ఆంత్రంలో ఉండే పదార్థములు పైకి ఎగదన్ని వాంతిగా రావడం జరుగవచ్చును ఇది మహా ప్రమాదకరం.

**ఇలియం**-ఇలియం, జెజునం కంటె కొంచెం సన్నగా ఉంటుంది దాని గోడ కూడా జెజునం గోడ కంటె పలచగా ఉంటుంది. దాని మ్యూకస్ పొరలోనూ వలయాకృతి గల మడతలు మొదటి భాగాల్లో ఉన్నా చివర భాగాల్లో క్రమంగా అంతరించి పోతవి. ఇలియం ఎక్కువగా హైపోగేస్ట్రిక్ ప్రదేశం (8)లో ఉంటుంది. ఉదరం క్రింది




'విల్లస్'

1. ఎపిథీలియము, 2. లేక్టీలులు చుట్టివుండే కేపిలరీ ..., 3. లేక్టీల్, 4. విల్లస్‌నుండి పోయ్యే వెయిను శాఖ, 5. విల్లసుకుపోయే ఆర్టెరీ శాఖ.

భాగం, తల్ల క్రిందులుగా ఉంచిన హేట్ (Hat) లాగా ఉంటుంది. దానిలో గిన్నెవంటి ప్రదేశ మును పెల్విస్ (Pelvis) అంటారు. పెల్విస్ అంటే 'బేసిను', ఇలియం చివరి భాగము పెల్విస్‌లో ఉంటుంది. దాని అగ్రము పైకిలేచి కుడివైపు పోయి పెద్ద ప్రేగు మొదటి భాగమైన సీకము (Caecum)లో అంతమవుతుంది.

**చిన్న ప్రేగు నిర్మితి:-** చిన్న ప్రేగు గోడలో వెలుపలి నుంచి లోపలకు క్రమంగా (1) సీరస్ పొర (2) కండరముల పొర (3) మ్యూకస్ పొరకూ కండరములకు మధ్య ఉండే 'సబ్ మ్యూకస్' పొర (Sub-Mucous Layer) (4) మ్యూకస్ పొర అని నాలుగు పొరలున్నవి.

సీరస్ పొర పెరిటోనియంలో భాగం. కండరముల పొరలో నిలువు తీరులో కొన్ని కండరములూ, వలయాకారం గలిగి అడ్డువరసలో కొన్ని కండరములూ ఉంటవి. నిలువు తీరులో ఉండే కండరములు వెలుపలి వైపునా గుండ్రనివి లోపలి వైపునా ఉంటవి. 'సబ్' అంటే క్రింద ఉన్నవి అని అర్థము. మ్యూకస్ పొరకు క్రింద ఉండేది గనక దీనికాపేరు వచ్చింది. ఇందులో నారవంటి అనుబంధ దాతువిశేషము ఉంటుంది. దానిలో రక్తనాళములు, లింఫు నాళములు ఉంటవి. మ్యూకస్ పొర చాలా మందమైనదై రక్తపు పుష్కలమైనదై ఉంటుంది. ఈ రక్త పుష్కలత్వము క్రిందికి పోయిన కొద్దీ అధిక మవుతుంది. అంత్రము గోడలో ఉండే కండరముల పొరగాక, ఈ మ్యూకస్ పొర బహిరావరణలో అనిచ్ఛాధీన కండరములతో ఏర్పడిన చిన్న పొర ఉంటుంది. దానిలోనూ నిలువు తీరులోనూ, వలయాకారంగానూ ఉండే కండరములు ఉంటవి. దాని తరవాత వల వంటి ధాతువుతో తయారయిన పొర ఉన్నది. దీనిని రెటి పొరం టిష్యూ అంటారు. ఇందులో లింఫోసైటులు (Lymphocytes) ఉంటవి. ఇక్కడ రక్తనాళముల యొక్క, నరముల యొక్క శాఖోపశాఖలు అంత మవుతవి. ఆ తర్వాత రేణు మయములై, జీర్ణమైన ఆహారంలో ఉండే 'సార' భాగమును ఆహరింపబడడానికి కారణములైన ఎంజయిములను స్యందించే జీవకణముల వరస ఉంటుంది. ఈ వరస విల్లిస్సులను చుట్టి వాటి చివరి వరకూ పోతుంది. ఈ జీవకణములు రాలిపోతూ ఉంటే కొత్తవి ఉత్పత్తి అవుతూ ఉంటవి.

చిన్న ప్రేగు మ్యూకస్ పొర నుండి, పొడుచుకు వచ్చినట్లుగా విల్లిసులుంటవి. ఇవి అతి రక్త పుష్కలములుగా ఉంటవి. వీటివల్ల చిన్న ప్రేగు ఉపరిభాగం మొఖమల్ లాగా ఉంటుంది. ఇవి డువోడినంలోనూ జెజునంలోనూ అత్యధికంగా ఉంటవి. ఇలియములో అంతకంతకు వీటి సంఖ్య తగ్గి పోతుంది. చిత్రములో విల్లిను సూక్ష్మ నిర్మితి చూపబడ్డది. విల్లిస్ మధ్య భాగంలో లేక్టీలు (Lactel) ఉంటుంది. దీని గోడ ఎండో థీలియముతో తయారవుతుంది. దీనిని చుట్టి కొన్ని కండరము పోగులున్నవి. ఇవి చిన్న ప్రేగు గోడలో ఉండే కండరపు పొర శాఖలే. ఇవి సంకోచించినప్పుడు, ఆవు చన్నును వేళ్ళ పిసికినట్లుగా, లేక్టీల్ పిసకబడుతుంది. రక్త నాళములు వలలాగా ఏర్పడి ఉంటవి. వీటిని చుట్టి ఒక జీవకణముల పొర ఉన్నది.




1. ఉదర ప్రదేశ విభజన కుడి హైపోకాండ్రియల్ ప్రదేశము, 2. ఎపిగేస్ట్రిక్ ప్రదేశము, 3. ఎడమ హైపోకాండ్రియర్ ప్రదేశము, 4. కుడి లంబార్ ప్రదేశము, 5. నాభి ప్రదేశము, 6. ఎడమ లంబార్ ప్రదేశము, 7. కుడి ఇలియక్ ప్రదేశము, 8. హైపొగేస్ట్రిక్ ప్రదేశము, 9. పెల్విస్.

చిన్న ప్రేగు మ్యూకస్ పొరనిండా అసంఖ్యాకములైన గ్రంథులున్నవి : వీటి మూతులు రెండు విల్లిసుల మధ్య తెరచుకొని ఉంటవి.

చిన్నప్రేగు మ్యూకస్ పొరలో అక్కడ లింఫాయిడ్ టిష్యూతో యేర్పడిన జీవకణములు ఉంటవి. చిన్న ప్రేగు మ్యూకస్ పొరలో కొన్ని చోట్ల లింఫాయిడ్ టిష్యూ ముద్దలు ముద్దలుగా కనిపిస్తుంది. వీటి ఉనికిని, 'పేయరు' (Peyer) అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టేడు. ఇవి తరుణుల్లో బాగా వివరంగా తెలుస్తవి. మధ్య వయస్సులో, ఉండీ ఉండనట్లుగా ఉంటవి. వృద్ధుల్లో అంతరించి పోతవి. ఇలియంలో ఉండే లింఫాయిడ్ టిష్యూ ముద్దలు పెద్దవిగా ఉంటవి. జెజునంలో చిన్నవిగా ఉంటవి. వాటి సంఖ్య కూడా తక్కువ గానే ఉంటుంది. ఈ లింఫు ధాతువు ముద్దలున్న చోట విల్లిను లుండవు. ఈ ముద్దలను కాలంమ్నార్ ఎపితీలియం క్రమ్మి ఉంటుంది. వరముల వలలూ, రక్తనాళముల వలలూ వీటి చుట్టూ విరివిగా ఉంటవి టైఫాయిడ్ జ్వరంలో ఈ లింఫాయిడ్ ముద్దలు ఇన్‌ఫ్లేం అయి వూడి, అక్కడ అల్సర్లు రక్త స్రావమూ ఏర్పడతవి. ఎంటిరాన్ అంటే ప్రేగు. ఇందులో ఉండే లింఫాయిండ్ ధాతువును నశింపజేసి అక్కడ అల్సర్లను కలిగించే వ్యాధి గనక టైఫాయిడ్ జ్వరానికి ఎంటెరిక్ (Enteric) జ్వరమనే పేరు కూడా ఉన్నది. కాని టైఫాయిడ్ జ్వరం వచ్చిన ప్రతివారిలోనూ ఇల్లా జరగక పోవచ్చును. చిన్న ప్రేగులో లింఫు నాళముల అత్యంతాంతములే లేక్టీలులుగా తయారవుతవి. చిన్న ప్రేగుకు వచ్చే నరములు సీలియక్ గేంగ్లియాను నుండి వస్తవి. వేగస్ నరం శాఖలు ఇక్కడ అధికంగా ఉంటవి. సాధారణంగా సింపతెటిక్ నరములు తరంగ చలనాన్ని నిరోధిస్తవి. కాని స్ఫింక్టర్లను మూస్తవి. పేరా సింపతెటిక్ నరములు (ఈ భాగంలో వేగస్ ఒక్కటే పేరాసింపతెటిక్) ఇది తరంగ చలనమును అధికం చేసి స్ఫింక్టర్లను తెరుచుకునేటట్లు చేసుంది. ఏ అంగానికి పేరాసింపతెటిక్ నరములు పోతున్నవో ఆ అంగం సంకోచ స్థితిలోనో వ్యాకోచ స్థితిలోనో ఉన్నప్పుడు పేరా సింపతెటిక్ నరములు ప్రేరేపింప బడితే, ఉన్న స్థితికి వ్యతిరేకమైన స్థితిని అవి కల్పిస్తవి.

చిన్న ప్రేగులో ఉండే గ్రంథులు స్యందించే జీర్ణ రసమును సక్కస్ ఎంటెరికస్' (Succus Entericus) అంటారు. అందులో ప్రొటీను కార్బోహైడ్రేటు, కొవ్వు అనే మూడు రకముల ఆహార పదార్థములను పూర్తిగా జీర్ణించే ఎంజయములు ఉన్నవి.

చిన్న ప్రేగు గోడలో ఉండే కండరములు సంకోచించినప్పుడు, దానిలో మ్యూకస్ పొర పెద్ద పెద్ద మడతలుగా ఏర్పడుతుందని, అందువల్ల ఆహారాన్ని కలిసి ఉండే మ్యూకస్ పొర వైశాల్యం అధిక మవుతుందని ఇదివరకే తెలుసుకున్నాము. ఈ మడతలే కాక, అసంఖ్యాకములైన విల్లిసులు గూడా ఆహరమును అహరించుకునే ప్రదేశ వైశాల్యాన్ని అధికం చేస్తవి.

ప్రతి విల్లిస్‌లోకీ ఒక ఆర్టెరీ శాఖ పోయి కేపిలరీ వలగా అంత మవుతుంది. ఆ కేపిలరీవల దూరాంతము (Distal End) వెయినుగా మారుతుంది. అయితే ఈ వెయిను ఇతర వెయినుల లాగా హృదయానికి పోదు. ఈ చిన్న వెయినులన్నీ చేరి పోర్టల్ వెయిను (Portalvain)గా రూపొందుతుంది. పోర్టల్ వెయిన్ లివరులోకి పోయి, లివరు భాగాల్లో శాఖోపశాఖలుగా చీలిపోతుంది. కొవ్వు పదార్థములన్నీ లేక్టీలుల ద్వారా, ప్రధాన లింఫు నాళమైన థోరాసిక్ డక్టు ద్వారా రక్తంలో కలిసిపోయి హృదయానికి చేరి, ఆర్టెరీల ద్వారా వివిధ ప్రదేశములకు పోతవి. మిగతా వస్తువులు పోర్టల్ వెయిను ద్వారా లివరుకు చేరుతవి. ప్రేగుల్లో ఉన్న పదార్థములు విల్లిసులలోకి పోవడం, విల్లిస్‌లలోనూ ప్రేగులోనూ ఉండే పీడన శక్తి ప్రభేదములవల్ల, బల భేదములు ఉన్న ద్రావణముల మధ్య అర్ధ వ్యాపన శక్తిగల పొర ఉన్నప్పుడు, బలాధిక్యతగల ద్రావణంలోకి, బల హీనమైన ద్రావణ వస్తువులు పోయి వాటి బలములు సమాన మవుతవి. ఈ శక్తిని ఆస్మోటిక్ ప్రెషరు (Osmotic pressure) బల భేదములు ఆహరణకు (Absorption) అనుకూలంగా లేక పోయినా, కొన్ని వస్తువులను బలవంతంగా తమలోకి గుంజుకోగల శక్తి కొన్ని జీవకణములకు ఉంటుంది. అటువంటి శక్తి విల్లిసులలో ఉన్న జీవకణములకు ఉంటుంది. ★




"సరిగ్గా సమయానికి రైలు అందింది..."

"మరేం...."

"వెళ్తూనే అమ్మగారి కెలా ఉండేది ఉత్తరం రాయండి"

"అలాగే"

ప్యాసెంజరు కదిలింది.

ప్లాట్‌ఫారంమీద తనను చూస్తూ నిల్చున్న రాజేశ్వరి దూరమవుతూంటే అదో అవ్యక్తమైన బాధతో సీట్లోకి జారగిలపడ్డాడు చలపతి.

కంపార్ట్‌మెంట్ పూర్తిగా క్రిక్కిరిసి ఉంది. కూర్చోడానికి చోటులేక ఎక్కువమంది నిలబడే ఉన్నారు......చలపతి సిగరెట్ వెలిగించబోయి వేళ్ళు కాల్చుకొన్నాడు ...... అదృష్టవశాత్తు చోటు దొరికినా అలసిన కళ్ళకు నిద్దరంటడంలేదు..... కిటికీలోంచి చూస్తూ కూర్చొన్నాడు......చల్లగాలి బరువుగా వీస్తూంటే లోనికి తలపెట్టాడు. 'సూటుకేసు'లోంచి 'పుస్తకం' తీసుకొని పేజీలు తిప్పాడు......రెండు నిముషాల్లోనే విసుగ్గా పుస్తకాన్ని మూసి కళ్ళు మూసుకొన్నాడు. మళ్ళీ కళ్ళు తెరిచాడు.....కిటికీలో తలపెట్టబోయేసరికి బొగ్గు కణాలు వీచాయి......

చలపతి శరీరంలో నర నరాలు ఒకటి కొకటి పొట్లాడుకొని, విధితోబాటు తిరుగుబాటు చేస్తున్నాయి. ఏవో ఆలోచనలు కల్గించే ఏదో ఆవేశం? ఎందుకో అర్థంకాని మానసిక సంఘర్షణ చెప్పలేని ఆవేదనతో.....

రైలుకంటే వేగంగా....మరింత వేగంగా అతని మనసు గాలిలో దీపంలా రెపరెప లాడుతూంది.

ఆవేళ మధ్యాహ్నం తను 'వార్డు'లో ఏదో రోగి కేసును ఫైనలైజ్ చేస్తూంటే టెలిగ్రాం వచ్చింది. అది మామయ్య ఇచ్చిన టెలిగ్రాం.

''అమ్మ ప్రమాద పరిస్థితిలో ఉంది...... వెంటనే బయల్దేరు......'' చలపతి నిలువెల్లా వణికిపోయాడు. మిట్ట మధ్యాహ్నమే చలపతి గుండెలకు చీకట్లు క్రమ్మాయి. 'ఏం ఫరవాలే దంటూ' రాజేశ్వరి ఇంటికి తీసుకొని వెళ్ళింది. రాఘవరావుగారు చలపతిని ఎంతో ఓదార్చారేకాని చలపతి అసంతృప్తి, బాధతో పిచ్చి పట్టిన వాడిలా ఉండిపోయాడు.

''చలపతీ! అన్నిటికి భగవంతుడున్నాడు. నువ్వేం దిగులు పెట్టుకోకు? రాత్రి రెండింటికి గాని రైలుండదు. ఏ టాక్సీయైనా కుదుర్చుదా మంటే దగ్గర దూరం కాదాయే! నువ్వు ఇంటి కెళ్లేసరికి మీ అమ్మ తప్పకుండా నిన్ను చిరునవ్వుతో పలకరిస్తుంది!'' రాజేశ్వరి నాన్న రాఘవరావుగారు కడసారిగా చెప్పిన మాటలవి.....

రెండు రోజుల క్రితం అమ్మ స్వయాన వ్రాసిన ఉత్తరంలో అనారోగ్యాన్ని సూచించే మాటే లేదు......మరి ఇంత అకస్మాత్తుగా ఏం ప్రమాదం జరిగిందో? ఏమిటో?? బాధతో కృంగిపోయాడు చలపతి......

రాఘవరావుగారు టాక్సీకోసం ప్రయత్నించారు ఫలితం లేకపోగా తప్పనిసరిగా ఎద్దుబండిలాటి ప్యాసింజరులో వెళ్ళాల్సి వచ్చినందుకు విచారించాడు.......

త్వరగా అమ్మను చేరుకోవాలి? ఎలాగా?...... గంటలు గడుస్తున్నాయి......చలపతిలో ఆతృత ఎక్కువయ్యింది......అమ్మ కెలా ఉందో? ఏమో? ఏం ప్రమాదమో?......ఆతృతతోబాటు భయం కూడ ఎక్కువయ్యింది.

చలపతికి ఎన్ని స్టేషన్లు దాటాయో తెలియక పోయినా సగం దూరం కూడ రానట్టు ఊహించాడు......

సిగరెట్ ఆరిపోతే మళ్ళీ వెలిగించుకొని కిటికీ లోంచి చూస్తూ కూర్చున్నాడు......

చలపతి ముందుతరంవాళ్లు ధనవంతులు. గౌరవం, హోదా కంటూ డబ్బు విచ్చలవిడిగా వెదజల్లి చలపతి తండ్రి జోగినాయుడికి పదిహేనెకరాల మాగాణి, పెద్ద భవనం మిగిల్చారు. జోగినాయుడు చిన్న వయసులోనే పితృపాదుల ననుసరించడమేగాక, సప్త వ్యసనాల్లో మునిగి, ఇటు పెళ్ళాం పిల్లలకు, అటు అప్పుల వాళ్ళు కోర్టులో నెగ్గించుకొన్న ఆస్తికి దూరమయి, లక్ష్మీనరసు అనే భోగందాని కౌగిలిలోపడి ప్రపంచాన్నే మరిచిపోయాడు.

జోగినాయుడి భార్య రంగనాయకమ్మ భర్త పెట్టే బాధల్ని, హింసల్ని భరించలేక, భర్తను, పిల్లల్ని వదలి ఎక్కడికో పారిపోయింది......పాలేరు వెంకడితో లేచిపోయిందనే అపవాదుతో జోగినాయుడి కుటుంబానికి పెద్ద మచ్చ ఏర్పడింది. గౌరవం కల వంశం ఇలా అప్రతిష్ఠలో పడి తన్నుకొంటూంటే దిక్కు తెలియని పసిపిల్లలు ''అమ్మా'' అని కలవరిస్తూంటే వీటి నన్నిటిని ఒక వైపు ఉంచి, తన ధ్యాసలో పడి లక్ష్మీనరసు కౌగిలిలో మత్తుగా పడి జోగినాయుడు జోగుతూంటే, 'అనసూయమ్మ' దేవతలా వచ్చి వాళ్ళ మధ్య నిల్చింది.

అప్పటికే జోగినాయుడు మిగిల్చిందల్లా రెండెకరాల మాగాణి, భవనం, నాల్గేళ్ళ కొడుకు చలపతి, రెండేళ్ళ కూతురు శశి.

అనసూయమ్మ రంగనాయకమ్మకు స్వయాన అప్పగారు. అత్తగారింటి కెళ్ళిన రెండు సంవత్సరాలకే తన భర్త ప్రమాదవశాత్తు చనిపోవడం, ఆప్యాయాన్ని చూపే ఆప్తులు లేక బాధపడుతున్న అనసూయమ్మ జోగినాయుడి కుటుంబ పరిస్థితుల్ని అర్థం చేసుకొని వాళ్ళను ఆదుకోవడం కన్నా మంచి పని లేదనుకొని వాళ్ళింటికి చేరింది. నమ్మకమున్న రైతులకు తన పొలాన్ని అప్పచెప్పి, ఏటేట వచ్చే ఆదాయాన్ని పంపే ఏర్పాటు చేసుకొంది అనసూయమ్మ.

అనసూయమ్మ అల్లాంటి క్లిష్ట సమయాల్లో ఆదుకోకపోయుంటే చలపతి ఏమై ఉండేవాడో? బహుశా ఏ పొలం గట్లమ్మటో, గొడ్డు గోదను తోలుకొంటూ మురికి జీవితాన్ని గడిపేవాడు. అనసూయమ్మ చలపతిని, శశిని చేరదీసి తన కన్నబిడ్డలా ఆదరించింది. పిల్లలిద్దరూ కన్నతల్లిని మరిచి అనసూయమ్మనే 'అమ్మా!' అని అంటూంటే ఆమె మురిసిపోయేది.

ముకుందయ్య అనసూయమ్మకు స్వంత అన్నయ్య.....కుటిలత్వం, నిర్దాక్షిణ్యత, కర్కశత్వం, అహం, అసూయలను ఒకే మూసలో పోసి కరిగించి భగవంతుడు ముకుందయ్యను ప్రతిష్ఠింపజేశాడు.

చెల్లెలు రంగనాయకమ్మ కుటుంబంపై ముకుందయ్యకు మొదట్నించి అసహ్యం. వాళ్ళ మాటంటేనే గిట్టదు. తన చెల్లెల్ని జోగినాయుడి కిచ్చేందుకు తనలో ఏకోశాన ఇష్టం లేకపోయినా, తండ్రి ప్రోద్బలంతో ముకుందయ్య జోగినాయుడి కాళ్ళు కడగాల్సి వచ్చింది. సంబంధం చేశాడన్న మాటేగాని ఒక్కసారైనా వాళ్ళ గడప త్రొక్కి మంచినీళ్లు ముట్టాడు కాదు.

పుట్టినింటి కెళ్ళినా, ఆడబడుచు పొందే గౌరవం చెందక, దాసీలా చూసేసరికి, పుట్టినింటికి వెళ్ళడం మానుకొంది రంగనాయకమ్మ.

పొలం గట్ల తగాదాలో బావ మరదులు కోర్టు కెక్కడంతో ముందున్న సంబంధ బాంధవ్యాలు పూర్తిగా తెగిపోయాయి. భోగంవాళ్ళ ఇళ్ళను తిరిగే బావగారి ప్రవర్తనలను, తన వంశానికి చెల్లెలు తెచ్చిన అపవాదును మాపుకోలేక కర్కశత్వంతో ప్రవర్తించాడు ముకుందయ్య...... అల్లాంటి కుటుంబాన్ని అనసూయమ్మ ఆదుకోవడం చూసి మరింత ఉక్రోషంతో బాధపడ్డాడు...

మంచి రోజున చలపతి బళ్ళో చేరాడు. సహజంగా చలపతిలో మంచి తెలివి తేటలుండడం వల్ల అభివృద్ధిచెందే సూచనలు కన్పడ్డాయి.

తను ఏమైనాసరే చలపతిని బాగా చదివించి వాడిని గొప్ప వాణ్ణిగాచేసి, వంశానికి మంచి పేరు తీసుకొని రావాలని భావించుకొన్న అనసూయమ్మ చలపతికి చదువు మీదున్న శ్రద్ధ, పట్టుదలను చూసి, తన జీవితం ధన్యమవుతుందని సంబరపడింది.

జోగినాయుడు ఎప్పటికోగాని ఇంటికి వచ్చేవాడు కాదు. వచ్చినా ఆ కొద్ది నిముషాలు భోజనానికి ఉపయోగించి, మౌనంగా గడప దాటేవాడు. జోగినాయుడికి అనసూయమ్మ అంటే గౌరవం...., భయం......కాని లక్ష్మీనరసు కౌగిలి కున్నంత విలువలేదు.

రోజులు గడుస్తున్నాయి......సంవత్సరాలు తిరిగాయి.

జోగినాయుడి కుటుంబం రెండెకరాల మాగాణితో బ్రతుకుతున్నా దన్నమాటేగాని అనసూయమ్మ తన స్వంత పొలంమీదుగా వచ్చే ఆదాయంతో సంసారాన్ని సర్దుతోంది......

చలపతి ఎలిమెంటరీ చదువు ముగించి, ఊరికి మూడు మైళ్ళున్న ఉన్నత పాఠశాలలో చేరాడు. చలపతి బాగా చదవడం, మంచి మార్కులు సంపాదించుకొనడం చూసిన ముకుందయ్య అసూయపడడమేగాక, వాళ్ళ నాన్నలాగే వాడు భ్రష్టుడవుతాడని, వాడు పైకొచ్చే లక్షణాలు ఏ కోశాన లేవని, అందరిముందూ అంటూ తృప్తి పడేవాడు.....

చలపతి చదువు, జీవితం సాఫీగా జరుగుతున్నాయి......

అకాలగర్భంలోనే ఒకనాడు అకస్మాత్తుగా అనారోగ్య కారణంగా చలపతి చెల్లెలు శశి కలిసిపోవడం జరిగింది

అనసూయమ్మ, చలపతి హృదయాల్లో 'శశి' రూపు మాసిపోయినా, జోగినాయుడిలో మాత్రం 'శశి' నిల్చి బాధ పెట్టేది. ఆ బాధ కారణంగా జోగినాయుడిలో గొప్ప పరివర్తన కలిగింది.

రెండెకరాల మాగాణిలో మొట్ట మొదటిసారి నాగలి పట్టిన నాయుణ్ణి చూచిన అనసూయమ్మ సంతోషిస్తే, ఇంకొద్ది రోజుల్లోవున్న భవనం తన పేరుమీదుగా మారేదేనని లక్ష్మీనరసు బాధపడింది.

జోగినాయుడు సప్త వ్యసనాలకు దూరమై పొలంలో గుడిసె వేసి అక్కడే కాలం గడిపాడు.

చలపతి స్కూల్‌ఫైనల్ పాసయ్యాడు. మునసబుగా రబ్బాయితోబాటు చలపతి అనంతపురం ఆర్ట్సు కాలేజీలో చేరాడు......ఆరు నెలలు తిరగకనే పాము కాటుతో జోగినాయుడు మరణించడం పెద్ద దెబ్బ తగిలినట్లయ్యింది.

ముకుందయ్య మనసు మారలేదు.....చలపతి అభివృద్ధిపట్ల మరింత ఏహ్యభావ మేర్పడింది......

రెండెకరాల్ని తాకట్టుపెట్టి తెచ్చిన డబ్బుతో చలపతి కాలేజిలో చదువుతున్నాడు.......కష్టపడి బాగా చదివి కాలేజీలో విద్యార్థుల్లోను, మాష్టర్ల లోను మంచి అభిప్రాయాన్ని సంపాదించుకొన్నాడు. చలపతికి ఆ రెండేళ్లు రెండు క్షణాల్లా గడిచినా, అనసూయమ్మకు రెండు యుగాలుగా గడిచాయి....

చలపతి 'ఇంటర్' మొదటి శ్రేణిలోనే పాసయ్యాడు.

చలపతి 'మెడిసన్'కు అప్లయి చేశాడు.

'తన కూతురు శ్యామలను చలపతికి యిచ్చి, చదువుకుగాను డబ్బు సాయం చేయకూడదా' అని ముకుందయ్యకు బంధువులు కొందరు సలహా ఇస్తే 'వంశ గౌరవం లేనివాడికి మా అమ్మాయి నిచ్చేందుకన్నా......ఏ అడుక్కొనే వాడికో ఇవ్వటం మంచిది' అని అన్నాడు ముకుందయ్య.

అనసూయమ్మ తెగిన ఈ రెండు కుటుంబాల్ని ఒక్కటిగా చేయా లనుకొని అన్నను బ్రతిమాలాడింది. ముకుందయ్య 'ససేమిరా వీలు లేదన్నట్లు' చెప్పాడు.

చలపతికి మెడిసన్‌లో సీటొచ్చింది. మేరిట్

30 వ పేజీ చూడండి



"దొంగనోట్లు" అనే చిత్రంలో అగుపించనున్న అందాల నటి బి. సరోజాదేవి.

# విధి రాకాసి

స్కాలర్‌షిప్ కోసం అప్లయి చేశాడు తగినంత సిఫారసు లేకపోవడంవల్ల అది తనకు రాలేదు

తోటి విద్యార్థుల సహకారాన్ని, అధ్యాపకుల అభిమానాన్ని తన తెలివి—తేటల పరంగా పొందాడు....

చలపతికి డబ్బు మాత్రం సకాలంలో అందేది. ఒకసారి సెలవుల్లో అనసూయమ్మను "ఇంత డబ్బెలా వస్తోందని?" అడిగితే పొలాలమీద రాబడి ఎక్కువ వస్తోందని సర్దేసింది.

నెలలుగ.....సంవత్సరాలు గడుస్తున్నాయి.....

చలపతి ప్రతి ఏడు మొదటి శ్రేణిలోనే 'ప్రమోట్' అవుతున్నాడు.

చలపతి చదువు ఐదో ఏడులో చేరింది.

కాలేజీలో తనతో చదివే రాజేశ్వరికి, చలపతికి మధ్య చెప్పలేనంత అనుబంధం ఏర్పడి, ప్రేమగా మారింది.....రాజేశ్వరి, ఆమె తండ్రి రాఘవరావుగారు తనకు చేసే ఉపకారాల వల్ల చలపతికి వారిమీద గౌరవం, ప్రేమ కుదిరాయి. చలపతి అనసూయమ్మకు ఓసారి రాజేశ్వరిని గురించి చెబుతూ......సూచనప్రాయంగా అన్నపుడు......

"నీ భవిష్యత్తుకు ఏది అవసరమో నిర్ణయించుకొనే యోగ్యత, విచక్షణాజ్ఞానం గల వయస్సు ఉంది. వీటితో దృష్టి ఉంచుకొని నీవు ముందుకు అడుగు వేస్తావనే నమ్మకం నాకుంది. నేను భగవంతుణ్ణి ప్రార్థించేదల్లా ఒక్కటే.....నీ జీవితంలో కష్టాలంటూ ఉండకూడదనే....." అన్నది అనసూయమ్మ.

చలపతి సంతోషించాడు.

రాఘవరావు తనింట్లోనే బస మార్చమన్నాడు.... చలపతి అంగీకరించలేదు. చలపతి రాఘవరావు గారితో తన ఇంటి పరిస్థితుల్ని చెప్పాడు..... "కష్టాలు........శ్రీరామచంద్రుడిలాంటి వాడే పడ్డపుడు......మనం ఏమాత్రం వాళ్ళం....." అన్నాడు రాఘవరావు. ఇది జరిగిన కొద్ది రోజుల్లోనే మామయ్యనుంచి 'అమ్మకు బాగా లేదనే' టెలిగ్రాం రావడం జరిగింది.

ప్యాసింజరు పోతూనేవుంది......చలపతి నోట్లో సిగరెట్ ఆరిపోయింది. నిద్ర లేక కళ్ళు పీక్కొనిపోయి, ముఖంలో నల్లటి రంగు ఏర్పడింది. ఇంకా నాల్గు గంటలకుగాని చలపతి తన గ్రామం చేరుకోలేడు. అలాగే కళ్ళు మూసుకొన్నాడు.....చిన్న నిద్ర పట్టింది.......నిద్ర లేచేసరికి తన ఊరి పొలిమేరలు, పొలాలు కనిపిస్తున్నాయి. స్టేషన్ రాకుండగానే, పెట్టెను తీసుకొని తలుపు దగ్గర నిలిచాడు......స్టేషన్లో తనకోసం మామయ్య రావడం చూచాడు......

"టెలిగ్రాం ఎప్పుడు చేరిందేమిటి?" మామయ్య పలకరించాడు.

"నిన్న నాల్గు గంటలకు......ఇంతకీ అమ్మ కెలా ఉంది"......ఆతృతగా చలపతి అడిగాడు.

ముకుందయ్య జవాబు చెప్పేలోగా బండి సుబ్బన్న "త్వరగా రండి బాబూ!" అంటూ బండికి గిత్తను కట్టాడు.

బండి కదిలింది.

"మామయ్యా! నన్ను వేధించక అమ్మ కెలా ఉందో చెప్పండి.... "

"తెల్లవారుజామున పోయింది......" అంటూ ముకుందయ్య తలవాల్చుకొన్నాడు.

**చలపతిలో దుఃఖం ప్రబద్దలయ్యింది....**

కొద్ది నిముషాల్లో చలపతి ఇంటిముందు బండి ఆగింది. అమ్మ ఎదురుగాగ్గా తానెన్నడు ఊహించని స్థితిలో, తనని మరచి పోయినట్లు, విర్జీవంగా ఉంది......

"అమ్మా!" అంటూ బిగ్గరగా ఏడుస్తూ అనసూయమ్మ పాదాల చెంత పడిపోయాడు చలపతి.

జరగవలసిన ఏర్పాట్లన్ని ముకుందయ్య తోడుగా ఉండి జరిపించాడు.

చలపతి అశాంతితో రేగిపోయాడు. బాధతో కృంగిపోయాడు. రాజేశ్వరికి ఉత్తరం వ్రాద్దామనుకొన్నాడేకాని రాయలేకపోయాడు. రోజులు గడిచాయి. పెద్ద దినం బ్రహ్మాండమైన ఖర్చుతో జరిగింది.

ఆ సాయంత్రం చలపతి, అమ్మ పడుకొనే పడకను శుభ్రం చేస్తుంటే దిండు గలీబు క్రింద, ఒక పోష్టు చేయని ఉత్తరం తన అడ్రస్సు మీదుగా ఉండడం చూచాడు. అమ్మ తనకు పోష్టు చేయడానికి మరిచిందో లేక పోష్టు చేద్దామనేలోగానే కన్ను మూసిందో......ఏమో? అందులో ఏం రాసి ఉందో??.......

చలపతి కవర్ని చించాడు......ఉత్తరం తీసి చదివాడు.

"చిరంజీవి బాబుకు

మీ అమ్మ ఆశీస్సులు.

నీవీ ఉత్తరాన్ని చదువుతూనే ఎంత ఆశ్చర్యపడతావో నాకు తెలుసు. పరిస్థితుల ప్రాబల్యం వల్ల ఎప్పుడో విడిపోయిన రెండు కుటుంబాల్ని ఏకం చెయ్యాలనే ఆశతో వ్రాస్తున్న ఉత్తరం నీ జీవిత భవిష్యత్తును మార్చవచ్చు. అలా మారితేనే నాకు ఆత్మశాంతి.

నీ చదువుకి అయిన డబ్బు గురించి నువ్వెన్ని సార్లు నన్ను అడిగినా నీకు చెప్పలేకపోయాను...... ఇవాళ చెపుతున్నాను. మీ మామయ్యే నీకు డబ్బు అందించాడు. కష్ట సమయాల్లో ఆదుకొన్నాడు. ఇంత చదువుకు కారణం మీ మామయ్య సహాయమే. అతని ఋణం తీర్చుకోలేవేమోననిపిస్తోంది. అతను నీ చదువుకుగాను డబ్బు సహాయం చేస్తున్నాడని నీకు తెలిస్తే చదువైనా మానుకొంటావుగాని అతని డబ్బును ముట్టవని నాకు తెలుసు. నీ భవిష్యత్తును నరకడం చేయడం నా చేతకానిపని. అందుకనే తెలుప లేకపోయాను.

ముఖ్యంగా నిన్ను నేను ప్రార్థించేది ఒక్కటే... మామయ్య డబ్బు తిరిగి ఇవ్వమనికాదు. శ్యామల్ని వివాహం చేసుకోమనడం......శ్యామల అందమైంది. సద్గుణవతి.......నీ భవిష్యత్తు తీర్చిదిద్దడానికి కావాల్సిన జ్ఞానం ఉంది.

ఈ కోరిక నెరవేరిస్తే నా జన్మ ధన్యమవుతూంది. అప్పటికిగాని నా ఆత్మ సంతోషించదు.....

మీ అమ్మ."

చలపతి శిలలా మ్రాన్పడిపోయాడు. జారిన కన్నీటి బొట్లు ఉత్తరాన్ని ఖరాబు చేశాయి. హృదయంలో అగ్ని పర్వతం ప్రబద్దలయ్యింది.

తనమీద ఎన్నో ఆశలు పెంచుకొన్న రాజేశ్వరిని కాదనవలసిందేనా? తనకోసం తన జీవితాన్నే బలి చేసిన త్యాగమూర్తి అమ్మ మాట ఎలా కాదంటాడు?!......

**అమ్మ మాటను దాటి రాజేశ్వరినా?**

రాజేశ్వరి ఆశను త్రుంచి శ్యామలనా?

ఎవర్ని వివాహం చేసుకోవాలి? ఎవర్ని? ఏమో? ఏమో?

అర్థంకాని ఆలోచనలతో కృంగిపోయాడు.

అమ్మ మనసు ఎందుకు మారిందో తల బద్దలు చేసుకొన్నా చలపతికి బోధపడడంలేదు.

విధి తిరుగుబాటుకు వెర్రివాడిలా మారాడు చలపతి.

*          *          *

మునిమాపువేళ గుడిముందు తన్ను గురించి ఎవరో అడుగుతూంటే, చూచి దిగ్భ్రాంతుడయి, అటే అడుగేశాడు చలపతి.

"చలపతీ!" కేకవేశాడు రాఘవరావుగారు.

పలకరించే ఓపిక, ఉత్సాహం చలపతిలో లేవు.

రాజేశ్వరిని చూచి నిలువునా నీరయ్యాడు.

"గుర్తు పట్టకుండా అయిపొయ్యా వేమిటి చలపతీ! కనీసం ఉత్తరం రాయాలన్నా......"

"రాద్దామనుకొన్నానేగాని......." . మాటలు తడబడ్డాయి.

"నీ నుంచి ఉత్తరం రాకపోయేసరికి ఏం జరిగిందోనని బయల్దేరి వచ్చేశాం......"

"ఇంటికి వెళ్దాం పదండి" అంటూ చలపతి నడిచాడు.

రాఘవరావు, రాజేశ్వరి అతణ్ణే అనుసరించారు.

**రాజేశ్వరికి చలపతి ప్రవర్తన అర్థం కాలేదు....** చెప్పలేని బాధ పడుతున్నాడని అనుకొంది.

చలపతి, వాళ్ళకు కావాల్సిన ఏర్పాట్లన్నీ చేయించాడు ఆరాత్రే ముకుందయ్య రావడం, రాఘవరావుతో పరిచయం చేసుకొని వాళ్ళను విందుకు ఆహ్వానించడం జరిగింది. రాఘవరావు రాజేశ్వరిని విందుకు తీసుకెళ్ళక తప్పిందికాదు.

ఆ రాత్రి గడిచింది.

ఒక్క నిముషమైనా మనస్ఫూర్తిగా చలపతి రాజేశ్వరిని పలకరించలేకపోయాడు.

అతనిది మూగ బాధ. చెప్పలేక లోలోపల బాధ పడుతున్నాడు.

అప్పుడే పూసిన గులాబీని చూస్తూ నిలబడ్డ రాజేశ్వరి భుజంమీద చేయి వేశాడు రాఘవరావు

"గులాబీ చూడమ్మా! ఎంత బావుందో? ఎవరూ కోసుకోకూడదనే 'ముళ్ళు' ఉంచాడు. మనం ముళ్ళున్నాయని తెలియక గులాబీని కోసుకోవడానికి ప్రయత్నించడం మనం చేసిన తప్పు...."

"అవును.......నాన్నా!" కన్నీళ్ళు చెంపల్ని దాటాయి.

"చూడమ్మా! జరగ వలసిందేదో జరిగిపోయింది బాధ పడకు. ఇందులో చలపతిదేమీ తప్పులేదు.. అతనిమీద పరిపూర్ణమైన నమ్మకం నాకుంది. మనం ఈ పూటే వెళ్ళిపోదాం. లేకపోతే ఎన్నో ఆశలున్న వాళ్ళను చీకట్లోకి తోసినట్లవుతుంది...




"ఏమోయ్ నీ భార్య నిన్ను ఉద్యోగం మాన్పించి చదివిస్తోందటగా...అన్నట్టూ నీ సబ్జెక్టేమిటి?"
"...హోమ్ సైన్సు...అనగా గృహశాస్త్రం!!"

# విధి రాకాసి

వాళ్ళకు నిరాశ కల్గించడం మన ధర్మంకాదు.."

"చలపతి ఆరోగ్యం చూశారుగా....."

"అవునమ్మా! కాని మనం చేయ కల్గిందేమీ లేదు......"

**రాఘవరావును రాజేశ్వరి బరువుగా అనుసరించింది. వారు సామాను సర్దుకోవడం అప్పుడే వచ్చిన చలపతి చూసి తెల్లపోయాడు.**

"చూడు! చలపతీ! మేమీ పూటే వెళ్తున్నాం! ఏమీ అనుకోకు......" అంటూ రాఘవరావు చలపతితో చెప్పాడు.

చలపతి మౌనం దాల్చాడు. బలవంతం చెయ్యదల్చుకోలేదు.

ముకుందయ్య బండి పంపాడని పాలేరు చెప్పాడు.

బండిలో తండ్రి, కూతురు కూర్చొన్నారు.

"సెలవు చలపతీ! స్నేహితులమల్లే కలుసుకొన్నాం........ఆప్తుల్లాగా అనుబంధాన్ని పెంచుకొన్నాం.......కాని స్నేహితులు లాగే విడిపోతున్నాం"

ఆవేశం, ఆవేదన, అశాంతి ఒక్కసారిగా పెగిలి "రాజేశ్వరీ?" అంటూ తనలో తానే ఏడ్చేశాడు.....

బండి అప్పటికే గుడి దాటిపోయింది......

* * *

మాఘమాసంలో చలపతి పెళ్ళి జరిగింది. పెళ్ళికి రాఘవరావువచ్చి ఆశీర్వదించాడు..... రాజేశ్వరి గ్రీటింగ్సు పంపింది......

మూడు ముళ్ళతోబాటు చలపతి జీవితానికి విడివడని అనుబంధం ఏర్పడింది.

* * *

ఆకాశంలో వెలుగులేదు.....మబ్బు పట్టింది. చల్లగాలి వీచడంలేదు.....చలి గాలి వీస్తోంది. మంగళ వాయిద్యాలు వినపడడంలేదు...... ఊరకుక్కలు అరుస్తున్నాయి.

వాతావరణంలో ప్రశాంతతలేదు......తుఫాను ఉంది.

కాని ఇది శుభ సమయం........శోభనం.

గదిలో అగరొత్తులు వాసనతో పరిమళాన్ని వెదజల్లుతున్నాయి.

పడక చుట్టూ గులాబీల తోరణాలు......టేబిల్ మీద రక రకాల తినుబండారాలు......

పడకమీద పడుకొని కళ్ళు మూసుకొన్నాడు చలపతి!

గాజుల చప్పుడు—పరిమళాల గుబాళింపు ఒక్కసారిగా ఉక్కిరి బిక్కిరి చేసింది.

చలపతి కళ్ళు తెరిచాడు.......ఎదురుగ్గా తలుపు నానుకొని శ్యామల నిల్చి ఉంది......

ఇద్దరి మధ్య మౌనం......

దీపపు కాంతిలో శ్యామల మెరుస్తోంది. తల దించుకొని కాలి బొటనవ్రేలు నేలకు రాస్తోంది. నిమిషాలు గడిచాయి......శ్యామల తనకేం అన్యాయం చేసింది!........ఈ క్రొత్త పెళ్ళికూతురి తీయని కలల్ని ఎందుకు తను చెదర గొట్టాలి.....? ఈ అమాయకురాల్ని తనెందుకు బాధ పెట్టాలి? కనీసం తాళికట్టినందుకైనా శ్యామలకు న్యాయం చేస్తే, స్వర్గాననున్న తల్లి తప్పక సంతోషిస్తుంది!..

సిగ్గు, భయం శ్యామల్ని మూగదాన్ని చేశాయనుకొని చలపతి లేచి శ్యామల దగ్గరకు వెళ్ళాడు.

"శ్యామలా!" అంటూ భుజంమీద చేయివేసి తన వైపుగా త్రిప్పుకొన్నాడు.

**శ్యామల బరువుగా తిరిగింది.**

శ్యామల కన్నీటి బొట్లు చలపతి చేతిమీద పడి ఆశ్చర్యాన్ని కల్గించాయి.

ఆనంద భాష్పాలా? కాదు! కాదు!......

కన్నీళ్ళతో మెరిసే కళ్ళల్లో నైరాశ్యం, ముఖంలో సౌకుమార్యంపోయి విషాదంతో గూడు గట్టిన కరుకుదనం, భయంతో కుంచించుకుపోయిన శరీరం, ఆత్మ నీదికాదు శరీరం మాత్రమే నంటున్న అదో రకమైన చూపులు......

శ్యామల చలపతినుంచి విడిపించుకొని......

"నువ్వనుకొన్నంత పవిత్రురాల్ని కాదు బావా!" ఏడుస్తూనే అంది.

నీమీద నే నెపుడు ఏలాంటి ఆశ పెంచుకోలేదు......మా నాన్న చేసిన పన్నాగాల ఫలితంగా మన ఇద్దరి జీవితాలు నాశనమయ్యాయి......"

"నాకేం అర్థం కావడంలేదు"......చలపతికి నిజంగా అర్థం కాక అన్నాడు.

"అనసూయమ్మత్తకు నన్ను నీకు చేసుకోలనే ధ్యాస ఎప్పుడూ లేదు......"

నివ్వెరపోయాడు చలపతి.....

"మరి ఉత్తరం......"

"అది మా నాన్న ఫోర్జరీ చేసిన ఉత్తరం..... అమ్మ మాటకు నీవు కట్టుబడతావని చేసిన ఎత్తు"

"ఎదువుకు డబ్బు ఇచ్చారా?"

"అసత్యం......అనసూయమ్మత్త మా నాన్నను కానీ కూడ ఆశించలేదు.....తన ఆస్తినే తెగ నమ్మి చదివించింది......"

చలపతిలో రక్తం గడ్డ కట్టింది. నిలువెల్లా వణికాడు. రాఘవరావుగారితో నీమీద మేము ఎన్నో ఆశలు పెంచుకొన్నామని, ఆశలు నిరాశ చేయొద్దని చెప్పాడు మా నాన్న......రాఘవరావు, రాజేశ్వరిలను తన ప్రార్థనను అంగీకరించేటట్టు చేసింది కూడా మా నాన్నే......" శ్యామల కంఠం బొంగురు పోయింది.

"ఇది నిజమా శ్యామలా?"

అబద్ధాల్ని సృష్టించి జీవితాల్ని నరకంచేసే నీచురాల్ని కాదు బావా! నేను ఇదివరకే ఇంకొకర్ని ప్రేమించాను.......అతడు నన్ను మనసారా ప్రేమించాడు.......అనసూయమ్మత్తకు ఈ సంగతి తెలిసి మమ్మల్ని ఆశీర్వదించింది......కానీ ఈ సంగతి మా నాన్నకు తెలిశాక తనకొచ్చే అప్రతిష్ఠను తన కుతంత్రాలతో మనిద్దరికి ముడివేసి కప్పుకొన్నాడు......"

"ఎంత ఘోరం?"

"నన్ను క్షమించు బావా? నాకు మృత్యువో మౌనం......"

శ్యామల చలపతి కాళ్ళను చుట్టుకుంది. బలవంతాన లేవదీశాడు. ఆమె కళ్ళల్లోకి చూచాడు..... దైన్యత, అసహాయత కదులుతున్నాయి.

* * *

హోరుగాలి ఎక్కువయ్యింది.

కిటికీ రెక్కలు తెగ కొట్టుకొంటున్నాయి.

ఊరకుక్కలు ఇంకా ఏడుస్తున్నాయి.

దీపం ఆరిపోయింది......దూరాన ఎక్కడో పిడుగు పడింది.



## గ్రహ స్థితి

మిథునంలో రాహువు, వృశ్చిక ధనుస్సులలో సూర్యుడు, ధనుస్సులో అంగారక బుధ కేతువులు, ధనుర్మకరాలలో శుక్రుడు, మకరంలో శని, మీనంలో గురువు, తులా వృశ్చిక, ధనుర్మకరాలలో చంద్రుడు.

**13-12-1963 శుక్రవారము మొదలు 19-12-1963 గురువారము వరకు.**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

కార్యభారం తగ్గుతుంది. వృత్తిలో సుఖము, సంతోషము లభిస్తవి. ధన విషయంలో చేతికి వచ్చినంతవరకు రాబట్టుకుని ముందుకు ప్రయత్నించటం మంచిది. భాగస్తులతో అభిప్రాయ భేదాలు వస్తవి. ఆహార విహారాలలో అసౌకర్యములు ఏర్పడుతవి. క్రొత్త వృత్తులు ఆరంభించటానికి అనుకూలమైన సమయం. కుటుంబంలో శుభ కార్యాలు జరుగుతవి. తెలియని మనుష్యులను నమ్మి పొరపాటు పడతారు. అత్యాశను కలిగించే సలహాలు చెప్పేవారుంటారు. జాగ్రత్తగా ఉండండి. మీ దినసరి కార్యక్రమాలు కుంటుపడకుండా జాగ్రత్తగా నడుపుకొన గలుగుతారు. 14, 15 తేదీలలో అలజడి, దుబారా ఖర్చు.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

మీ భారమే కాకుండా ప్రక్కనున్న వారి భారం కూడా పైన వేసుకొనవలసి ఉంటుంది. వ్యాపారం, వ్యవహారం అన్నీ సహజంగా జరుగుతూ, మధ్య మధ్య పేచీలు వస్తుంటవి. తలచిన పనులు వెంటనే కావు. ప్రతిష్ఠ పెరుగుతుంది. పనివారితో మృదువుగా ఉండటం అవసరం. దైవానుగ్రహంవల్ల ఏ విషయంలోను భంగం ఉండదు. వారం రెండవ భాగంలో తలవని తలంపుగా ధనం లభిస్తుంది. బంధు మిత్రులు మిమ్మలను విసిగించగలరు. అపవాదులు రాగల సూచన లున్నవి. ఒక ప్రక్క భయము, మరొకప్రక్క ఉత్సాహము కలుగుతూ ఉంటవి. అధికారులు మీకు అనుకూలంగా ఉంటారు. 13, 14 తేదీలలో శరీర శ్రమ, విరోధాలు.

* * *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

సూచనలు అన్నీ బాగానే ఉంటవి. అయితే అడుగు ముందుకు సాగటం కష్టం. మనస్సులో పట్టుదల పెరుగుతుంది. ఖర్చుపెట్టి పనులు జరుపుకొంటారు. పెద్ద మనుషుల మాటను త్రోసి




**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

వేయవలసి వస్తుంది. క్రొత్తవారి స్నేహం లభిస్తుంది. నూతన ఆదాయ మార్గాలు అనుకూలిస్తవి. పిల్లల మూలంగా సంతోషం లభిస్తుంది. వ్యవహారాలలో సందేహాలు కలుగుతున్నా, ధైర్యం చేసి ఒక నిర్ణయానికి వస్తారు. ప్రయాణం చేస్తారు. సహాయం చేస్తామన్నవారే ఒక సమయంలో మిమ్మలను నిరుత్సాహ పరుస్తారు. ఉత్తర దిశనుంచి శుభవార్తలు తెలుస్తవి. వృత్తి, వ్యాపారాలలో జరిగిపోయినవనుకొన్న పనులనే తిరిగి చేయవలసి వస్తుంది. సాధ్యమైనంతవరకు పొరపాట్లను ముందుగా సర్దుకొనటానికి ప్రయత్నించండి.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

ఈ సమయంలో అన్నీ చిల్లర సమస్యలు. వాటివల్ల ఒక కష్టము, నష్టము ఏమీ ఉండదు. మనశ్శాంతి తక్కువ. వృత్తిలో గౌరవం పెరుగుతుంది. ఆలోచనలు తెగవు. కార్యక్రమాలు ఆగవు. మీ సహాయం కోరి చుట్టుకొనేవారు ఉంటారు. బంధువుల రాక పోకలు, ఆదాయం బాగుంటుంది. ఆడంబరం బాగుంటుంది. "వంతుకు గంతు వేసిన" మాదిరి అనుసరించ తగిన సమయం కాదు. సంఘంలో మర్యాద, ఆదరణ లభిస్తవి. ప్రస్తుతం వ్యవహార విషయాలలో రాజీ మార్గంలో పోవటం అవసరం. మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకొనటం అవసరం. అప్పుడప్పుడు మీ ఆలోచనలు మారుతూ ఉంటవి. వారాంతంలో ఒక పద్ధతిలో మీ కార్యక్రమాలు జరుపుకొనటానికి అవకాశం లభిస్తుంది.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ప్రస్తుతం ఒక అడుగు వెనుక నున్నామనే భావం తోస్తుంది. అయితే ప్రశాంతత లభిస్తుంది. కార్యభారం తగ్గుతుంది. అనేక సందర్భాలలో మధ్యవర్తులమీద ఆధారపడవలసిన అవసరం తగ్గుతుంది. కుటుంబంలో సంతోషం, సుఖం లభిస్తుంది. వృత్తిలో తలచినది వెంటనే ఒక రూపానికి వస్తుంది. అధికారులతో మితముగాను, బెట్టుసరిగాను ఉండటం అవసరం. పోటీ వారిలో మీయొక్క విలువ పెరుగుతుంది. మీకు ఇష్టంలేని మనుష్యులతోనే

## ఈ వారము ధరలు

ధాన్యం ధర నిలకడగా ఉంటుంది. కందుల ధర తగ్గుతుంది. మిర్చి ధరలో తగ్గుదల సూచన లున్నవి. మాలు ధర పెరుగుతుంది. రంగులు, ధరలు అకస్మాత్తుగా పెరగ గలవు. వేరుశనగ పప్పు ధర మందీ వస్తుంది.

లావా దేవీలు జరుపవలసి రావచ్చు. చాలా కాలంగా యోచిస్తున్న వ్యవహారాలు ఈ సమయంలో దారికి, వస్తవి. పిల్లల ఆరోగ్యం బాగుండదు. విద్యా వినోద కార్యక్రమాలకు ఉత్సాహం తక్కువ. 17, 18 తేదీలలో విసుగుదల, ఫలితంలేని పనులు.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

మీరు శ్రమ పడవలసి ఉంటుందేకాని, ఒకరివల్ల మాట రాకుండా చూచుకో గలుగుతారు. ధర్మ కార్యాలు జరుగుతవి. ఆదాయం ముందుకన్నా బాగుంటుంది. స్వబుద్ధి, స్వశక్తి మీదనే ఆధారపడి ముందుకు పోగలుగుతారు. సాధ్యమైనంతవరకు ఇతరుల పనులలో కల్పించుకొనకుండా ఉండటం అవసరం. మీ క్రింది పనివారివల్ల పొరపాట్లు, చిన్న చిన్న నష్టాలు రాతగిన సమయం. బంధు మిత్రుల మాటలను విని విననట్లు పోవటం మంచిది. మీ వృత్తి ఉద్యోగాలలో ముందు ముందు జరుగబోవు మార్పుయొక్క సూచనలు ఈ సమయంలో తెలుస్తవి. ప్రయాణ సూచన లున్నవి. వారం రెండవ భాగంలో ఇతరులకు సహాయం చేయవలసి ఉంటుంది. ఆందోళన కరమైన వార్తలు తెలుస్తవి. సుఖం తక్కువ. 13, 14 తేదీలలో కార్యానుకూలత వృత్తిలో శ్రమ.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మనోధైర్యం బాగుంటుంది. మీ అధికారమును చక్కగా వినియోగించుకొన గలుగుతారు. అన్ని సందర్భాలలోను పదిమందిని సంతృప్తి పరచ గలుగుతారు. ఆదాయం సాధారణంగా ఉన్నా, హంగులలో లోపం కనుపించదు. శుభ కార్య ప్రయత్నాలు వాయిదా పడగల సమయం. స్వతంత్రం కలిగించుకొని మీ రహస్యాలను గ్రహించే వారుంటారు. వృత్తిలో అభివృద్ధితో కూడిన మార్పు కనుపిస్తుంది. విందులు, వినోదాలు మొదలయిన వాటిలో పాల్గొంటారు. కుటుంబంలోని వారి దేహ బాధలవల్ల తాత్కాలికంగా అశాంతి కలుగుతుంది. తొందరపడి శక్తికి మించిన పనులమీద ధనం వినియోగించ వద్దు. నిదానంగా ఉండటంవల్ల ముందు ముందు ఫలితం ఫలితం పొందగలుగుతారు. వస్తువులు పోయే అవకాశాలున్నవి.

* * *

**వృశ్చికం:**
**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

మీ ప్రయత్నాలకు ఉపయోగం పొందగల సమయం మనోదార్ఢ్యం అవసరం. మీ అంతరంగిక విషయాలను జాగ్రత్తగా కాపాడుకొన గలుగుతారు. స్నేహితుల సలహా మీకు బాగా ఉపయోగిస్తుంది. ప్రస్తుతం మీరు ఏ పని చేస్తున్నా మనస్సు మరె క్కడో యోచిస్తూ ఉంటుంది. ప్రయాణ సూచన లున్నవి. కుటుంబంలో మీరు శ్రమపడకుండా కార్య క్రమాలు సాగిపోయే అవకాశాలు ఏర్పడుతవి. వ్యవహార కార్యక్రమాల భారం తగ్గుతుంది. సంతోష వార్తలు తెలుస్తవి. అధికారుల ఆదరాభిమానాలు లభిస్తవి. జీర్ణకోశాలు మొదలయిన భాగాలలో బాధ తెలుస్తుంది. ఉష్ణాధిక్యత, శిరో బాధలు కనుపించ తగిన సమయం. సుబ్రహ్మణ్య పూజ, ఆదిత్య హృదయ పారాయణము చేసుకొనుటవల్ల ఆరోగ్యం కుదుట పడుతుంది.

**ధనుస్సు :**
**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

వద్దన్నకొద్దీ భారం పెరిగే సమయం. అక స్మాత్తుగా ఖర్చు ఏర్పడుతుంది. కక్షలు, పోటీలు మొదలయిన వాటిలో తగ్గి ఉండటం అవసరం. వ్యవహార విషయాలలో సమయంలో ఆలోచన తోచక పొరపాట్లు పడతారు. ఆదాయం తక్కువ. ఖర్చులు ఎక్కువ. వృత్తి వ్యాపారాలలో పదిమందికీ నచ్చచెప్పటంలో మీ బాధ్యత పెరుగుతుంది. ముందు తెలియకుండా చేసిన స్నేహం ఈ సమయంలో మిమ్మలను బాధిస్తుంది. కుటుంబంలో ప్రశాం తంగా ఉంటుంది. దక్షిణ, పశ్చిమ దిశలనుంచి లాభ వార్తలు తెలుస్తవి. ఆరంభించిన పనుల్లో అవసరమైన హంగులు లేకపోవటంవల్ల అసం తృప్తి కలుగుతుంది. అలసట పెరుగుతుంది. 14, 17 తేదీలలో కార్యభారము, అపవాద సూచనలు.

**మకరం :**
**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

సహాయం అందుకొనేవారేగాని ఆదుకొనేవారు తక్కువ. శ్రమ చేస్తేగాని ఒక్క పనీ పూర్తి కాదు. ఒక విధంగా భారం తగ్గిందని అనుకొన్నా, మరొక విధంగా పని పెరిగే సమయం. బంధు మిత్రులు తాము చేసుకొన్న పొరపాట్లను మీమీద రుద్దేవారు ఉంటారు. వృత్తిలో మీ ఆలోచనలు ముందుకు సాగటం కష్టం. ఆర్థికంగా కొంచెం ఇబ్బంది కనుపిస్తూ ఉంటుంది. విశేషంగా పెట్టు బడి పెట్టి సాగించవలసిన పనులు నిలచి, నిలచి సాగుతూ ఉంటవి. వ్యవహారాలు నిరాడంబరంగాను, రహస్యంగాను సాగించవలసి ఉంటుంది. ఇతరుల అర్థంలేని ప్రశ్నలకు సమాధానం చెప్పటంకన్నా తప్పుకొని ఉండటం మంచిది. 14. 15 తేదీ లలో శుభవార్తలు, స్వల్ప లాభం.

**కుంభం :**
**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ప్రస్తుతం ప్రయత్నాలు పెద్దవి. శ్రమ ధన వ్యయం అధికం. సుఖంగా ఉండటానికి వీలు కాదు. అయినా ఫలితం బాగా ఉంటుంది. ఇతరు లతో కలిసి వ్యవహరించటంతో కొన్ని [illegible], మిమ్మలను ఆశ్చర్య పరచగలవు. దైవికంగా మీ మేలుకు మార్గం ఏర్పడుతుంది. మీ కర్తవ్యము లను జాగ్రత్తగా నిర్వహించగలుగుతారు. ప్రసంగా లలో నిబ్బరం చూపటానికి ప్రయత్నించండి. ప్రయాణాలు చేస్తారు. తరచు క్రొత్త వారిని కలుసుకొంటు ఉంటారు. ఒక సమయంలో మన స్సును నిరుత్సాహ పరచగల వార్తలు తెలుస్తవి. ధర్మ కార్యాలు చేస్తారు. కుటుంబంలో అనా రోగ్యాలు కనుపించి నివర్తి అవుతవి. అధికారుల వల్ల మేలు కలుగుతుంది. 17, 18 తేదీలలో ధనలాభం, నిష్ఠుర వార్తలు.

**మీనం:**
**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

సమయంలో ధైర్యం చేయక తప్పదు. తోటి వారు కొంచెం నిరుత్సాహ పరచగలరు. అయినా మీ సంకల్పం నెరవేరుతుంది. వృత్తి వ్యాపారములలో మంచి సలహా, సహాయము లభిస్తవి. ఇంతకు ముందుకన్నా ధైర్యము, ఉత్సాహము లభిస్తవి. క్రమ క్రమంగా సాహసం చేయగలుగుతారు. కోర్టు కచేరీలలో మీ మాట గెలుస్తుంది. మీ వ్రాతలలో పొరపాట్లు రాతగిన సమయం. దుబారా ఖర్చులను తగ్గించుకొనటానికి ప్రయత్నించండి. దేహశ్రమ అధికం. బంధువులవల్ల సహాయము, మంచి పేరు లభిస్తవి. అపవాదులు ప్రచారం కాదగిన సమయం. ఇతరుల మాటలను నమ్మి స్నేహితులతో విరోధం కలిగించుకొనవద్దు. 18, 19 తేదీలలో బాధ్య తలు పెరుగుతవి. గౌరవలాభం. ★



**రామ చరిత మానస్**



**తులసీదాసు**

**తెలుగు**

**ముంగర శంకరరాజు**

# 9

## మంధర:

రేపు జరుగ నున్న శ్రీరాముని పట్టాభిషేక మహోత్సవము పురస్కరించుకొని సాకేతపురి అంద చందాలతో సంబర పడుట కన్నులారా జూచిన మంథరకు కడుపు మండెను. రాత్రి రాత్రికే ఈ ఉత్సవమును బుగ్గిపాలు చేయడ మెట్లా యని ఆలోచించి ఆ నీచురాలు ఆవేదన పడుచూ కైక వద్దకు వచ్చెను. కైకేయి దాసిని చూచి— "ఏమే మంథరా ! ఎందుకిట్లు ఉదాసీన ముగా నుంటివి !" అని నవ్వుతూ ప్రశ్నించెను. ఆ దాసి సమాధాన మియ్యక కన్నుల నిండా నీళ్ళు నింపుకొని కదలక నిలబడి యుండెను.

"ఓసీ వదరుబోతా ! నీ నోరు చెడ్డది కనుక లక్ష్మణుడేమయినా చెయ్యి చేసుకొనెనా !" అని భరతుని తల్లి మందహాసము చేయుచూ తిరిగీ ప్రశ్నించెను. అప్పటికీ ఆ కుటిల కాంత నోరు మెద పక కాల నాగినివలె కోపముతో — బుసకొట్టు చుండెను. దాని వాలకము చూచి ఏమి జరిగినదో యని కైక భీతిల్లి – "ఏమే ! రాజు మరియు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు క్షేమమే కదా !" యని ఆతురతో అడిగెను. ఈ ప్రశ్నకు గూని దాసి మంథర మరింత మండి పడి—

"అయ్యో తలవ్రాత ! ఎవరి బలము చూసు కొని నేను నోరు జారు కుంటాను రాణీగారూ ! ఎందుకు లక్ష్మణుడు నాపై చేయి చేసుకుంటాడు, ఇక్కడ రామచంద్రుడు మినహా మరెవ్వరికి క్షేమ మున్నది ! అదృష్టము కౌసల్యాదేవి సొత్తు, ఆమె కొడుకు రేపు యువరాజు కాబోవుచున్నాడు. ఆహా, అమె గర్వానికి హద్దూ, ఆమె ఆనందానికి అంతూ ఉన్నదా ! వారి ఉత్సాహము ఒకసారి వెళ్ళి చూడరాదా ! చూచుకొని నా కండ్లు చల్ల బడిపోయినవి. కొడుకు పరదేశమున నున్నాడనే రవంత చింత కూడ నీకు లేదాయె, నా భర్త నాచేతుల్లో ఉన్నాడను నీ ధీమాయే నీదిగాని, ఆయన గారి కపట నాటకం నీకు తెలిసి రాదాయె. ఇక నీకు తెలిసింది తృప్తిగా తినడం, సుష్టుగా నిద్రించడం. ఇంతే గదా !" అని మంథర కన్నీరు తుడుచు కొనుచూ పలికెను. దాసీ నీచపు మాటలకు కైక మండిపడినదై— "ఓసీ దాసీ ! ఇటువంటి కొంపలు కూల్చు మాటలు ఇక మీదట పలికిన నీ నాలుక కోసి వేసెద"—నని కోపగించెను. గూనివారు, కుంటివారు సాధారణముగ కుటిల స్వభావులై యుందురని ఊహించి, కైక కొంచెము ఊరడింపు మాటల నిట్లనెను—

"మంథరా ! నీకు ఏదో కొన్ని మంచి మాటలు చెప్ప దలంచి అట్లంటిని. అంతే కానీ, నీపై నాకు స్వప్న మందైనా కోపము రాదు. నీ వన్నట్లు రేపే శ్రీరామునికి పట్టము గట్టిన అది యెంత శుభ దినము. ఇదే నిజమయిన నీ వడిగినంత బహుమాన మియ్య గలను. రాముడు పెద్ద బిడ్డ. భరత, లక్ష్మణులు అతని కంటే చిన్నవారు. పెద్ద వానికి పట్టము గట్టుట రఘుకుల సాంప్ర దాయమే కదా ! శ్రీరామునికి తల్లులందరూ సమానులు, నా మీద అతనికి విశేషించి ప్రేమ కలదు. ప్రియ పుత్రుడైన శ్రీరామునికి పట్టము గట్టబోవు సంతోష సమయమున నీవెందుకు క్లేశపడు చుంటివి. భరతునిపై ఒట్టు పెట్టు కొని నిజము చెప్పు"మని అనునయమున బలికెను.

"అమ్మా! దొరసాని గారూ ! నాకున్నది ఒక నాలుక, అది నోరుజారి నిజమాడినందుకు బాగా వడ్డించితివి, ఇక మరొక రీతిగ మాట్లాడుటకు నాకు రెండు నాలుకలు లేవే ! మంచి మాట చెబితే నీకు రుచించదయ్యె !

"నా తల బ్రద్దలు చేస్తానంటివి. అవును లోకములో నిజమాడితే నిష్ఠూరమందురు. ఉన్నది లేనిదిగా, లేనిది ఉన్నదిగా కల్పించి చెప్పువారే నీకు మంచి వారు. ఆ దేవుడు నన్ను గూని దానిగా పుట్టించి నందుకు ఒకరిని ఆశ్రయించి బ్రతక వలసి వచ్చె, పూర్వ కర్మ. కర్మ అనుభవించక తప్పదు గదా ! లేక పోయిన ఎవరు రాజు అయితే నాకేమి? నేనే మయినా రాణీ పీఠ మెక్కగలనా ! నా దాసీ వృత్తి నాకు తప్పదు గదా ! నీకు అపచారము జరుగుచుండుట చూచి ఒకటి రెండు మాట్లాడి పెద్ద తప్పు చేసితిని. తల్లీ! జరిగిన పొర పాటుకు నన్ను క్షమించుము." అని పరిచారిక కుహనా దుఃఖము ప్రకటించి వాపోయెను.

కుటిల బుద్ధిచే పలికిన మంధర గూఢో క్తులు పయోముఖ విషకుంభమువలె వినుటకు ఇంపుగా నుండెను.

దాసీ కాపట్యాన్ని దైవ మాయచే గమనించ జాలక కైక దాని విష హృదయాన్ని విశ్వసించెను. వేటకత్తె పాటకు పరవశమై వెంటబడి వచ్చు జింకపిల్ల వలె భరతుని తల్లి మంధర మాటలకు మరింత మెత్తబడి దానిని ప్రాధేయపడసాగెను. తన పావిక పారినందుకు కుబ్జదాసి లోలోన సంతసించి

"అమ్మగారూ ! మొదటనే నీవు నన్ను కొంపలు కూల్చే దానివని నిందించితివి. ఇక నీ ముందర నోరు కదల్చ డానికే నాకు భయముగా నుంది. ఓ నారాణీ ! సీతారాములు నీకు ప్రేమ పాత్రులంటివి. నేను కాదనను. వారూ నిన్ను ఆశ్నే చూచు చుండిరి, కానీ అది ఒకప్పటి మాట. ఆ దినములు గతించెను. సూర్యునికీ కమలములకూ ఉన్న సంబంధము వలె కాలము మారి నప్పుడు మిత్రులు గూడ శత్రులగు చుందురు. వెర్రిదానా ! నీ సవతి కౌసల్య నిన్ను కూకటి వ్రేళ్లతో కదలించి కూల ద్రోయుటకు కోక బిగించినది. నా మాట నమ్మ ఇప్పుడే జాగ్రత్త పడకున్న ముప్పు ముంచుక రానున్నది సుమా"

ఆ మాయావిని మంధర మరెన్నియో లేని పోని మాటలు కల్పించి చెప్పి సవతి మాత్సర్య మును కైకలో ప్రకోపింప జేసెను. రాణి తన మంచి గోరిన మంథరను తూలనాడి నందుకు నొచ్చుకొని నానా విధముల దాని ననునయించెను. పరిచారిక తిరిగి ఇట్లు ప్రసంగించెను.

"అయ్యో వెర్రిబాగులదానా ? నోరులేని జంతువు కూడ తన మంచి చెడ్డలేవో తెలుసు కొన గలదే ! అంత మాత్రమైన జ్ఞానము నీకు లేదా ! పక్షము దినముల నుండీ పట్టాభిషేకము నకు సన్నాహములు జరుగు చున్ననూ, ఇప్పుడు నేవచ్చి చెప్పినంత వరకూ నీకు తెలిసి చావదాయె. (రాజు కైకకు చెప్పక దాచినాడను భావము) మీ ఉప్పూ పులుసు తింటున్నందుక నిజమాడడం నా ధర్మం. నేను అసత్య మాడితే దండించడానికి పైన దేవుడు లేడూ ? రేపు కౌసల్య కొడుక్కే

పట్టము గట్టినట్లైన ఆ నాటి నుండీ నీకు చెడ్డరోజులు ప్రారంభ మైనట్లే భావించుము. ఓ దొరసాని ! ఇదిగో గీత గీసి చెబుతున్నాను ఈ ఇంటిలో ఇక నీకు చోటు లేదు. నీవూ నీ కొడుకూ వారికి సేవకా వృత్తులు చేసినంత వరకే మీకిక్కడ మనుగడ. లేకుండిన పాలల్లో పడిన ఈగ వలె బయటికి గెంటివేయ బడుదురు. కద్రువ వినతను సాధించినట్లు కౌసల్య నీపై కక్ష సాధించకపోదు. కైక కొడుకు కారాగృహములో బడుట, సుమిత్ర పుత్రుడు రామునికి రెండవ సుమంత్రుడగుట ముమ్మాటికీ నిజము— 'మొగుడు నా మాట జవదాటడనీ నా ముత్తైదువ తనము గట్టి' దను ధీమాతో కండ్లు మూసుకొని యున్నావు. కానీ మహీపతి మాటలు మంచివి— చేతలు చెడ్డవి. అని నీ భోళా బుద్ధికి తెలిసిరాదు.

కౌసల్య ఎంత చక్కని చమత్కారి ! సమయము చూచి తన పని సాధించుకున్నది. రాజుగారు నీపై మక్కువతో నుండుటచే వారి అండ జూచుకొని ఆమెను తృణీకరించెదననీ, నీ సవతి స్వభావము— సహించలేక పోయినది. ఆ ద్వేషముతో అయ్యగారిని చిన్నగ లోబరచుకొని భరతుని పర దేశమునకు పంపించి, తన కొడుక్కు పట్టము గట్టుకొనుచున్నది. సూర్యకుల సాంప్రదాయ ప్రకారం పెద్ద కొడుకైన రామ రాజుకు పట్టము గట్టుట అందరివలె నాకునూ ఇష్టమే. అయితే ముమ్ముందు రాబోవు విపత్తు నూహించుకొని నా గుండె కొట్టుకొనుచున్నది.

ఓరీ భగవంతుడా ? మా తల్లికి అపకారము తలపెట్టినవాడే ఆ ఫల మనుభవించునట్లు చేయుము—"

మంథర యొక్క మాయ మాటలకు భీతిల్లిన కైకకు ముచ్చెమటలు పోసి శరీరము కంపించి పోయెను.

విధి వైపరీత్యము ! గూని దాని కుతంత్రములు రాణి హృదయమున గాఢముగా నాటుకొనెను. ఆపద్భీతిచే, ఆ శంకిత యైన కైక కంపిత స్వరమున ఇట్లనెను.

"మంథరా, నీ మాట నిజము ఈలోగా నాకు కుడికన్ను అదురుట, రాత్రులందు పీడకలలు వచ్చుట మున్నగు దుశ్శకునములు తోచు చున్నవి. ఓ ఆత్మీయురాలా ! నా స్వభావ మెంత యెంత సరళ మైనదీ నీకు తెలియనిది గాదు. కుడి యెడమ లేవో తెలియని ఒట్టి అమాయకురాలిని. భగవంతుడా ! నే నెన్నడూ ఎవరికీ ఏలాంటి కీడు తలపెట్టి యెరుగనే. నన్నెందుకింత కష్టములకు గురి చేసితివి ! మంథరా ! పగవాని పంచ పడి యుండుట కంటే ప్రాణములు వదులుట మేలు. ఇదిగో, నా బొందిలో ఊపిరి ఉన్నంత వరకూ సవితికి లోబడియుండుట మాత్రము కల్ల అని నమ్ముము."

ఆసన్న భీతిచే ఆర్తయై చలించి పోయిన రాణికి మంథర మరింత పురి యెక్కించెను.

"అమ్మా మనస్సు చిన్న చేసుకొని మథన పడుట వలన లాభములేదు. నీ మాంగళ్యము నిత్య మంగళమై వర్థిల్లుగాక ! ! ఈ దుర్వార్త విన్నప్పటి నుండీ నా కంటికి మాత్రము నిదుర పట్టిన దనుకొంటివా ! నేను చేతులు ముడుచుకొని మూల కూర్చొనలేదు. జ్యోతిష్కుల వద్దకు వెళ్లి అడిగితిని. వారు గ్రహించి భరతునకు ఖండిత ముగా రాజ్యము రాగలదని చెప్పిరి అదిగాక సాధుడు సీవాడు నీ చల్లని చూపులకై దోసిలొగ్గువాడు. ఇదిగో నే జెప్పినట్లు నడుచు కొనిన నీ కష్టముల నుండి గట్టెక్కగలవు. . . ."

అంతట కైక—

"ఓ సఖీ ! నీవు హితవు గోరిన ఆత్మీయురాలవు నీవు చెప్పినట్లు నడచుకొనుటకు నేను సిద్ధము. తుదకు పతీ పుత్రులను సైతం పరిత్యజించి, బావిలో దూకుటకైననూ వెనుకాడను" అని ఆమె కృత నిశ్చయముతో పలికెను.

ఆ గూనిదాసి— కైకను బలి పశువుగా చేసి, కపట మనెడి కత్తిని తన పాషాణ హృదయముపై సానబెట్టెను. సంభవింప నున్న చావు సంగతి గుర్తించలేక పచ్చగడ్డికై ప్రాకులాడు బలి పశువు మాదిరి, ఆమె మంథర కుతంత్రమునకు పూర్తిగా లోబడెను.

"అమ్మా ! కైకేయీ ! నీకు జ్ఞాపక మున్నదో లేదో ? 'రాజు నాకు రెండు వరము లిచ్చియుండె' ననియూ, అవసర మొచ్చినపుడు వాటిని వాడుకొనుటకు రాజు అనుమతించి యుండెననియూ ఒకప్పుడు నాతో ప్రసంగించి యుంటివి కదా ! ఇప్పుడు నీవు భరతునికి పట్టము గట్టుటకు, రాముని పధ్నాలుగేండ్లు అరణ్యములకు బంపుటకుగాను ఆ రెండు వరములు రాజు నుండీ కోరుకొనుము. ఇందువలన నీ కోరిక సిద్ధించి నీ సవతుల సంతోషము నీ పాలు కాగలదు. కానీ, ఒక్క విషయము మాత్రము జ్ఞాపక ముంచుకొనుము. అది యేమన మహారాజు మాట దప్పనివాడు. అందుచే రాముని మీద ఒట్టు పెట్టుకొనిన గానీ, ముందుగా నీవా వరములు అడుగ రాదు. ఇదిగో జాగ్రత్త ! ఈ రాత్రికే ఈ పని సాధింప వలసి యున్నది. లెమ్ము ! వెంటనే కోప గృహమునకు వెళ్లి మెలకువతో పని సాధింపుము, త్వర పడుము."

అని అనేక విధముల బోధించి, ఘాతకురాలు మంథర కైకను పురికొల్పెను.

రాణి మంథరను బహు విధముల ప్రశంసించి, ఆపత్సముద్రము నుండి రక్షించిన మహోపకారి



యుని దాసికి కృతజ్ఞతలు తెలిపి, కోప గృహము నకు చనెను.

కైకకు కలిగిన దుర్బుద్ధి ఒక క్షేత్ర మాయెను. దానిలో విపత్తు బీజములు నాట బడెను, అవి దాసి వచన ధారలచే తడిసి మొల కెత్తెను. ఆ మొలక వరములనెడి రెండాకులు వేసెను. ఆ విష వృక్షము ఫలించు దుఃఖ ఫలము అవశ్యము అనుభవింప వలసి యుండెను.

ఇక్కడ అంతఃపురములో రగులు కొనుచున్న అగ్ని సంగతి అయోధ్యా వాసులకేమి తెలుసు. అబాలగోపాలము ఆనందోత్సాహమున మునిగితేలు చుండెను. రాజ దుర్బారు వచ్చేపోయే వారితో సందడిగా నుండెను. బాల్య స్నేహితులు జట్లు జట్లుగా వచ్చి శ్రీరామునికి తమ అభినందనలు తెలియ జేయుచుండిరి. నానా విధ మంగళ వాద్యములు మ్రోగుచుండ కోసల రాజధాని ఉత్సవోత్సాహములతో కోలాహలముగా నుండెను.

సాయంకాల మయ్యెను. శరీరము ధరించిన స్నేహము నిష్కారము వద్దకు వచ్చుచున్నదా యన్నట్లు ధశరథుడు సంతోషముతో కైక గృహమునకు వచ్చెను.

## కైక వరము లడుగుట

కైక కోపగృహములో నున్నదని తెలుసుకొని రాజు నిర్ఘాంత పడెను. ఎవని బాహుబలము చూచుకొని దేవేంద్రాదులు భద్రముగ నుండిరో, ఎవని చల్లని చూపులకై సకల దేశాధీశులు తపస్సు చేయు చుందురో ఆ దశరథరాజు కామా ధీనుడై, కైక కోపమునకు గడగడలాడెను. అతి భయంకర శస్త్రా ఘాతములను సరకు చేయుని మహీపతి మదనుని బాధ సహించలేక, భయ పడుచూ భార్యను సమీపించెను.

రాబోవు వైధవ్యమును ఇప్పుడే సూచించు చున్నదా యన్నట్లు, భూషణములు విసర్జించి, మలిన వస్త్రధారియై కటికనేల బడియున్న ప్రియ కాంతను సమీపించి రాజు మధుర వచన ముల "ఓ ప్రాణప్రియా! నీ అలుకకు కారణ మేమని అడుగుతూ ఆమె రెండు చేతులను పట్టు కొనెను.

అప్పుడామె రాజు చేతులను విదలించివేసి వాగు బాముపలె నరపాలుని చురచుర చూచెను.

కైక కాలసర్పము, ఆమె రెండు వరములు రెండు నాలుకలు, ముఖము విష పూరితము, 'రాముని మీద ఒట్టు' అను ఆయువు పట్టు మీద పొంచి కాటు వేయ సంకించు చున్నట్లగు పడుచుండెను. మదన పీడితుడగు మహీపతి ప్రియురాలిని బుజ్జగించి ప్రేమతో నిట్లనెను.

"ఓ సుముఖీ ! నీ కోపమునకు కారణమేమి ! కాలునికి కవళము కాదలంచి నీ కపచారము తల పెట్టిన ఆ ద్విముఖు డెవ్వడో తెలియ జేయుము. వాడు అమరుడైననూ నిముసములో నిర్జించి వైచెద.

ఓ ప్రియ పత్నీ ! నీవు కోరిన నెల్ల నే భూపతిని భిక్షుకునిగా, భిక్షుకుని భూపతినిగా తృటి కాలములో చేయగలను. ప్రియా, రాముని సాక్షిగా నీ యెడల నాకెట్టింటి కాపట్యమూ లేదు. సులోచనీ, చంద్రునికై

# రామచరితమానస్

పరితపించు చకోరము వలె సుందరమైన నీ వద నేందు బింబమునకై పలపించు నా చిత్తశుద్ధి నీకు తెలియనిదా ! ప్రేయసీ, నా సతులు, సుతులు, సామ్రాజ్యము సర్వమూ నీ యధీ నమై యున్నది. లెమ్ము, ఏదీ నీ దరహాస చంద్రి కలను ఒక్కమారు నాపై ప్రసరింప జేసి నీ యభీష్ట మేదియో తెలియ జేయుము."

పృధ్వీపతి చేసిన ప్రమాణమునకు సంత సించినదై కైక చిరునవ్వు చిందించుచూ చిన్నగ పైకి లేచెను. వలబన్ను వేటకత్తెవలె కైక వయ్యారముగ వివిధ భూషణములతో తనను శృగారించుకొనసాగెను.

చిన్న భార్య చిరునగవు చూచి రాజు చిత్తము స్థిమిత పడెను. ప్రేమాతురుడైన రాజు ప్రియ వచనముల నిట్లనెను—

"ఓ సులోచనీ, నీ యభీష్ట మీడేరునట్లు రేపే పెద్దవానికి పట్టము గట్టుచున్నాను. ఏది నీవు చక్కగ అలంకరించుకొని ఆయుత్సవము నకై అభిషేక సంభారములు సిద్ధము

---

ఇకనామిక్స్ ప్రొఫెసర్ : పరోక్షపు పన్నుకు ఉదాహరణ ఒకటి చెప్పండిరా.

విద్యార్థి: కుక్కలమీద పన్ను.

ప్రొఫెసర్ : అంటే?

విద్యార్థి: కుక్కలు పన్ను కట్టాల్సిన అవసరం లేదండి, వాటి బదులు ఇంకోళ్లు కడతారు గదా!

అహల్యాబాయి (అమీర్‌పేట)

---

చేయుము" నృపతి నోట నుండి వెలువడిన పలు కులు చెవిని బడగనే రాణికి హృదయము పెళ్లున పగిలినంత పని ఆయెను. కాని చోరుని భార్య ఎవ్విధ ముగ తన దుఃఖమును ఇతరుల ఎదుట బహిర్గ తము చేయదో అట్లు కైక తన బాధను గోప్య పరచి పైకి మాత్రము చిన్నగ నవ్వెను. రాజు ఎంత చతురుడైనప్పటికీ మగువల మర్మము కనుగొన జాలడు కదా !

ఆధూర్తురాలు కృత్రిమ ప్రేమ ప్రకటించుచూ, ముసిముసి నవ్వుల నిట్లనెను—

"నాథా ! అడుగు మడుగు మనుటయే కానీ ఇచ్చినది మాత్రము పూజ్యము—

ఒకప్పుడు నాకు మీరు రెండు వరములు ఇచ్చి యుంటిరి. ఇపుడు వానిని కూడ పొందగలనో లేదో యను సందేహము కలుగు చున్నది."

అందుకు అవధీశుడు మెమ్మదిగ, నింపాదిగ నవ్వి ఇట్లనెను—

"ఓహో ! అదియా సంగతి ! ఇప్పటికి నీ రహ స్యము నాకు తెలిసినది. నీకు ప్రణయ కలహ మందాశక్తి యెక్కువ. రాణీ! నేను నీకు వరము లిచ్చి యుండినది నిజమే ! కానీ నీ వెప్పుడు కోరితివి ! నే నెప్పుడు కాదంటిని ! పరాకుచే ఆ ప్రసంగమే మరచి యుంటిని. ఇంత మాత్ర మున నిర్హేతుకముగా నాపై దోషమెందుల కారో పించెదవు ? నీవు రెంటికి బదులు నాలుగు వరములు కోరిన నే కాదన గలనా ! 'ప్రాణము పోయిననూ మాటదప్పని మానధనులు మా రఘుకులస్థు'లన్న నీతి లోకవిదితమే గదా! సకల సుకృతములకు ఫలితమైన నా రఘురామునిమీద ప్రమాణము చేసి యుంటినే!"

ప్రమాణ పూర్వకముగ పలికిన రాజు మాట లకు రాణి ప్రసన్నురాలై, మధురముగ మంద హాసము చేయుచూ తన వరములను రాజు నెదుట ఇట్లు వెల్లడించెను.

"ఓ ప్రాణ ప్రియుడా ! నా మనస్సుకు నచ్చిన మొదటి వరము భరతునకు రాజ్యాభిషేకము చేయుట, నాథా ! చేతులు మోడ్చి కోరు చున్న రెండవ వర మేమనగా శ్రీరాముడు తాపస వేషమున (నిస్సంగుడై అనాసక్తుడై) పదు నాలుగేండ్లు వనవాసము చేయుట."

కిరాతుడు వేట నిమిత్తమై మచ్చిక చేసి పెంచిన డేగను ముసుగు తీసి పిట్టలపైకి వదలి నట్లు కైక వరములను వెల్లడించెను. మహీ పతి మనోరథ వాటిక యందు విహరించు సుఖ విహంగముల గుంపుపైకి భిల్లాంగన వలె కైక తన వరములను డేగలను వదలిపెట్టెను.

పిడుగు పడిన తాటిచెట్టు వలె రాజు ముఖము కళహీన మయ్యెను. డేగను చూచిన పిట్ట చంద మున అతని శరీరము కుంచించుక పోయి గడగడ కంపించెను. కోసలపతి కండ్లు మూసుకొని రెండు చేతులతో తల బట్టుకొని— అయ్యో నా మనో రథము కల్ప వృక్షము వలె ఫలించబోవుచున్న సమయమున మత్తగజ మట్లు కైకదానిని పెక లించి వేసెనే. ఓరీ భగవంతుడా ! సాకేతపురి సర్వ ధ్వంస మగుటకు కైక కారణమగుచున్నదా! ఆడుదానిపై నమ్మకము నన్నెంత అధోగతికి దెచ్చె! అని అవధీశుడు లోలోన ఆక్రందించెను. ఇట్లు ఆక్రోశించుచున్న రాజును జూచి కైక క్రోధము ముతో ఇట్లు గద్దించి పలికెను—

"రాజా భరతుడు నీ పుత్రుడు కాదా ? నీవ నన్ను సంతలో వెలకు కొనలేదే ! పాపము నా మాటలు నీకు ములుకులవలె బాధాకరము మన్నవి కాబోలు మరి మీబోంటి విజ్ఞులు ముందు వెనుక లాలోచించి కదా మాట ఇచ్చి యుండవల సది ? మహారాజా, మీ రఘు కులజులు మాట దప్పని మానధనులని వాక్రుచ్చితిరే, మరి ఇప్పుడు ఊరకుంటిరేమి ? నా ప్రశ్నకు 'అవునా— కాదు' అను రెండు మాటలలో సమాధాన మిచ్చిన చాలు. "నేను సత్య సంధుడను, కావలసిన వరము కోరుకొను"మని చెప్పితిరే ! బహుశా ఈ పిచ్చిది యేదో తినుటకు బెల్లము అడుగునని యూహించి తిరి కాబోలు శిబి — దధీచి — బలి ప్రము ఖులు తమ ధనమాన ప్రాణములను సైతం ధారబోసి మాటల నిలబెట్టుకొని యుండిరన్న సంగతి మీకు తెలియదా! కీర్తి వలతువో, అప కీర్తి వరిచెదవో ఆలోచించుకొనుము."

కైక కటోక్తులు రాజుకు పుండు మీద కారము చల్లినట్లుండెను. దుఃఖముచే కృంగి పోవుచున్న ధరణీశుడు కన్నులు తెరచి చూచెను.

కత్తి "బట్టి నిలబడియున్న కాళి వలె కైక కన్పించెను. 'అయ్యో నా ఆయువు పట్టున దెబ్బ దీసిన ఈ యాడుది తప్పక నా ప్రాణములను బలిగొని తీరును !" అని విలపించి నిట్టూర్చెను. పిమ్మట రాజు రవంత ధైర్య మవలంబించి, ఆమె మనస్సు కరుగునట్లు నయ వినయోక్తుల నిట్లనెను—

"ప్రియా ! ప్రేమ— భయము— విశ్వాసము లను— ఒక్క పెట్టున ఆవలకు నెట్టి, ఇట్టి కటు వచనము లాడ ఉచితమేనా ! ఆ శంకరుని సాక్షిగా శ్రీరాముడు, భరతుడు ఇరువురు నాకు రెండు నేత్రముల వలె సమానులు సుమా ! ఇదిగో రేపే దూతను బంపి భరత శత్రుఘ్ను లను రానించి, ఒక శుభ లగ్నమున భరతుని తప్పక యువరాజు చేసెదను. కైకేయీ ! నిజము చెప్పు చున్నాను. రామునికి రాజ్య కాంక్ష లేదు. భరతు డన్న అతనికి ప్రాణములతో సమానము. అతని తల్లి కౌసల్య నాతో ఏమియూ చెప్పి యుండ లేదు. నేనే చిన్నా, పెద్దా భావముతో రాజనీతి ననుసరించి, పట్టము గట్ట నిశ్చయించితిని. నీతో సంప్రదించక చేసినందుకు నా మనోరథము లన్నియూ మట్టిలో గలిసిపోయె. ఇకనైననూ కోపము వీడి మంగళ సామాగ్రులు సిద్ధ పర చుము. భరతునకు తప్పక పట్టము గట్టెదను."

"ప్రియా ! నీవు కోరిన రెండవ వరము చాల అసమంజసముగా నున్నది. నీవు కోపము చేతనో పరిహాసమునకో లేక నిజముగనే ఆ వరము వాంఛించితివో !యేమో యెరుగ లేకున్నాము. ఇప్పటికీ దాని సెగకు నా గుండె మండు చున్నది. నీకు, నాకు, లోకమునకు సైతం రాముడు సన్మిత్రుడు కదా ! నిన్నటి వరకూ నీచే ప్రాణాధికముగ ప్రేమించ బడుచున్న రామ చంద్రుడు తల్లికి ప్రతికూలముగ ప్రవర్తించి యుండునని నేను నమ్మలేకున్నాను. శాంతించిన హృదయముతో అతడు చేసిన అపరాధ మేమిటో ఆలోచించి చెప్పరాదా ?"

"ఓ పత్ని ! నిష్కపటముగ నే చెప్పున దేమన నీరులేకనే చేప జీవించినమా, మణి లేకనే పన్నగము బ్రతక గలిగియుండిననూ నేను మాత్రము రాముడు లేనిదే జీవించి యుండ జాలని మాట నిక్కము; కాబట్టి రాణీ ! నేను భరతుని పట్టము కన్నులారా తిలకించి ఆనందించుటకై, ఈ రెండవ వరమునకు ప్రత్యామ్నాయకముగ బుద్ధిమంతురాలవైన మరొక వరము కోరుకొనుము."

ఇట్లు అతి దీనుడై అర్థించిన భర్త పలుకులకు ఆజ్యము పడిన అగ్నివలె భార్య హృదయము భగ్గుమనెను.

"ఓ నరపతీ ! నీ నానావిధ నటనోపాయములు నాపై ఫలించవు. నీవు నీ రాముడు, అతని తల్లి ఎంతటి అమాయకులో లోకమునకే తెలుసు నీవు పని గట్టుకొని ఘోషించ పనిలేదు. ఆ కౌసల్య నా కెంత ఉపకారము తల పెట్టెనో నే నామెకు అంత రెండింతలు చేయ దలచితిని, ఈ నిరర్థక ప్రసంగముతో వృథా కాలయాపన చేయక 'అవును— కాదు' అని ఒక్క మాటలో తెగ చెప్పి వేయుము. నృపతీ, రేపు ప్రాతఃకాలమునకు రాముడు ముని వేషమున వనములకే పోని యెడల నేను మరణించుట, నీ కపకీర్తి ఘటిల్లుట నిక్కమని నిర్ణయించు కొనుము."

ఇట్లు ఖండితముగ చెప్పివైచి ఆమె ఆగ్రహముతో దిగ్గున పైకి లేచెను. ఆమె క్రోధమునకు క్రొత్త వెల్లువ వచ్చినట్లుండెను. ఆ కుటిల జలధార పాపి కొండలపై ప్రభవించి, వరతీర ద్వయమును ఒరుసుకొనుచు తీరస్థ వృక్షరాజములను సమూలముగ ఛేదించి, వివదాంబుధి వైపు వేగవతియై ప్రవహించెను.

రాజు సాలోచనా దీన దృష్టుల కైక నొకింత పరికించి చూచి, ఓహో ! ఈ మగువ రూపమున నిక్కముగ మృత్యువు నన్ను సమీపించినదని

# రామచరిత మానస్

నిశ్చయించిన వాడై, ఆమె పాద ద్వయము పట్టుకొని కూర్చుండబెట్టి— "ఓ తల్లీ ! నా తల నైనా తీసుకొని పుత్ర భిక్ష పెట్టుము. కానీ పుత్ర వియోగాగ్నికి నన్ను ఎరజేసి వధించ వద్దు. కైకా ! రఘుకులమును రక్షించుము, రక్షించు"మని పాధేయపడి ప్రార్థించెను.

కైక మనసు కించిత్తైనను చలించక కాఠిన్యత వహించెను.

ఇక ఈ కపటరోగమునకు తిరుగు లేదని గ్రహించిన దశరథుడు దుఃఖాక్రాంతుడై తల కొట్టుకొనుచూ 'రామా' 'హారామా' యని మొర పిల్లుచూ నేలకూలెను.

సాకేతపతి సకలేంద్రియములు శిథిలమయ్యెను. నీటిలోని చేప నేల బడినట్లు, రాజుకు నోట మాట రాక నాలుక తడియాడెను. వ్రణముపై విషము చల్లు విధమున తిరిగి కైక రాజుపైకి వాగ్బాణములు విసరెను.

"మహారాజా ! తుదకిట్లు వట్టి చేతులు చూపించటానికేనా వరములు కోరుమని నాతో పలుమార్లు పల్కినది ? నవ్వుట— బుగ్గలు పూరించుట ఏకకాలమున సాధింపబడదని తెలియదా ? దాతృత్వమునకు కృపణత్వమునకు సమన్వయ మసాధ్యముకదా ! రాజ ధర్మమన ఇట్టి మాటలను కొందురా ? సత్య సంధులకు తమ ధన ప్రాణములు తృణ ప్రాయములు, ఆడు దానివలె ఆక్రందించుటమాని ధైర్య మవలంభించి తగు సమాధాన మిమ్ము"

ప్రియపత్ని దుస్సహ వచనా ఘాతములకు రేడు ఇట్లు రోదించెను.

"రాణీ ! భరత పుత్రునికి రాజ్య వాంఛ ఈషన్మాత్రము లేదు, ఇంతకూ నన్ను వేదించి లాభమేమి ! నా ప్రారబ్ధము విన్నట్లాడించు చున్నది. కైకా ఒక్క సంగతి మాత్రము గుర్తించుకొనుము. ఏ నాటికైనా నా శ్రీరాముడు రాజ్యాభిషిక్తుడు కాగలడు. అతని— పాలనలో అన్నదమ్ములూ అయోధ్య తిరిగి కళకళలాడుట తథ్యము కానీ నీ కళంకము, నా పరితాపము ఇవి రెండునూ ఆ దివాకర సుధాకరులున్నంత వరకు శాశ్వతముగ నిలిచి పోవుట నిజము. అభాగ్యురాలా ! ఇక నా కండ్లముందరుండక తొలగి పొమ్ము ! దేనికు ఆహార మిడుటకై ఆవును చంపితివే యని ఒక నాటికైనా నీకు పశ్చాత్తాపము కలుగకపోదు."

కాలుచున్న కాష్ఠమువలె కైక రోష గంభీరముగ నిలబడి యుండెను. "రేపు సూర్యుడుదయించ కుండిన, ఈ సంగతి శ్రీరామునికి తెలియకుండిన, ఎంత బాగుండును." అని ఆలోచించుచూ రామ ! హారామా ! ! యని పలవరించుచూ రాజు నేలపై బడి రాత్రంతయూ వ్యసన వ్యాకులితుడై రోదించు చుండెను.

(సశేషం)

వెంట మనిషికో మాట చెప్పాలి......" అంటూ తుర్రున మాయమై పోయాడు.

కాఫీ బాగుంది. నింపాదిగా సేవించాను. శ్రీహరి కప్పులో కాఫీ ద్రవపు మట్టం ఒకటి రెండు సెంటి మీటర్లకంటే తగ్గినట్టు లేదు. కప్పు నలాగే వళ్ళెం లోవుంచి అతడు పరధ్యానంగా పైకప్పు వంక చూస్తున్నాడు.

"కాఫీ చల్లారి పోతోంది శ్రీహరీ!" అన్నాను.

పోనీ లెమ్మనట్టు పెదవి విరిచి నాలుక చప్పరించి చిత్రమైన హావ భావాన్ని ప్రదర్శించాడు శ్రీహరి.

"అంటే?" అతడి ఉద్దేశం అర్థమైంది గాదు.

"వచ్చిన వాళ్ళకు కాఫీ ఇవ్వడం మర్యాద. వద్దనకుండా పుచ్చుకుంటే చాలు. అంతా త్రాగేయాలన్న నిర్బంధ మేముంది?"

"నిర్బంధం లేకపోవచ్చు. కానీ ఇంత దూరం అలసి సొలసి వచ్చాంగదా శ్రీహరి! సేద దీరడానికి ద్రవాహారంలాంటి దేదైనా పుచ్చుకోవలసిన అవసరమైనా లేదంటావా?"

"అబ్బె, ఇదేం కాఫీ లేవయ్యా శేఖరం! త్రాగితే హొటలు భవానీలోనే తాగాలి కాఫీ!"

హొటలు భవాని! ఎక్కడుందది? అజ్ఞానాన్ని ప్రదర్శించడ మెందుకని ప్రశ్నించడం మాను కున్నాను.

కాఫీ దగ్గర మాత్రమేగాదు. భోజనాల దగ్గర గూడా విచిత్రంగానే ప్రవర్తించాడు శ్రీహరి! హోమధూమంతో దేవతల ఆకలి తీరిపోయి నట్టు, భోజనం వైపు చూడడంతో శ్రీహరికి ఆకలి ఉపశమిస్తున్న దేమోనని అనుకోవలసి వచ్చింది. లేదంటే ఆకులో వడ్డించిన అన్నాన్ని అటూ, ఇటూ కెలికి అతడు తిన్న శాస్త్రం ముగిస్తాడు. ఎంత కావాలో అంతే పెట్టించుకోడం, పెట్టించుకున్నదంతా వదిలి పెట్టకుండా తినేయడం, భోజన విషయికమైన మంచి అలవాట్లలో ఒకటి పొదుపును గురించి ఇంతగా పట్టింపులు లేని పాతకాలపు రోజుల్లో మా తాతగారు ఓ మాట చెబుతుండే వారు. ఆకులో మెతుకు వదిలి పెడితే ఏడు రోజులు వస్తు పడి ఉండవలసి వస్తుందట! ఏదో చాదస్తం లెమ్మని కుర్రవాళ్ళు ఆ సలహాను పాటించకపోతే "తిండిని తేలికగా చూడకండ్రా బాబులూ కూడు గుండెకాయ, మెతుకు మేనమామ అయ్యే రోజు లొస్తాయితే" అనే వాడాయన. ప్రపంచంలో పెరుగుతున్న జనాభా, తిండి గింజల కొరత, కాల క్రమాన భౌతిక సంపదలు తరిగి పోగలవని విజ్ఞాన వేత్తలు చేస్తున్న సూచన మున్నగు విషయాల్లోనుంచీ తాతయ్య హెచ్చరికను గురించి ఆలోచిస్తే, అందులో ఎంతైనా నిజం ఉన్నదేమోననిపిస్తుంది.

అన్నానికి అనుపానంగా వడ్డించే ఫలహారాలు, పళ్ళు దినుసులు సైతం శ్రీహరి జిహ్వకు రుచిస్తున్న సూచనలు లేవు. రామార్పితం చేయబోతున్న పళ్ళను శబరి కొరికి చూచినట్టు, మాగిందా లేదా అన్న సందేహంతో చిలుక మామిడి పండును పిడిచి చూచినట్టు శ్రీహరి మునివంటితో తిను బండాలను పరామర్శిస్తాడు. పోనీ, ఏదో కారణం వల్ల శ్రీహరికి భోజనం రుచించడంలేదనే అనుకుందాం! అంతటితో ఊరుకోవచ్చుగదా! ఊరుకోడు శ్రీహరి. "సాంబారుకు ఫలానా హొటలు ప్రసిద్ధి. సాంబారు భోజనం అక్కడే చేయాలి" అంటాడు.

# తృప్తి

23 వ పేజీ తరువాయి

తేనీటికి పేరెన్నికగన్న దానిగా ఓ హొటలును పేర్కొని, ఈ భూ ప్రపంచంలో వేరొకచోట తేనీరు సేవించడం శుష్క దండుగే నంటాడు.

"పైకి చూడ్డానికేమో బాగానే ఉన్నావు గానీ, నీ కడుపులో జఠరాగ్ని గాఢ నిద్రలో ఉన్నట్టుందిరా శ్రీహరీ!" ఉండి ఉండీ సుధాకరం తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

(అతడి పుణ్యం! జఠరాగ్ని దీర్ఘ నిద్రలో ఉన్నట్టు చెప్పాడుకాడు!)

"అందుకు మా అమ్మ చక్కటి కారణం చెబుతుంది. అదేమిటో చెప్పనా సుధాకరం! ఎవరివో పాపిష్టి కళ్ళు భోజనం చేస్తుండగా నాపైన పడ్డాయట! అప్పటినుంచీ నాకు తిండి దిగడం లేదట! దృష్టి దోష నివారణకోసం ఆమె వాడి చూడని మంత్ర తంత్రాలు లేవు......"

ఆ మాట నిజమే! శ్రీహరి తల్లిపేరు అన్నపూర్ణమ్మ. ఆమెది అన్వర్థ నామధేయం. ఎటొచ్చీ ఆమె కొకటే చింత—కుమారుడు సరిగ్గా అన్నం తినడని!

ఆ చింత తాత్కాలికంగా సుధాకరాన్ని చుట్టుముట్టింది. శ్రీహరికి సంతృప్తికరమైన భోజనం పెట్టడానికి సుధాకరం శాయ శక్తులా ప్రయత్నించాడు. చిత్రాన్నం, చక్కెర పొంగలి, గారెలు, బూరెలు, జిలేబీ, కేసరి లాంటి వంటకాలు చేయించి, అవి మిత్రుడి జిహ్వపైన తమ ప్రభావాన్ని నెరప గలవేమోనని ఆశ పడ్డాడు. ఎంతగా ప్రయత్నించినా అతడి ఆశ అడియాసే అయింది.

"లాభం లేదురా అబ్బీ! అన్నహితవు అనేది భగవంతుడు నీ నుదుట వ్రాసి పెట్టిన వ్రాత గాదు" అంటూ వేడిగా నిట్టూర్చాడు సుధాకరం.

*           *           *

రెండో మజిలీకి ప్రయాణం.

పుచ్చపువ్వులాంటి వెన్నెల్లో ప్రయాణం చేయడమంటే చెప్పరానంత సరదా శ్రీహరికి! తరిగొండలో కారు బయల్దేరినప్పుడు గంట అయిదున్నర కావస్తోంది. మెల్లగా పది మైళ్ళు వెళ్ళేసరికి సూర్యు డస్తమించాడు. గృహోన్ముఖంగా పరుగెడుతున్న ఆలమందలు పెక్కుచోట్ల కారు కడ్డంగా వచ్చాయి. బారులు గట్టిన పక్షుల గుంపులు గూళ్ళ కెగిరి పోతున్నాయి. చూస్తుండగానే చీకటి పడింది. ఇక వెన్నెల రావడమే తరువాయి! కారు పరుగెడుతోంది. ఎంతసేపు వేచి చూచినా పరిపత

## నేటి సంఘంలో

పెద్దమాటచెప్పి సుద్దులెన్నో పలికి
పనికి సున్నచుట్టి పంపవలయు
పనులు చేతువేని పనికిరావందురు
నిజము నాదుమాట నీళ్లమూట!!

పనికి రానివాడు ఫస్టుమార్కులవాడు
చదువు రానివాడు పదవివాడు
చదువు సంధ్యలుమాని పదవికే పాకరా
నిజము నాదుమాట నీళ్ళమూట!!

బూటకములు పలికి నాటకంబులాడి
మూటగట్టి మురియు మూఢజనుడు
మాటకన్న మూట మర్యాదగలదిరా
నిజము నాదుమాట నీళ్ళమూట!!

మూటకట్టువాడె మొనగాడు ధరలోన
మాటతప్పువాడె మాన్యమూర్తి
చదువురానివాడె సర్వత్ర పూజ్యుండు
నిజమునాదుమాట నీళ్ళమూట!!

—బొక్కా శ్రీరాములు.

గిరులపైనగానీ, వెన్నెల వెలుగులు తారాడటం లేదు. వెన్నెలకు బదులుగా తెల్లటి బ్లాటింగ్ పేపరుపైన ఒలికిన నల్లటి సిరాలా చీకటి మరింత దట్టమై పోతోంది. కిటికీలోనుంచీ తల వెలుపలికి పాచి ఆకసం వైపు చూచాను. వెన్నెల మాట దేవుడెరుగు! రోడ్డుకు తూర్పుగా ఉన్న కొండల పైన అల్లరి పిల్లల్లా ఆడుకుంటూ ఉండిన వాలుగైదు మేఘ శకలాలు కబంధుడిలా హస్తాలు చాచి దిశాంచలాల దాకా విస్తరించాయి.

"తొందరగా వెళ్ళడం మంచిది శ్రీహరీ!" అన్నాను.

"ఎందుకూ!" అన్నట్టు తిరిగి చూచాడు శ్రీహరి.

"వెన్నెల రాదు. వాన వచ్చినా రావచ్చు......"

"మరేం పరవాలేదు. మొన్ననే టాపు గూడా రిపేరు చేయించాను. ఎంత వానపడినా చుక్క లోపలికి దిగదు."

ఆమాత్రం రక్షణను నమ్ముకుని శ్రీహరి విశ్రాంతిగా ఉండగలగడం నా మట్టుకు నాకు అబ్బురాన్నే కలిగించింది. జడివాన ప్రారంభమై కారు చీకటి క్రమ్ముకుంటే అప్పుడీ కారు చిన్న చెర సాలకంటే ఎక్కువగా ఉపకరించదు. గట్టిగా వాన కురిసి రోడ్డు చిత్తడిగా తయారైతే కారు ముందుకు కదులుతుందో, కదలదో సందేహం. కొండల్లోనుంచి ఉరవడిగా క్రిందికి దూకి రోడ్డు కడ్డంగా పరుగెడుతున్న సెలయేళ్ళపైన వంతెనలు లేవు. ఇవన్నీ ప్రయాణానికున్న ఇబ్బందులైతే, ప్రయాణ సాధనంయొక్క వాలకం సైతం ఏమంత ఆశావహంగా లేదు. ఏదో తిక మక ప్రారంభమై వేగం మందగించింది. కంతిరీగల రొద లాంటి సవ్వడి ఒకటి ఇంజనులోనుంచీ ఎడతెరపి లేకుండా వినిపిస్తోంది. ఒంటి చక్రపు తేరికి ఏడు గుర్రాలు పూన్చి కుంటి సారథిని నమ్ముకుని ఆకాశ మార్గంలో పయనమైన సూర్యభగవానుడిలా కష్ట నిష్ఠురాల మాట లెక్క పెట్టకుండా కారు నడుపుక పోతున్న శ్రీహరిని లోలోపల అభినందించకుండా ఉండలేకపోయాను.

ఆఖరుకు అనుకున్నంతా జరిగింది. అంటే వాన ప్రారంభమైందని గాదు. కారే ఆగిపోయింది.

ఎండిపోయిన సెలయేటి ఇసుకపైన ఆగిపోయింది కారు. ఎట్ట ఎదుట ఫర్లాంగు దూరం దాకా పైకి లేచి పుటి దిబ్బలా కనిపిస్తున్న




వారు ఫొటోగ్రాఫర్ అని క్రాపింగ్ చూస్తేనే తెలుస్తోంది. వేరే చెప్పాలా?

# తృప్తి

రోడ్డు చుట్టూరా చిట్టడివి. తటాలున కారులోనుంచీ వెలుపలికి దూకాడు శ్రీహరి. సీటు క్రింద నుంచీ టార్చి లైటు పైకి తీశాడు. మేఘాల పైన మెరుస్తున్న మెరుపులతో బాటుగా టార్చి లైటు వెలిగింది. ఆ వెలుగులో శ్రీహరి మూత పైకెత్తి ఇంజనులోని వివిధ భాగాలను జాగ్రత్తగా పరిశీలింపసాగాడు. ఇంజనులోని మరలూ, మేకులూ, కమ్ములూ, గొట్టాలు అన్నీ పదిలంగానే ఉన్నాయి. కారు పరుగెడుతున్నప్పుడు అది పరుగెత్తడానికి ఉపకరించిన ఇంజనే ఇది! కానీ ఇప్పు డది ఆగిపోయింది. ఎందుకు ఆగిపోయిందో తెలియదు. నాకు తెలియని విషయం అదొక్కటే గాదు. చెడిపోయిన ఇంజన్ను శ్రీహరి అప్పటికప్పుడు మరమ్మత్తు చేయగలడా, లేదా అన్న విషయం గూడా నాకు నిష్కర్షగా తెలియదు.

పది పదిహేను నిమిషాల వరకూ అలా పరిశీలన కొనసాగిన తరువాత శ్రీహరి చొక్కా తీసి కారు లోపలికి గిరవాటుపెట్టి ఇసుకలో వెల్లకిల పడుకుని తలను కారు క్రిందికి దూర్చుతూ "నువ్వు కాస్త క్రిందికి వంగి లైటు వేస్తావా శేఖరం! స్ప్రింగేదైనా విరిగిపోయిందేమో చూడాలి" అన్నాడు.

లైటు వేశాను. విరిగిపోయిన స్ప్రింగు మాట ఏమోగానీ, శ్రీహరి మంథరగిరిని పైకి లేపిన ఆది కూర్మంలా కారును లేవనెత్త నుకిస్తున్నాడు. ఆ ప్రయత్నంలో బలాన్నంతా చేతుల్లోకి తెచ్చుకోడంలో అతడి శరీరం విలవిలలాడిపోతోంది. నిర్జన ప్రదేశంలో కారాగిపోయి రాత్రంతా అక్కడే జాగరణ సలపవలసివస్తే మిత్రుడి ఎదుట తన అభిమానానికి దెబ్బ తగులుతుందనుకున్నాడేమో, కారు నెలాగైనా కదిలించాలన్న మొండి పట్టుదలకు లోనయ్యాడు శ్రీహరి.

కారు బరువుక్రింద శరీరాన్ని అలా చిత్తు చిత్తు చేసుకోడంవల్ల లాభం లేదని గ్రహించిన తరువాత శ్రీహరి చేసేదిలేక ఇసుకలో చతికిలబడిపోయాడు. "ఎంత పని జరిగిందో చూచావా శేఖరం! ఇలా జరుగుతుందని తెలిస్తే అసలు తరిగొండనుంచీ కదిలే వాళ్ళమేకాము......" కొలిమి తిత్తిలా రొప్పుతున్న ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో శ్రీహరి మాట్లాడలేక పోయాడు. అతడి ముఖం చెమటలో దొప్ప దోగిపోతోంది. దుస్తులు స్వేదంలో తడిసి శరీరాని కంటుకపోయాయి.

ఫీంకారాల్లాంటి ఉరుములతో, దంతకాంతుల్లాంటి మబ్బులు విచ్చల విడిగా విహారం సలుపుతున్న విశాలాకాశంక్రింద, ఆకల్లాడక స్తంభించిపోయిన ప్రకృతి దృశ్యాల మధ్య కింకర్తవ్యతా విమూఢులమైన మా పాలిటికి కాలచక్రం ఆగిపోయినట్టే తోచింది. "పోనీలే శ్రీహరీ! జరిగిం దానికి ఏం చేయగలం! గతం నశోచామి—అన్నారు పెద్దలు. విచారించి ఏం లాభం?" అంటూ ఏవో ఓదార్పు మాటలు చెప్పి చూచాను. కానీ ఓదార్పు కతీతంగా శ్రీహరి ఖిన్నుడై కూర్చుండి పోయాడు.

చిన్న చిన్న పొదరిళ్ళు చీకటిలో గంతు లేస్తున్న క్రూర మృగాల్లా కనిపిస్తున్నాయి. బీభత్స రస ప్రధానమైన నాటకానికి నేపథ్య సంగీతంలా దూరంనుంచీ అడవి నక్కల అరుపులు వినిపిస్తున్నాయి. దగ్గరలో ఏదో శబ్దం వినిపించి ఉలికిపడ్డాను. హఠాత్తుగా ఓ నిర్ణయానికి వచ్చిన వాడిలా లేచి నిల్చున్నాడు శ్రీహరి. "ఇలా మీనమేషాలు లెక్కిస్తూ ఎంతసేపని కూర్చుంటాం శేఖరం! ఎలాగైనా ఈ మిట్టపైకి తోసుకెళ్తే పళ్ళంలో కారు స్టార్టయి పోవచ్చు......"

వారించి ఆ ప్రయత్నంనుంచీ విరమింప జేయదంకన్నా, ఆ అయోమయ పరిస్థితిలో శ్రీహరి సలహాను పాటించడమే నయమనిపించింది. కానీ స్వశక్తిని గుర్తించక తలకుమించిన పనులకు పూనుకోడంవల్ల భంగపాటు కాక మరేం కలుగుతుంది? ఆ కారు ఎదుట మాకు పాటిల్లింది గూడా అదే! కారును ఇసుకలోనుంచీ అవతలికి నెట్టేసరికి కీళ్ళు ఎక్కడి వక్కడే విడిపోయినట్టు, ఎముకలు దేని కదే వేరైనట్టు శరీరం స్వాధీనం తప్పింది. అందులోనూ కాయ కష్టానికి అలవాటు పడిన వాడు కాడు శ్రీహరి. ఇంకెంత దూరం, కొంతదూరమే నన్న ఆశ మాత్రమే అతడిచేత ఆ కష్టసాధ్యమైన పనిని చేయించి ఉంటుంది. విశ్వ ప్రయత్నంతో కారును మిట్టపైకి చేర వేసేసరికి శ్రీహరి బొందిలో ఊపిరున్నట్టు లేదు. అతడు బల్లిలా కారు కంటుకపోయి ఒగర్చుకుంటూ "మంచి నీళ్ళు శేఖరం! గ్లాసుడు మంచినీళ్ళు దొరికితే బాగుండును" అన్నాడు.

"మంచి నీళ్ళెక్కడ దొరుకుతాయి? ఇంకా వాన ప్రారంభం కాలేదు. వరుణదేవుడు అనుగ్రహిస్తే వాన నీటితో పెదవులనైనా తడుపుకోవచ్చు.

ఇంగితం తెలుసుకున్న వాడిలా వరుణదేవుడు పిలవకముందే పలికాడు. సన్నగా తుంపర ప్రారంభమైంది.

"వృథాగా వానలో తడవడ మెందుకు శ్రీహరీ! లోపల కూర్చుందాం" అన్నాను.

"కళ్ళు తిరుగుతున్నాయి శేఖరం! తలు పెక్కడుందో చూపించు" అన్నాడు శ్రీహరి.

తలుపు తెరచి లోపలికి చేర వేయడమే తరువాయి శ్రీహరి శరీరాన్ని ముదర చుట్టుకుని సీటుపైన సొమ్మసిల్లి పోయాడు.

పది పదిహేను నిమిషాలు గడిచేసరికి తుంపర జోరు హెచ్చించి వర్షంగా పర్యవసించింది. అంధకారం లోకాన్ని ఆవరించుకున్నవేళ అరణ్య ప్రాంతంల్లో జడివాన కురుస్తుంటే చూడాలన్న కోరిక చిరకాలంనుంచీ ఉంది. భగవంతుడు ఏనాటికే అనుభవాన్ని వ్రాసిపెట్టాడో దాని అనుభవించక తప్పించుకోడం ఎవరితరం? ఆ అనుభవంలో కష్టమే ఎదురైనా సుఖమే ఎదురైనా నిర్లిప్తతతో స్వీకరించడం మానవుడి విధి. కారు లోపల కూర్చుని కిటికీ అద్దాలగుండా బాహ్య ప్రపంచంలోకి చూస్తున్నాను. మింటికీ, మంటికీ కాకిని వ్రేలాడగట్టినట్టున్న గంభీర దృశ్యం ఒక్కటి తప్పితే కంటికి మరేమీ కనిపించడంలేదు. కురుస్తున్న తీరులో హెచ్చు తగ్గులనుబట్టి మద్దెలలు మ్రోగినట్టు, డమరుకాలు మ్రోయించినట్టు, నగారాలు వినదించినట్టు రక రకాల శబ్ద విన్యాసాలతో వర్షం విశ్వరంగంపైన కదను త్రొక్కుతోంది.

అర్ధరాత్రి కింక ఒకటి రెండు గడియలు

వ్యవధి ఉండదనగా శ్రీహరిలో చైతన్యం పుట్టుకొచ్చింది. తలపైకెత్తి నా పొలకువకోసం అటూ ఇటూ చూస్తూ "ఏం చేస్తున్నావు శేఖరం!" అని ప్రశ్నించాడు.

"కూర్చునే ఉన్నాను శ్రీహరీ! వాన వెలిసింది. మేఘాలు విచ్చిపోయాయి. వెన్నెల కాస్తోంది. ప్రకృతి చాలా అందంగా ఉంది" అన్నాను.

"నీ అందాని తీసుకెళ్ళి గంగలో కలపవయ్యా బాబూ! కడుపులో కొక్కులు తవ్వుతున్నాయి, పేగులు గీపెడుతున్నాయి. తినడాని కేదైనా కావాలి. గొంతుక వెంట ఏదైనా దిగకపోతే కళ్ళు తేల వేసేయడం ఖాయం. చూడవయ్యా బాబూ! దగ్గర్లో ఏదైనా పల్లెటూరుందేమో చూడు...."

"ఈవేళ గాని వేళలో పల్లెలోనైనా ఏం దొరుకుతుంది శ్రీహరీ?"

"మరేమీ దొరక్కపోయినా గుప్పెడు వేరు శనగకాయలైనా దొరకవా శేఖరం! అవి దొరికినా చాలు......"

"కానీ ఈ అర్ధరాత్రి సమయంలో పల్లెల కోసం అన్వేషణ ప్రారంభిస్తే ఇక్కడ కారు గతి.."

"అబ్బబ్బ, ఓ వైపున నాలుక పిడచ గట్టుకపోతుంటే, నీ సందేహాలతోనే చంపేస్తావా శేఖరం"

కథ శ్రుతిమించి రాగాన పడుతోందని గ్రహించాను. రోడ్డువెంట ఫర్లాంగు దూరం నడిచేసరికి సన్నటి కాలిబాట కనిపించింది. తన అంచనా తప్పు గాకపోతే ఆ కాలిబాట చివరలో పల్లెటూరుంటుందన్నాడు శ్రీహరి. ఉండక తప్పదని హామీ గూడా ఇచ్చాడు. అనతి దూరంలో పల్లె కనిపించింది. ప్రకృతిమాత ఒడిలో ప్రశాంతంగా నిద్రపోతున్న పల్లెటూరు చింతచెట్ల గుబుర్ల క్రింద చిన్న చిన్న పూరిండ్లు, కొట్టాల్లో కునికిపాట్లు పడుతున్న గొడ్లు గోదలు. కుక్కలు తరుము కుంటాయేమోనన్న భయం ఉండనే ఉంది. ఐనా ఊరిలోపలికి వెళ్ళక తప్పదు. బురదనీరు నిలిచి ఉన్న సన్నటి వీధి గుండా వెళ్తుండగా ఎవరో పలకరించారు.

"ఎవురు బాబూ! ఎక్కడి కెళ్తున్నారు......"

జవాబు చెప్పమన్నట్టుగా ముంజేతిని నొక్కాడు శ్రీహరి.

"ఎవరైతే నేమిగానీ దారి దప్పి ఇలా వచ్చేశాము. తిండీ తిప్పలు లేకుండా శోషిల్లిపోయాము......"

కళ్ళు నులుముకుంటూ ముసలాయన దగ్గరికి వచ్చేశాడు. "దారి తప్పి వచ్చారా! చూడ్డానికి మా రాజు బిడ్డల్లా ఉన్నారే! ఎక్కడినుంచి వచ్చారు? ఎలా వచ్చారు? దారెందుకు తప్పారు?"

సంగ్రహంగా వివరాలన్నీ చెప్పుకున్నాను. మా మాటలపై నమ్మకం లేకపోతే రోడ్డుపైకి వెళ్ళి ఆనవాలుగా మోటారు కారును చూచుకోమన్నాను.

మేము కారెక్కి వచ్చిన వాళ్ళమని తెలియగానే ముసలాయన మరీ తబ్బిబ్బు పడిపోయాడు.

"అలాగా నాయనా! మీ బోటి మారాజుల్ని కూచోమని చెప్పడానికైనా మాకేమున్నాయి? బాబ్బాబూ, ఇది గిదుగో, ఇలా మంచంపైకి దయ చేయండి. భూమి తల్లిని నమ్ముకుని బతికే వాళ్ళ మూ నాయనా! పొద్దు గూట్లో పడేసరికి ఇంత గంజో తాగి కిమ్మనకుండా పడుకుంటాం. ఐనా ఎంత సేపు? గడియ సేపట్లో వంటైపోదూ! అయినా మీకు హితవుగా అన్నం పెట్టగలమని అనుకోకండి బాబూ! ఏదో మాకు కలిగింది".

ముసలాయన పలకరింపులకు ఇంటిల్లిపాదీ నిద్రలేచేశారు. ఆడవాళ్ళు కొందరు గుమ్మంగుండా తొంగి తొంగి చూచి విస్మయంతో గుస గుస లాడుకుంటూ లోపలికి వెళ్ళారు. పడుచువా డొకడు అప్పటి కప్పుడు దోటి తీసుకెళ్ళి చెట్లోనుంచీ ఇన్ని చింత కాయలుకోసి తెచ్చాడు. నాలుగు పచ్చి మిరప కాయలు గిల్లివేసి, గుప్పెడు ఉప్పురాళ్ళు కుమ్మరించి ఇంటావిడ పచ్చడి తయారు చేసింది. అర్ధరాత్రప్పుడు వచ్చిన ఆగంతకులకోసం ఆ ఇంట్లో వంట క్షణాల్లో ప్రారంభమైంది. అయిపోయిందా అయిపోయిందా - అని ముసలాయన వేగిరిస్తుండగా ఎసరు పెట్టేశాం, పొంగు వచ్చేసింది, గంజి వార్చేస్తున్నాం అని ఆడవాళ్ళు జవాబిస్తున్నారు.

ఖరుకు అన్నాలు గూడా ఆకులోకి వచ్చేశాయి. కూరలు లేనందుకు కించపడిపోతూ ఇంటావిడ ఆకులోని అన్నమంతా మూసుక పోయేటట్టు గిన్నెలోనుంచీ గడ్డ పెరుగు కుమ్మరించింది. పొగ లెగసిపోతున్న పచ్చి బియ్యపన్నం చింతగింజ మునగని చిక్కని గేదె పెరుగు, పచ్చి మిరపకాయల చుర్రు కుదనంతో రుస రుసలాడుతున్న చింతకాయల పచ్చడి......నాలుగు ముద్దలు మ్రింగి శ్రీహరి వైపు చూచాను. అన్నాతురుడికి మొగమాటాలకు చాలా దూరమేమో, శ్రీహరి ఎదుటనున్న విస్తరి ఖాళీగా ఉంది.

"ఏమిటో నాయనా! మొదటే చెప్పాను— మీకు పెట్టగలిగిన వాళ్ళం కామని! మాకున్న భాగ్యాలింతే మరి! ఏమనుకున్నారో ఏమిటో......"

పాపం! ఆ పల్లెటూరి ముసలాయన అమాయకుడు. సుష్టుగా భోజనం చేసిన సంతృప్తి రాజ్యాలు గెలిచిన ఆనందంలా శ్రీహరి ముఖంలో వెలుగు లీనుతుండడం ఆయన గ్రహించలేకపోయాడు.

తిరుగు దారిలో నూటికి విలువైన మాట ఒకటన్నాడు శ్రీహరి—"పల్లెటూళ్ళల్లో భోజనం ఇంత రుచిగా ఉంటుందా శేఖరం! నేను కలలోనైనా అనుకోలేదంటే నమ్ము!"

శ్రీహరి సందేహానికి సమాధానం చెప్పకుండా ఓ చిరునవ్వుతో తప్పించుకున్నాను. కానీ నా అంతట నేను మాత్రం అతడికి చెప్పి ఉండవలసిన సమాధానాన్ని గురించి తీరిగ్గా ఆలోచించక పోలేదు. కష్టపడినకొద్దీ ఫలితం. శ్రమ పడినకొద్దీ సుఖం. కూర్చున్నా, పడుకున్నా, కునికిపాట్లతో కాలాన్ని వేగిస్తున్నా కొందరికి షడ్రసోపేతమైన భోజనం వాళ్ళెక్కడుంటే అక్కడికి వెదుక్కుంటూ వస్తుంది. వనిత తనంతట తాను వలచి వస్తే ఎవరికైనా చులకనే! భోజనం సంగతి గూడా అంతే మరి! తన అలవాటుకు విభిన్నంగా శ్రీహరి ఆ రాత్రి పూట భోజనంకోసం ఎంత అవస్థ పడ్డాడన్న విషయం మళ్ళీ ఇక్కడ చెప్పవలసిన అవసరం ఏముంది? అది పాఠక మహాశయుల కందరికీ తెలుసు! ★

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

## మనిషి మిధ్య

18 వ పేజీ తరువాయి

"అని నీ కెలా తెలుసు?"

"తెలుసంతే. పోతే, శాస్త్రి వట్టి ఫూలన్న విషయం అందరికీ తెలుసు. వాడిని ఒక ఆట ఆడించి చిత్తు చేయించగల ప్రయోజకత్వం మనకీ ఉంది"

"అదెలాగా?"

"వాడు వేయబోయే నాటకానికి మనమూ వెళ్ళాలి"

"టాట్......ఇంత బ్రతికూ బ్రతికి—అది గొప్ప కష్టంలే గురూ. నావల్ల కాదు."

"నిజానికి వాడు మంచి నటుడే. అది ఒప్పుకుని తీరాల్సిందే. పోతే మనం నాటకానికి వెళ్ళేది వాడి నటనని మెచ్చుకుని, వాడి మెళ్ళో హారం వేయడానికి కాదు. ఆ మహానటుడ్ని మంచి నీళ్ళు తాగించి బాబోయ్ అనిపించేందుకు"

"అదెలా?"

"అప్పుడు చెప్తాను"

"వాడు మంచి నీళ్ళు తాగితే మన కొచ్చిపడే లాభం."

"అందుకే నిన్ను మీ కాబోయే శ్రీమతి అడిస్తున్నది. ఓయి పిచ్చి ప్రసాదం, వాడు మంచి నీళ్ళు తాగడమంటె స్టేజీమీద పోర్షను మరిచి డాన్స్ చేయడ మన్నమాట. దాంతో ఆ నటశేఖరుని కీర్తి అభాసుపాలై పోగలదు. వాడు డాన్స్ చేయటానికి అనువైన వాతావరణం మనం ఏర్పాటు చేసుకోవాలి. సీరియస్‌గా నడుస్తున్న సీన్‌లో పిల్లి కూతలూ, తుమ్ములూలాటి మందులు ఉండనే ఉన్నాయి. దాంతో ఎంత మగాడైనా ఛంకాల్సిందే మరి. వివరాలన్నీ ఆ రోజున చెప్తాను సరా. అయితే మనం చేయబోయేది అన్యాయం" అన్నాడు పతి.

"షెహోష్. అన్యాయంటె అన్యాయం. దెబ్బతీసే వాడిని దెబ్బతోనే పడగొట్టాలన్నారు జనం. నీకెందుకు గురూ ఆ పాడు పనేదో నా నెత్తి నేసుకుంటానుగా. గొప్ప అల్లరిచేసి వదిలి పెట్టనూ..... హు.......చూపిస్తా నా తడాఖా"

"ఈలోగా మృణాళిని ముందు, నీకున్న టాలెంట్‌ని ప్రదర్శించుకోవాలి."

"నాకా......టేలంటా?"

"అవును నీకున్న టాలెంటే"

"నాకు దేన్లో ఉంది టాలెంటు?"

"టాలెంటు రెండు రకాలు. ఒకటి బైబర్త్ వచ్చి అభ్యాసంకొద్దీ పెరిగి పెద్దదై, "ఓహో" అనిపించేది. రెండు, అప్పటికప్పుడు చూచి నేర్చుకుని, అనుకరించి 'ఆహా' అనిపించుకునేది. 'ఓహో' నీ కెలాగో లేదు కాబట్టి 'ఆహా' ఆచరించి—అదీ ఆడపిల్లల్ని ఆకర్షించే టాలెంటై యుండాలి—షో మెయిన్‌టైన్ చేయడం."

"ఇది గొప్ప కష్టం."

"ఇప్పుడు కావలసిందీ ఇదే. ఈనాడు చాలా మంది ప్రేమికులూ, మహానుభావులూ, పెద్ద మనుషులూ అందరూ చేస్తున్నది 'ఆహా' నే"

"నా చాతనవుతుం దంటావా?"

"నిజమైన ప్రేమికుడి కిదేం లెక్కలోది కాదు"

"ఒకవేళ కథ అడ్డం తిరిగితే?"

"కలిగే నష్టమూలేదు. ఏమంటావా? నువ్వంటే మృణాళినికి ప్రేమ ఉండనే ఉందని ముందే చెప్పాను. గదా. ఈ 'ఆహో'లో నువ్వు గనక ఫెయిలైతే ఆవిడ సానుభూతితోపాటూ, హృదయమూ నీ స్వంతమై పోగలవు."

"మరి టాలెంట్ ఏ రంగంలో కావాలి?"

"చెప్తాగా ఆడపిల్లల్ని ఆకర్షించేదిగా ఉండాలని. నాకు తెలిసినంతవరకూ వాళ్ళకి సంగీతమన్నా కవిత్వమన్నా విపరీతమైన మోజని. ఈ మధ్యనే, ఒక పేరొందిన సైకాలజిస్టు, ఇలాగే రాశాడు."

"సంగీతం ఈ జన్మకి చాత కొచ్చే విద్య కాదు, నేర్చుకున్నా రానేరాదు. పోతే—కవిత్వం ద్వారా, రిజల్టే మవుతుందో తేల్చి చెప్పలేను" అన్నాడు ప్రసాదం.

"ప్రయత్నించమన్నానేగాని ఫలితం గురించి ఆలోచించమనలేదే?"

"బాగానే ఉందయ్యా. కవిత్వం నేర్చుకోవాలంటె ఏం చేయాలో గూడా చెప్పు."

"పుస్తకాలు చదువు. భావకవులుగా చలామణీ అయినవార్ని కొన్ని కనిపెట్టుకునుండు. వాళ్ళు ఎప్పుడో ఎక్కడో చెప్పిన నాలుగు ముక్కల్నీ నేషనలైజు చేసుకుని నీ స్వంత భావాల్గా ఉపయోగించు. ఆవిడ మెప్పు సంపాయించు."

"భేష్."

"ఎందుకైనా మంచిది త్వమే వాహమ్, మహా ప్రస్థానం శ్రద్ధగా చదవడం మొదలు పెట్టు ఇప్పట్నుంచే."

"అవేమిటి?"

"పుస్తకాలోయ్. విలువగల పుస్తకాలు. వేడీ, ఉద్రేకం, జాలీ, దయా అన్ని రసాలూ వాటిల్లో ఉన్నాయి. నువ్వూ మీ మృణాళినీ ఏకాంతంగా ఉన్నప్పుడు వాటిల్లో నాలుగు ముక్కలు రాంబాణాల్లా గంభీరంగా భావయుక్తంగా పెద్ద ఫోజుతో ప్రయోగించు."

"నువ్వింత చెప్తూంటే నా కిప్పుడే ఆవేశం కలుగుతోంది. నీకు పుణ్యముంటుందిగానీ ఆ రెండు పుస్తకాలూ తెచ్చిపెడుదూ."

"అలాగే" అన్నాడు పతి.

మరి కొంతసేపు ఆ పార్కులో పచ్చ గడ్డి మీద, ముందు చేయబోయే కార్యక్రమాన్ని కూలంకషంగా చర్చించి, ఇళ్ళకి బయలు దేరారు మిత్ర ద్వయం.

దార్లో తన హృదయపూర్వకమైన కృతజ్ఞత తెలియజేశాడు ప్రసాదం, పతికి.

* * *

నిరంజనం ఇంటి కొచ్చేసరికి రాత్రి పది గంట లయ్యింది. వరండాలో లైటు వెలుగుతూనే ఉంది. రేణుక సోఫాలో కూర్చుని ఏదో మేగజైన్ తిరగేస్తోంది. నిరంజనం రావడం చూచి పుస్తకం మూసి లేచి నిలబడింది.

అతను కొత్తగా కనిపించేడు. తల రేగి ఉంది. కళ్ళు ఎర్రపడ్డాయి. తూలుతున్నాడుగాని తమాయించుకుంటున్నాడు.

అతని వాలకం చూచి రేణుక కలవరపడింది.

అతను సరాసరి అతని గదిలోకి వెళ్ళిపోయాడు. పేము కుర్చీలో కూలపడి సిగిరెట్ ముట్టించాడు. రేణుక వచ్చింది. గుమ్మం దగ్గర నిలబడి అడిగింది.

"చాలా ఆలస్యంగా వచ్చారు."

"................................"

"ఆఫీసులో అంత పని ఉందా?"

అతను రేణుకవైపు కోపంగా చూచి, సమాధానం చెప్పకుండానే డ్రెస్సింగ్ టేబిల్ దగ్గరకు వెళ్ళి టై విప్పుకుంటున్నాడు.

"మధ్యాన్నం గూడా ఇంటికి రాలేదు"

"..............................."

"రెండు రోజుల్నుంచీ మీరు పరాకుగా ఉంటున్నారుగదూ."

"అయ్యిందా ఇంకా ఏమైనా ఉందా?" అన్నాడు బూట్లు విప్పుకుంటూ.

పిన్నీవాళ్ళు వచ్చిన రోజు జరిగిన రగడ నెమ్మదిగా నాలుగు రోజుల్లో సర్దుకుంది. దాదాపు అన్నీ మరిచిపోయి మొన్నటివరకూ మౌనంగా గడిపేరు. మళ్ళా మొన్నట్నుంచి జగడం ప్రారంభమైంది. బుర్రలో మాసిపోయిన రగడ మళ్ళా కెలికింది.

"జరిగిపోయిన దాన్ని మళ్ళా గుర్తు చేసుకుని బాధ పడటం భావ్యంగాదు."

"నోరు మూసుకుంటావా? నన్నెక్కడికయినా వెళ్ళిపోమంటావా?"

ఆమెకి అతన్ని చూస్తూంటే భయంగా ఉంది. ప్రేమ పెళ్లితో స్వస్తి అని చాలామంది అంటున్నది నిజమేనేమో. కాలేజీ రోజుల్లో అతను తనంటె ప్రాణం పెట్టేవాడు. ఒకరిద్దరు గడుగ్గాయి విద్యార్థులు చెవాకులు పేలితే వాళ్ల నోళ్ళు మూయించేడు. ప్రేమ బూటకం కాదనీ, శాశ్వతమనీ, పవిత్ర బంధమనీ చెప్పేడు. అతని మాటలు విని తన అదృష్టానికి మురిసిపోయింది తను.

ఏది? ఇప్పుడా మాటలన్నీ ఎక్కడికి పోయాయి? ఒక చిన్న మాట పట్టింపుకోసం ప్రాణాధికంగా ప్రేమించిన తనని అలక్ష్యం చేయడం తగునా?

పరిచయస్థులు చాలామంది తమ పెళ్ళికి వివరీత అర్థాలు తీసేరు. ఒక బంగారు పిచ్చుకని ప్రేమించి పెళ్ళి చేసుకోడంలో ప్రేమ కంటె స్వార్థం ఎక్కువని దెప్పి పొడిచేరు. ఇది నిజం చేస్తాడా నిరంజనం?

రేణుక తల్లడిల్లి పోయింది.

ఈ రోజు అతని పరిస్థితి మరింత అధ్వాన్నంగా ఉంది. సభ్యత గలవాడూ, పది మందిలోనూ తలెత్తుకు తిరుగ నేర్చినవాడూ చెయ్యరాని పనిని చేశాడు. తప్ప తాగి ఇంటికి వచ్చాడు. ఈ మాట గుర్తుకు రాగానే దుఃఖం పెల్లుబికింది.

తను కట్టుకున్నవన్నీ గాలి మేడలేనా?

"ఏం? ఇంకా ఇక్కడే నిలబడ్డావ్ బొమ్మలాగా" అన్నాడు నిరంజనం బట్టలు మార్చుకుని వచ్చి.

"లేవండి భోజనం చేద్దాం"

"నాకేం అక్కర్లేదు. హోటల్లో భోంచేసి, క్లబ్బులో హాయిగా కాలక్షేపంచేసి వచ్చాను. తినాలని ఉంటే నువ్వే తిను. మరీ అంత పతిభక్తి తగునా రేణూ?" అన్నాడు అపహాస్యంగా.

ఆమెకి సహనం చచ్చిపోతుంది. ఎన్నాళ్లని ఈ రంపపు కోత?

"వొద్దు రేణూ! మీతో ....... మీ ఆస్తితో నేను సుఖపడలేను. నిన్ను పెళ్ళిచేసుకోడం పొరపాటేనేమో" అన్నా డతను.

"ప్లీజ్ ...... మీ రామాట అనొద్దు" అంది కళ్ళల్లో నీళ్ళు నింపుకుని.

"నన్ని మాత్రమే అర్థం చేసుకున్నారా? అప్పుడే మన కాలేజీ రోజులు మరిచిపోయేరా?" అన్నది బాధగా.

"ఊహూ ...... లేదు. అక్కడే, ఆ రోజుల్లోనే పొరపాటు చేశాను. ప్రతిఫలం అనుభవిస్తున్నాను"

ఆమె రెండు క్షణాలు ఏమీ మాటాడలేదు.

"మా నాన్న చేసింది తప్పే. ఆయన తరపున నేను క్షమాపణ వేడుకుంటూన్నాను."

"గూడ్.....నువ్విట్నుంచీ, మీ నాన్న అట్నుంచీ, నన్ను బొమ్మలా ఆడించేస్తున్నారు. నువ్వు రాసిన ఉత్తరానికి ఆయనింతవరకూ సమాధానం రాశారా చెపుదూ."

"ఒక పక్క మీ మాటనే నెగ్గించుకుని నిష్ఠూరాలు కూడా వేయడం ఎందుకు చెప్పండి."

"అంటె?"



"మీరా కుర్రాడికి ఉద్యోగం ఇవ్వలేరుగదా?"

"వాద్దూ యూమీనే! అలా అడ్డమైన ప్రతి వాళ్ళకీ ఉద్యోగాలు వేసే స్థితికొస్తే, ఆ కంపెనీ లోనే కాదు, ఈ ఇంట్లోనూ ఉండను తెలుసా రేణూ!"

"ఆ స్థితి ఎన్నటికీ రాదని, మిమ్మల్నెవరూ శాసించే అధికారం లేదనీ నేను హామీ ఇస్తున్నాను" అన్నది రేణుక ఆవేశంతో.

నిరంజనం పేలవంగా నవ్వుతో

"నీ మెర్సీ కోసమే బ్రతుకుతున్నాను" అన్నాడు వ్యంగ్యంగా.

"ఏది చెప్పినా మీరు అపార్థం చేసుకుంటు న్నారు. ఇక మిమ్మల్ని నప్పించడం నా తరం కాదు."

"గప్‌చిప్. ఆ నిర్ణయానికొస్తే ఇక వేరే చిక్కే ఉండదు. నీ విషయాల్లో నేను గాని, నా విషయాల్లో నువ్వు గాని ఇక కలుగ జేసుకోరాదు. పదిమంది మధ్యా భార్యా భర్తలుగా తిరుగుదా మంటావా? నాకే అభ్యంతరమూ ఉండదు తలుచుకుంటే మీ అందరికంటె ఘనంగా నటించే పత్తా నాకుంది" అన్నాడు కటువుగా.

రేణుక తన మొహాన్ని రెండు చేతులతో కప్పు కుని హాల్లోకి వచ్చేసింది. ఆమె అతని ధోరణికి అబ్బురపడింది.

గాలి వాటపు మనిషా నిరంజనం? అతనికి నిజంగా తనమీద ప్రేమ లేదా? ఇంత చపలచిత్తుడా అతని దింతరాతి గుండె అని తనకు తెలీదు. తనెంత కుళ్ళి కుళ్ళి ఏడుస్తుందో అతను గమనించాడా?

ఆమె చీర చెంగుతో కళ్ళు తుడుచుకుంది.

తన ఎక్కువ నిలబడ్డ నిరంజనాన్ని నవాని విత్తిన తల వాళ్ళి దించుకుంది.

"ఆ గోగ్, ఆ ఆఫీసరు వెధవ ఎన్నెంత అల్లరి పెడుతున్నాడో మీరెవరైనా ఊహించారా? పది మందిగిర ఈ విషయం చెప్పి వాడు నవ్వుతూ వాళ్ళని నవ్విస్తున్నాడు. ఈ అలుసు వాడికి ఎవ రిచ్చారు. మీ నాన్న, ఇప్పుడు వాడు నువ్వూ, నా వ్యక్తిత్వాన్ని నవ్వుల పాలు చేస్తున్నాడు. అసలు వాడెవడు? హు ఈక్ హీ! ఆఫ్టరాల్ ఏ డేం బెగ్గర్! అలాంటివాడు మీ నాన్నకి దేవుడు!"

"........................."

"నిజం చెప్తున్నా రేణూ! ; అధికారం పట్ల ఆశలేదు. నాకున్న అర్హతతో ఏ చిన్న ఉద్యోగం చేసుకున్నా మనశ్శాంతి ఉండేది. నీకు తెలీదు నా బాధ. ఒకే రక్తంలో భాగం పంచుకుని పుట్టిన తమ్ముడికి, నాన్న ఉత్తరం రాసినా ఉద్యోగం ఇవ్వ లేదు నేను. ఆ ఉద్యోగం చేస్తూ, వాడూ అందరిలో అలుసై పోవడం నా కిష్టంలేదు. తమ్ముడిగ్గూడా కోటలో జాగా ఇచ్చాడని దారినిపోయే ప్రతి వెధవా నోటి కొచ్చినట్లు వాగుతే విని సహించే ఓపిక నాకు లేదు. స్వంత తమ్ముడికి వేయించలేని ఉద్యోగం, ఎవడో ఆఫీసరుట, వాడి తాలూకు తల మాసిన మనిషి కెవ్వడికో ఉద్యోగం వేయించాలిట. ఇప్పుడు చెప్పు.......నన్నేం చెయ్యమంటావ్"

"........................."

"ఒద్దు రేణూ...... నన్నెవరూ శాసించడానికి ప్రయత్నించవద్దు. అవసరమైతే ఈ క్షణంలో నా ఉద్యోగానికి రాజీనామాయిచ్చి, మీ నాన్నకీ, ఆయన హోదాకీ ఒక నమస్కారం పెట్టి వెళ్ళిపో గలను. కానీ.......దానివల్ల బాధపడేది నువ్వు....... నువ్వు రేణూ......" పిచ్చిగా అనేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు నిరంజనం.

# మనిషి - మిథ్య

అతను మంచంపైన నడుం వాల్చాడేగాని నిద్ర పట్టడంలేదు. అతను చేస్తున్న పిచ్చి పనులన్నిం టినీ ఒక్కటొక్కటిగా గుర్తుకు తెచ్చుకుంటున్నాడు

తండ్రి చేసిన పనికి రేణుక బాధ్యురాలా? మాటలని రేణుకని నొప్పించలేదుగదా! అయినా తన మనసు తెలిసి గూడా ఆమె అడ్డు చెప్పడం దేని కసలు?

తను తాగొచ్చాడు. మనో నిబ్బరం లేనివాడూ, పిరికివాడు, నైతిక విలువలకి స్థానం ఇవ్వలేనివాడు చేసే పనిని తను చేశాడు.

ఇది తంచి రేణు ఎంత కుమిలి పోతుందోగదా!

గోడ గడియారం రెండు గంటలు కొట్టింది. ఉలిక్కిపడి లేచాడు నిరంజనం మంచం మీదనుండి. హాల్లోకి తొంగి చూశాడు. అక్కడ లైటు ఇంకా వెలుగుతూనే ఉంది.

లేచాడు. హాల్లోకి వచ్చాడు. సోఫామీద తల వాల్చి నిద్ర పోతుంది రేణుక. ఆమెను చూడగానే జాలి కలిగింది అతనికి.

రేణుక భుజం తట్టి, నిద్రనుండి లేపాడు. ఆమె కళ్ళు విప్పింది. తనెదురుగా నిరంజనం నుంచుని ఉండటం చూచి, ఉలిక్కిపడి లేచి నిల బడింది.

'మొన్న మహిళా మండలి సమావేశంలో మీ ఆవిడ చాలా బాగా ఉపన్యాసం ఇచ్చారుటగా!'

'ఆవిడకిది అలవాటే లే! మా గృహ శాసనసభలో పదేళ్ళుగా ఆవిడే 'స్పీకరు' మరి.'

రంగాగారి

"ఇక్కడ పడుకున్నావే రేణూ. పద......, మంచం గదిలో ఉంది" అన్నాడు నిరంజనం.

ఆమె కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. అతను ఆమెను దగ్గరికి తీసుకుంటూ

"నాకు నేనే అర్థం కావడంలేదు రేణూ! క్షమించు" అన్నాడు బాధగా.

ఆమె అతని నోటిని తన చేత్తో మూసింది.

"మీరా మాట అనొద్దు. మిమ్మల్ని నేను అర్థం చేసుకున్నాను" అన్నది రేణుక.

ఆ సాయంత్రం పెందరాళే ఇంటికి వచ్చాడు నిరం జనం.

హాల్లో అడుగు పెట్టిన నిరంజనానికి మావయ్య మాటలు వినిపించాయి.

"అతని మనసింత పాడు చేసుకోడ మెందుకు తల్లీ, నాక్కావలసిందీ మీ సుఖమే కదా. ఆ మాట గ్రహించలేకపోయేడా అతను. అతను పరాయి వాడని నే నెప్పుడైనా అనుకున్నానా?"

నిరంజనం సరాసరి తన గదిలోకి వెళ్ళి కూర్చు న్నాడు. కాసేపటికి రేణుక వచ్చింది.

"మా నాన్న వచ్చాడు. మీతో మాటాడా లట. రమ్మంటారా?" అని ఆమె అంటుండగానే ఆయన లోపలి కొచ్చేడు.

"అదికాదోయ్ అల్లుడూ! నే నేదో రాసేనే అనుకో, నువ్వు దానికి జవాబుగా నాలుగు చివాట్లు పెట్టి ఉత్తరం రాస్తే పోలేదూ. ఇంత అల్లరి చేసుకుంటారా ఎక్కడైనా?"

నిరంజనం మాటాడలేదు.

"పెద్ద వాళ్ళం. ఛాదస్తం కొద్దీ ఏదో చేసేస్తాం. ఇది తప్పు అని చెప్పవలసిన బాధ్యత మీది. వినక పోతామా? అప్పుడు మీ ఇష్టం వచ్చినట్టు చేసు కోవాలిగాని వార్నింగైనా ఇవ్వకుండా నీకు నువ్వే మధనపడి పోవడం ఏమైనా బాగుందా. అమ్మాయి రాసిన మొదటి ఉత్తరం చదివి— ఏదోలే సర్దుకు పోతార్లే అని ఊరుకున్నాను. కానీ......వ్యవహారం ఇంతవరకూ వస్తుందనుకోలేదు అల్లుడూ" అన్నా రాయన నవ్వుతూ.

"భోజనం సరిగ్గా చెయ్యడం లేదుట, వేళకి ఇంటికి రావడం లేదుట, ప్రతి చిన్న మాటకీ విసు క్కుంటున్నావుట, భలే వాడివయ్యా నిరంజనం!" అన్నారాయన.

"అబ్బే......అదేం లేదు"

"అయితే అమ్మాయి చెప్పిందంతా అబద్ధ మంటావా? మీకేం తక్కువని ఈ విధంగా మనసు పాడు చేసుకోడం. అదీగాక,.....తప్పు చేసింది నేను. నన్ను దండించు."

"ఈ చివరి మాట నే ననలేదు నాన్నోయ్" అన్నది రేణుక.

"ఇదిగో నబ్బాయ్ నే నొకటి చెప్తా విను. ఈ కంపెనీ, ఈ ఆస్తి సర్వస్వమూ నీవి. నీ యిష్టం వచ్చి నట్టు చేసుకోడానికి నేను కాదుగదా బ్రహ్మదేవుడు గూడా ఎదురు చెప్పటానికి వీల్లేదంతే. కావాలంటే అలా అని రాసిస్తాను."

నిరంజనం సిగ్గుపడిపోయాడు.

"ఒక్కగా నొక్క కూతురు రేణుక. అది సంతో షంగా ఉండటమే నాక్కావలసింది. తండ్రుల మనసు నీ కిప్పుడే తెలీదు బాబూ. నీకూ ఓ పలుసు పుట్టి పెద్దదై, అత్తవారింటికి వెళ్ళిన తర్వాత ఇప్పటి నా ధోరణి నీ కప్పుడుగాని అర్థం కాదు. శివానందం నిన్ను అల్లరి పెడుతున్నట్టు అమ్మాయి చెప్పింది. నా బుద్ధి తక్కువతనం ఇప్పుడు తెలిసింది బాబూ సరే.......మళ్ళా రాత్రి బండికి పోవాలి నేను" అన్నారాయన.

"అరె.......భోంచేయకుండానే......"

"అదేం కుదరదయ్యా అల్లుడూ......ఈ ఇంట్లో వంశోద్ధారకుడు పుట్టి, 'తాతయ్యా భోజనానికి రా!' అనేంతవరకూ ఈ ఇంట్లో చెయి కడగరాదు. అది శాస్త్రం. కాబట్టి ఈ ముసలివాడికి, అతి త్వరలో ఇక్కడ చెయ్యి కడుక్కునేందుకు ఏర్పాట్లు చెయ్యాలి మరి" అన్నారు.

దంపతులిద్దరూ సిగ్గుపడిపోయారు.

ఆ రాత్రికి ఆయన వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళిపోయిన తర్వాత అడిగాడు నిరంజనం.

"రాత్రి నేనేస్థితిలో వచ్చానో గూడా చెప్పావా రేణూ!"

"లేదు. ఆ అవసరం రాలేదు.

"నేను చాలా అదృష్టవంతుడిని."

"ఎందుకనో"

"ఒక చక్కటి అమ్మాయి, ఒక సుగుణాలరాశి మా ఆవిడ అయినందుకు."

"చాల్లెండి. నా దగ్గరంటె అనేరుగాని బయట ఎక్కడా అనకండేం, భార్యను వెనకేసుకొస్తున్నారని అల్లరి చెయ్యగలరు"

"అలాగేం" అన్నాడు ఆమెను దగ్గరగా తీసు కుంటూ.

(సశేషం)

**రాజధాని కబుర్లు**

# రాష్ట్రంలో నాలుగో అకాడమీ ఏర్పాటు

మన రాష్ట్రంలో నాలుగో అకాడమీ కూడా ఏర్పాటయింది. ఇంతవరకు సంగీతానికి, సాహిత్యానికి లలితకళలకు ప్రోత్సాహమిస్తూ వస్తున్న, మన రాష్ట్ర ప్రభుత్వంవారు, విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి కూడా ఒక అకాడమీ అవసరమనీ గుర్తించటం సంతోషించవలసిన విషయమే. ఈ ఆంధ్రప్రదేశ్ సైన్స్ అకాడమీకి 50 వేల రూపాయలు మంజూరు కూడా చేసింది. శ్రీ పి. వి. జి. రాజుగారు (రాష్ట్ర విద్యాశాఖ మంత్రి) అధ్యక్షతన ఏర్పడిన ఈ అకాడమీలో మూడు విశ్వవిద్యాలయాల్లోని ప్రముఖులకు, ఇతర విద్యావేత్తలకు స్థానం కల్పించబడింది. రాజకీయ వాతావరణానికి బహుదూరమై, కేవలం విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన కృషే, ఈ అకాడమీవారు చేస్తారని నలుగురూ ఆశిస్తున్నారు.

ఈ మధ్యనే ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు ద్వైమాస పత్రిక 'నాట్యకళ' అనే పేరుతో ముచ్చటయిన ముఖచిత్రంతో వెలువరించారు. నాటకానికి, సంగీతానికి సంబంధించిన వ్యాసాలు చాలా ఉన్నాయి. ఆయా ప్రక్రియల్లో విశిష్టత సంపాదించుకున్నవారే, యిలాంటి వ్యాసాలు వ్రాశారు. ఈ సంచికలో రెండు, మూడు ప్రత్యేకత లున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ అనుబంధమైన సంస్థల పరిచయాన్నిస్తున్నారు. రెండోది, ఇతర దేశీయ భాషల్లోని సాహిత్య ప్రక్రియలను గురించిన వ్యాసాలను కూడా ప్రకటిస్తున్నారు. వీటితోపాటు విదేశీయ సాహిత్యానుబంధం కూడా ఉంది. అయితే యీ వ్యాసాలు ఇంగ్లీషులోనే ఉన్నాయి. ఇదీ ఓ కొత్త పద్ధతే. మళ్ళా అనువాదానికి పూనుకోకుండా యధాతథంగా ప్రచురించటంవలన కేవలం తెలుగు పాఠకులకు కొంత యిబ్బంది కలిగినా, ఇంగ్లీషు భాషమీద ద్వేషంలేని సహృదయాలకు ఈ వ్యాసాలు ఉపయోగంగానే ఉంటాయి. కేవలం వ్యాసాల్తోనే పరిపెట్టక నాటకాలు, ఏకాంకికలు వగైరా ప్రచురించటానికి కూడా సంపాదకవర్గంవారు ముందంజ వేయటంవలన ఔత్సాహిక నాటక సంఘాలవారు ఉత్తమ నాటకాల కొరత తీరుతుందని ఆశించవచ్చు. దేశంలో నానాటికి పెరిగిపోతున్న అన్నింటి ధరలను దృష్టిలో పెట్టుకొని, ఈ 'నాట్యకళ' ధర రూపాయిన్నర ఉంచినట్టున్నారు. ఇదేమి ప్రయివేటు సంస్థది కాదు. ఇంచుమించు ప్రభుత్వంవారి పోషణ క్రింద నడుస్తున్నదే! నలుగురికి అందుబాటులో ఉండేటట్లు కూడా చూడాలి

* * *

'నవత' త్రైమాసిక పత్రిక. దీంట్లో ఉంది కొంత నవీనత! అంకితంలో అభ్యుదయ కవితకి ఆధునిక ప్రక్రియలకి అని ఉంది వార పత్రికలో వెలువడుతున్న కథా సాహిత్య ఉత్పత్తి వేగంతో, అభ్యుదయ కవిత, ఆధునిక ప్రక్రియలు పోటీ పడటం కష్టమే! కాస్త నిలబడి, మనం ఏం రాస్తున్నాం! ఏం రాయాలి అని ఆలోచించే సావకాశం ఉండాలి. మూడ్నెల్లకు ఒక్కసారి ప్రత్యక్షమయ్యే యీ పత్రికలో అలాంటి ఆలోచనకు తీరుబడి ఉన్నవారి రచనలే సాక్షాత్కరిస్తూ ఉంటే, ఏదో కొంతైనా కొత్తదనం ఉండక పోదు. ఈ పత్రికకు ప్రధాన సంపాదకులుగా శ్రీ శ్రీ ఉండటంవలన 'కొత్త' చైతన్యం కోసం ఎదురుచూడటం సహజం. అయితే ఇతర పత్రికలకన్న సాహిత్య పత్రికలు ఎక్కువ పెందరాళే చచ్చిపోతూ ఉంటాయేమో అని వారే అన్నారు. కాని పోషించే బాధ్యత పాఠకలోకానిదని వదిలేశారు. ఇది నిజమే. ఈమధ్య డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు రాజధాని నగరంలో జరిగిన సాహిత్య సమావేశంలో మాట్లాడుతూ ఒక ముక్క చెప్పారు. మన ప్రజలయొక్క నిరాదరణ అనే అగ్నిలో ఎలాంటి సాహిత్య పత్రికైనా సరే ఆహుతి అయిపోవాల్సిందే, కాని విశ్వాసం అనేది మూలం. ఇది ఆధారంగా ఉంటే ఏ దెబ్బా ఉండదన్నారు. అలాంటి మూలాధారమైన విశ్వాసమే 'నవత' నిర్వాహకులు నక్షత్ర సప్తకం వారికి బలంగా ఉందని గత నాలుగేళ్ల నుంచి వారు నిర్వహిస్తున్న కార్యకలాపాలే చెపుతున్నాయి. అందువల్లనే వారు ఎదురుచూస్తున్న, 'నవచైతన్యం' ఈ పత్రిక ద్వారా బహిర్గతమయితే ఆశ్చర్యపడేదేమి లేదు. దీని తాలూకు తొలి ఛాయలు ఆరుద్ర ''స్వాత్నిక్ టెక్నిక్' లోనూ, గోపాల చక్రవర్తి 'రెండు వైపులా వెలుగుతున్న కొవ్వొత్తి కథ' లోనూ అప్పుడే కనుపించటం మొదలుపెట్టినాయి. ఇదే ''పరమార్థం సామాజిక సామూహిక సద్వర్తన.''

* * *

1948 సంవత్సరం జనవరి 30 వ తేదీ తర్వాత యావత్ప్రపంచాన్ని కన్నీటి సముద్రంలో ముంచివేసిన సంఘటన, మళ్లీ నవంబరు 23 న జరిగింది. గత చరిత్ర తిరగేసి చూస్తే అఖిల మానవాళి శ్రేయస్సుకోసం పాటుపడిన మహనీయులు ఎంతోమంది ఒక వ్యక్తి దురహంకారానికి, విద్వేషానికి బలి అయిపోయినట్లు, మనకు తెలుస్తూనే ఉంది. టెక్సాస్ రాష్ట్రంలో అభివృద్ధి నిరోధకులు తీవ్రమైన అలజడి లేవదీసి, ప్రెసిడెంట్ కెన్నెడీ విధానాల పట్ల తీవ్రమైన అసంతృప్తిని తెలియపరుస్తున్నారు. ఈ విషయాన్ని స్వయంగా పరిశీలించి, వారికి నచ్చచెప్పటానికి ప్రెసిడెంట్ ఈ ప్రయాణాన్ని సాగించాడు. అయితే ఆయనకు చాలా హెచ్చరికలు వచ్చినాయి కూడా. కాని, వాటిని లెక్కపెట్టలేదు. ఆ ఊరు ప్రవేశిస్తుండగా హర్షధ్వానాలు చేస్తూ, ఆహ్వానిస్తున్న ప్రజలను చూసి జాక్వెలెన్ కెన్నెడీ తన తన భర్తతో కూడా అన్నదిట: టెక్సాస్ ప్రజలు మనం అనుకున్నట్లు విరోధాన్ని ప్రకటించలేదని, ఈమాట అన్న క్షణాల్లో తుపాకి పేలుడు వినిపించటం ప్రెసిడెంట్ కెన్నెడీ నేలకు ఒరిగిపోవటం జరిగిపోయినాయి. ఎన్నిరకాల రక్షణ చర్యలు తీసుకున్నా, విధి బలీయమని ఈ సంఘటన పూర్తిగా చాటుతోంది.

ఈ వార్తతోపాటు పూంచ్ సమీపంగా సంభవించిన హెలికాప్టర్ ప్రమాదంలో దుర్మరణానికి పాలైన అయిదుగురు ఉన్నత సైనికాధికారుల విషాదకరమైన అంతం, అందర్నీ చకితుల్ని చేసింది. కమ్యూనిస్టు చైనీయుల దుండగీడుతనం రానురాను హెచ్చిపోతున్న యీ సమయంలో యిలాంటి సమర్థులైన సైనికాధికారులను కోల్పోవటం దురదృష్టకరం ఈ రెండు వార్తలు ఒకేరోజున రాజధాని ప్రజలకు అందాయి. తెలతెలవారుతుండగా ఈ రెండు వార్తలు కూడా పిడుగుల్లాగ వచ్చిపడ్డాయి. వీటిని తట్టుకోలేక చాలా మంది నోటి వెంబడి మాట కూడా లేక స్తబ్ధులయిపోయారు. ఇప్పుడల్లా మన కర్తవ్యం, రక్షణ కార్యక్రమాన్ని యితోధికంగా పెంచుతూ అప్రమత్తంగా ఉండటమే! — ఐ. ఎల్. ఎన్ ★

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

శ్రమల అజ్మాయిషీ (డెవలప్‌మెంట్ రెగులేషన్ ఆక్టు 1961) (3) పరిశ్రమల నిర్వహణ, (4) ఉత్పాదక శక్తి.

ఇందులో యితర శాఖలలో చేరని అన్ని రకాల పరిశ్రమల అభివృద్ధి ప్రణాళిక కూడా చేర్చబడి ఉంది.

ఇందులో (1) కుట్టు మిషనులు, టైపు రైటర్లు, సైకిళ్ల లాంటి చిన్న పరిశ్రమలు.
(2) చిన్న వృత్తి పరిశ్రమలు (దేవదారు, స్టేషనరీ అగ్గిపెట్టెలు, సిగరెట్లు మొ.)
(3) చిన్న విద్యుత్ పరికరాల తయారీ, (4) కేబిల్సు, (5) పట్టు పురుగులు; కటకములు మొదలగునవి. (6) ముడిఫిలిమ్ (7) హార్డ్ బోర్డ్, (8) ముడి కాగితం న్యూస్‌ప్రింట్, (9) టైర్‌లు, ట్యూబ్‌లు (10) లవణం.

## చిన్న పరిశ్రమలు

అభివృద్ధికి చెందినంతవరకు (1) చిన్న పరిశ్రమల బోర్డు, (2) చిన్న పరిశ్రమల జాతీయ సంస్థ (నేషనల్ కార్పొరేషన్)(3) కొత్త పరిశ్రమలను పంజాబ్, ఉత్తర ప్రదేశ్, మహారాష్ట్ర గుజరాత్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఢిల్లీ ప్రాంతాలలో పెట్టి నిర్వాసితులకు ఉద్యోగాలను కల్పించడం.

పారిశ్రామిక సహకారం : (1) పారిశ్రామిక రంగంలో సహకారం. (పంచదార మిల్లులు మినహాగా.)

## షల్లై పరిశ్రమలు

(1) ఖాదీ, చేనేతలతో సహా పల్లె పరిశ్రమల సమన్వయ సహకార అభివృద్ధి, (2) అంబర్ చరఖా, (3) పట్టు పురుగుల పరిశ్రమ పేటెంట్లు డిజైన్‌లు మొదలగునవి. (1) అంతర్జాతీయ ఉత్పత్తి సరుకుల నిలువను స్థిరీకరణ చేయడం. (భారత ప్రమాణిక చట్టం 1952.) (2) పేటెంట్‌లు, డిజైన్‌లు (1911 చట్ట ప్రకారం.) ఉన్నాయి.

కాని, ఇంత రాపిడికి తట్టుకుని నిలదొక్కుకున్న మంత్రిత్వశాఖను ఎందుకు రద్దు చెయ్యాలి అన్న ప్రశ్నకు సంజాయిషీ దొరకలేదు.

ఇక్కడే మరో విషయం చెప్పుకోవాలి. తలతల





























# న్యూఢిల్లీ లేఖ

పెద్దరికాల నడిచే చిన్న చిన్న విభాగాలను, పాలనా యంత్రాంగాలను నిర్మించి బాధ్యతను భిన్నాభిన్నం చేయడంవల్ల వ్యవసాయరంగాన మాంద్యం ఏర్పడింది. అంచేత ఇదే గతి పరిశ్రమలకు పట్టనున్నదా ? (ఇంతవరకు పరిశ్రమల గతి పురోగతిగానే జరిగింది.) ఇక మందకొడితనం ప్రారంభం అవ్వొచ్చును.

**దీన్నిబట్టి అర్థిక వ్యవహారాల మీద రాజకీయాల హయాం తేటతెల్లమవుతోంది.**

కాని దీనికి ప్రత్యామ్నాయంగా లాల్ బహదూర్ శాస్త్రిలాంటి గట్టినాయకుడెవరయినా మంత్రివర్గం లోనికి వస్తే తప్ప అతగాడు వాణిజ్య పరిశ్రమలకు సంయుక్త నిర్వహణ చేస్తే తప్ప ఈ అస్తవ్యస్త, అపసవ్య పరిస్థితులు బాగుపడవు. పైగా దీనివల్ల ఉత్పత్తి దెబ్బతినక మానదు. అంతేనా, పెట్టుబడి, ఆర్థిక పురోగమనం కూడా నష్టపోతాయి.

మరో ముఖ్యమైన సంగతి : పెట్రోలియం, కెమికల్స్, ఉక్కు, గనులు, లోహాలు, వాణిజ్యం విభాగాలను నిర్వహిస్తున్న ముగ్గురు మంత్రుల మధ్య సమన్వయం కుదరడం చాలా అవసరం. పైగా పారిశ్రామిక విధాన నిర్ణయాలు నిర్ణయం ఒక కాబినెట్ హోదాలేని మంత్రి చేతిలో ఉన్నాయి.

వ్యవసాయం విద్య లాంటివి 1921 లోనే రాష్ట్ర స్థాయి మంత్రులకు వెళ్లిపోయాయి. అలాంటివి కాబినెట్ మంత్రుల చేతిలోనూ, రాజ్యాంగ ప్రకారం కేంద్ర బాధ్యతగల శాఖలేమో రాష్ట్రస్థాయి మంత్రుల చేతిలోనుఉన్నాయి!

పోతే వివిధ పరిశ్రమలకు వాణిజ్య విభాగాలకుగాను ప్రధానమంత్రి ఒక మంత్రుల మండలిని ఏర్పరచి, దానికి ఒక సీనియర్ మంత్రిని అధిపతిగా వెయ్యాలనీ, వారానికోసారి ఈ మండలి సమావేశ మవుతూ ఉండాలనీ కూడా ఒక సలహా ఉంది. అంటే దీనికి అనుగుణంగా ఒక సెక్రటరీల మండలి ఉండాలి కదా.

ఇక టెక్నికల్ డైరక్టరేట్ (Technical Directorate) దాని కదే ఉండాలా ? పారిశ్రామిక విధానాన్ని నిర్వహించే మంత్రిత్వశాఖకు దీన్ని చేర్చివేయాలా ? ముమ్ముందు జరిగే పునర్వ్యవస్థీకరణం ఈ సమస్యను తేల్చాల్సి ఉంది.

పరిపాలనా యంత్రాంగం కుంటుపడింది అన్నమాట మనం కాదనుకున్నా నిజం. కామరాజ్ పథకం అమలైన దగ్గర్నుంచీ పరిపాలనా యంత్రాంగము సైకంలో పడిపోయింది.

ప్రస్తుతం కొంత పునర్వ్యవస్తీకరణం జరుగుతున్నది వాస్తవమే గాని ఒకప్రక్క పార్లమెంట్ సమావేశం అవుతూంది. మరొకప్రక్క మంత్రిశాఖలన్నీ వాటి సంవత్సరపు బడ్జెట్లు తయారు చేసుకునే ప్రయత్నంలోను ఉన్నారు. ఇప్పుడు ఈ మంత్రివర్గాల వ్యవహారాల పంపకం, విభజన జరిగితే మామూలు కార్యకలాపాలు కనీసం ఈ నెలంతా ఐనా ఆగిపోవచ్చును. అంటే పునర్వ్యవస్థీకరణ ఫలితాలు పరిపాలనా యంత్రాంగానికి ఈవిధంగా తోడ్పడతాయి అన్నమాట. ★

# హైదరాబాద్ సినిమా వార్తలు

## అందరూ మంత్రులే!

ఆంధ్రుల రాజధానీ నగరంలో సినిమా పరిశ్రమను మూడు పూవులు, ఆరు కాయలుగా అభివృద్ధిచేసి తీరాలన్న దృఢ సంకల్పంతో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు హైదరాబాదు రావటంతో ఇందుకు సంబంధించిన ప్రభుత్వ కార్యక్రమాలు కూడా ఒక సినిమాలా తయారయాయి. ప్రభుత్వ స్థాయిలో నడుస్తున్న యీ సినిమాలో నటులంతా మంత్రులే.

ఇక్కడ చిత్ర పరిశ్రమను అభివృద్ధి చేసేందుకు ముగ్గురు మంత్రులతో ఒక ఉపసంఘాన్ని నియమించి నెలలు కావస్తున్నది. కాగితాల ద్వారా కొంత గాకపోయినా, కొంత పనేదో జరిగినట్లు అర్థమవుతున్నది.

ప్రభుత్వం తరఫున యీ బాధ్యతలను రాష్ట్ర సమాచార శాఖ నిర్వర్తిస్తున్నది. సినిమా పరిశ్రమను ఇక్కడ ఎలా అభివృద్ధి చేయాలా— అంశంపై సూచనలను చేయవలసిందని శ్రీ అక్కినేని నాగేశ్వరరావుని, శ్రీ సారథీ స్టూడియోస్ వారిని, ఫిలిం ఛేంబర్సు వారిని, సమాచారశాఖను ప్రభుత్వం కోరింది. నాలుగు వర్గాలనుంచి సూచనలు అందాయి. పరిశీలన నిమిత్తం అవన్నీ సిద్ధంగా ఉన్నాయి కూడా. నలుగురూ చేసిన సూచనల్లో యోగ్యమైనవాటిని ఆమోదించి తదనుగుణమైన తీర్మానాలను ప్రభుత్వం చేస్తుంది.

ఏమైనా, తాడో, పేడో త్వరగా తేల్చి వేయటం మంచిది. ప్రభుత్వంవారి వైఖరి ఎలా ఉందో నని కొందరు నిర్మాతలు పొంచి పొంచి చూస్తున్నారు. అందువల్ల సమస్యలను అనవసరంగా సాగదీయడం మాత్రం మంచిదిగాదు. ఇదే పరిస్థితి మరికొంతకాలం కొనసాగితే, పరిస్థితులు, పరిశ్రమా కొంతవరకు స్తంభించిపోయే ప్రమాదం ఉన్నది.

## ఇద్దరు దక్షిణాది తారలు రెండు ఉత్తరాది చిత్రాలు

దక్షిణ భారతదేశంలోని నిర్మాతలు, దర్శకులు ఎంత రుసరుస లాడుతున్నా మన నటులు, నటీమణులు హిందీ చిత్రాలలో నటిస్తూనే ఉన్నారు. తద్వారా తమకే గాదు, తమ ఆవిర్భావానికి అవకాశం యిచ్చిన దక్షిణదేశ సినిమా రంగానికే కీర్తిని చేకూరుస్తున్నారు.

అగ్రశ్రేణికి చెందిన మన తెలుగు తారలు సావిత్రి, బి. సరోజాదేవి నటించిన రెండు హిందీ చిత్రాలు రాజధానీ నగరంలో ప్రదర్శింపబడుతున్నాయి.

విజయవంతమైన సావిత్రి నటనకు ఒక మహోన్నత అవకాశాన్ని యిచ్చిన, ప్రఖ్యాత హిందీ దర్శకులు 'కిశోర్‌సాహు' నిత్య జీవితంలో ప్రత్యేకంగా, సంసారాల్లో గల లోతుపాతులు తెలిసినవారు. సమర్థవంతమైనవారి దర్శకత్వం రత్నదీప్ పిక్చర్స్ వారి 'ఘర్ బసాకే దేఖో' చిత్రంలో కనుపిస్తుంది.

కథ కేవలం సాంఘికం. ఘట్టాలన్నీ తెలిసినవే. అయినా, అవన్నీ ఒకదరి చేరేసరికి ఏర్పడిన వినూతన సృష్టియే ఈ చిత్రం.

ఒక నిరుపేద కుటుంబంలో జన్మించి, తల్లి చేయూతతో పెద్ద చదువులు చదివిన కమల్, ఇంట తెలియకుండానే ఒక అత్యాధునిక యువతిని పెండ్లి చేసుకొని, తన బాధ్యతలను రవంతయినా నిర్వర్తించడు. తల్లిని, చెల్లిని వదిలి నగరానికి వచ్చేసి, వేరే కాపరం పెట్టి జీవిస్తూ ఉంటాడు.

అదే ఇంట్లో మరో భాగంలో సుందర్, గీతా అన్న ఆదర్శ దంపతులు ఉంటూ, నలుగురి కష్టసుఖాల్లో పాలు పంచుకొంటుంటారు. ఈ రెండు కుటుంబాలలో కల వ్యత్యాసం అడుగడుగునా కనుపిస్తుంది. సుందర్, గీత నిర్వహించిన బాధ్యతలతో కమల్‌కు, అతని భార్య మోహనలకు కనువిప్పు కలుగుతుంది. కథ సుఖాంత మవుతుంది.

ఆదర్శ గృహిణిగా సావిత్రి నటన మినహాయిస్తే, ఈ చిత్రంలో పెద్ద విశేషమేమీ లేదు. తెలుగు మాటలతోను, తెలుగు పాటలతోను మనకు కనుపించే సావిత్రి, దేవనాగరి దేవతగా మరో రూపం దాల్చటం, ప్రతి తెలుగువానికీ ఒక ఆకర్షణ.

అన్నింటికన్నా ముఖ్యమైనది కిషోర్‌సాహు దర్శకత్వం. ఆయన ప్రతిభ చిత్రం జరుగుతున్న ప్రతి క్షణంలోనూ ద్యోతక మవుతుంది. బిపిన్ గజార్‌గారి ఫోటోగ్రఫీ కూడా కొత్త పోకడలను సంతరించుకొన్నది.

కమల్ సోదరిగాను, కథలో ప్రముఖ పాత్ర నిర్వహించిన కుమార్ ప్రేయసిగాను, కుమారి రాజశ్రీ (శాంతారాం కుమార్తె) ప్రదర్శించిన నటన ఆహ్లాదకరంగా ఉంది. అత్యాధునిక భార్యగా శ్యామా నటన తగు పాళ్లలో ఉన్నది. కమల్ తల్లిగా లలితాపవర్ గంభీరంగాను, వాస్తవంగాను నటించింది.

మహమూద్, జానీవాకర్, మినూముంతాజ్‌ల చక్కని హాస్యాన్ని అందజేశారు. జానీవాకర్ హాస్యం మరికొంత మెరుగు పరచి, సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా తీర్చిదిద్దుకోవలసిన అవసరం ఉన్నది.

చిత్రానికి సంబంధించిన అన్ని సాంకేతిక శాఖలు సమర్థవంతంగా పనిచేశాయి. ఒకటి, రెండు పాటలు చాలా బాగున్నాయి.

మొత్తంమీద, "ఘర్ బసాకే దేఖో" చిత్రంలో ఏదో తెలియని కొంత మాధుర్యం ఉన్నది. ప్రేక్షకుని, ఆ మాధుర్యమే, ఆనందాన్ని ఇచ్చి, ఆహ్లాదపరుస్తుంది.

* * *

తెలుగు, తమిళ, కన్నడ చిత్రాలలో జాజ్వల్యమానంగా వెలుగుతున్న అగ్రశ్రేణి తార బి. సరోజాదేవి, హిందీ సినిమా ప్రేక్షకులకు కూడా, చిత్రాల ద్వారా పరిచయం కావటం, కేవలం వారి ప్రతిభకు నిదర్శనం.

దక్షిణ దేశంలో ఛాయాచిత్రకారుడుగాను, నిర్మాత—దర్శకుడుగాను, ప్రసిద్ధికెక్కిన శ్రీ బి. ఎన్. రంగా దర్శకత్వం వహించిన 'ప్యార్‌కియాతో డర్నాక్యా' చిత్రంలో షమ్మీకపూర్ కథానాయకుడుగాను, బి. సరోజాదేవి కథానాయికగాను నటించారు.

కథలో విశేషమేమీ లేదు. కాలేజీలో చదువుకొనే ఒక పోకిరి కుర్రవాడు మరో అందమైన అమ్మాయి వెంట పడటం, వారి పరిచయమే ప్రణయంగా మారి, చివరకు కథానాయకుడు తలిదండ్రులను కూడా ఎదిరించే స్థితికి రావటం జరుగుతుంది. అజ్ఞాతంగానే పెళ్లి జరుగుతుంది. వేరే కాపురం పెడతారు. ఉన్నట్టుండి అకస్మాత్తుగా 'విలన్' తన వయ్యారి భామతో సహా ప్రత్యక్షమయి కథానాయకుణ్ణి కష్టాలపాలు చేస్తాడు. ఈలోగా నాయికా నాయకుల మధ్య అనుమానాలు, వివాదాలు చెలరేగుతాయి ఎలా గయితేనేం. చివరకు అందరూ ఒకచోట చేరి



కంభూ ఫిలింస్‌వారి 'పూజా ఫలము' చిత్రంలో సావిత్రి.



'మరపురాని కథ'లో జగ్గయ్య.

మనందరకూ 'జైహింద్' బోర్డు చూపటం జరిగింది.

నటనకు సంబంధించినంతవరకు షమ్మీకపూర్ నటన చాలా బాగుంది. 'బ్లఫ్ మాస్టర్', 'ప్రొఫెసరు' లాంటి పాత్రలను చాకచక్యంగా నిర్వహించగల షమ్మీకపూర్, ఇందులో కొత్త రకమైన పాత్రను నిర్వహిస్తారు.

ప్రేమఘట్టాలలో అసమానంగాను, అనన్యంగాను నటించగల (ఉదహరణ : పెళ్లికానుక), బి. సరోజాదేవి ప్రతిభను అత్యుత్తమంగా దర్శకులు వినియోగించుకొనలేక పోయారని అనిపిస్తుంది.

కథానాయకుని తండ్రిగా పృథ్వీరాజ్ గంభీరంగా నటించారు.

ఫొటోగ్రఫీ చాలా బాగున్నది. దర్శకత్వం ఫరవాలేదు.

## ఇంటింట వెలుగు దీపాల వెలుగు

మొన్న దీపావళి పండుగ రోజున — దీపాలు అప్పుడప్పుడే వెలుగుతున్న సమయంలో శ్రీ నాగేశ్వరరావుగారింటికి వెళ్లాను. శ్రీమతి అన్నపూర్ణా నాగేశ్వరరావుతోను, ఐదుగురు పిల్లలతోను ఇల్లంతా కళకళ లాడుతుంది.

పిల్లలంతా ఇంట్లో ఒకవైపు మతాబాలు కాలుస్తూనే ఉన్నారు. నగరమంతా కోలాహలంగా నిండిపోయింది.

శ్రీ నాగేశ్వరరావు మాత్రం నిండుగా, నిశ్చలంగా 'ఆఫీసు రూం' లో కూర్చుని, విరామం లేకుండా వస్తున్న 'టెలిఫోన్' పిలుపులకు సమాధానం చెబుతున్నారు.

నాగేశ్వరరావుగారిని, ఇంటింటా కనుపించే దీపాల వెలుగును చూస్తుంటే— రమణీయమైన 'పెళ్లికానుక' దృశ్యాలు గుర్తుకొచ్చాయి.

*   *   *

న్యాయస్థానంలో న్యాయమూర్తులు, న్యాయవాదులు, జ్యూరీవారు— అంతా సభ దీర్చిఉన్నారు. ఆ రోజు — చాలా ముఖ్యమైనది కావటంవల్ల, న్యాయవాదులు అధిక సంఖ్యలోనే వచ్చారు ప్రేక్షకులు కూడా, ఇసుకవేస్తే రాలనట్లు కూర్చొని ఉన్నారు

వేరొకవైపు ముద్దాయి ఆనంద్‌బాబు చేతులు కట్టుకొని నిలుచొని, శ్రద్ధగా ఆలకిస్తున్నాడు

'కుమార్' హత్యకు బాధ్యుడు ఆనంద్‌బాబే నని ప్రాసిక్యూషన్ ఆరోపణ. అలా జరగటం అసంభవమని ప్రతివాదన్య



'అదృష్టవతిలో' ఇ. వి. సరోజ.

"వేయిమంది నేరస్థులను విడిచి పుచ్చినా ఫరవాలేదుగాని, ఒక్క నిర్దోషి కూడా దండింపబడకూడదు" అంటూ ముద్దాయి తరఫున న్యాయవాది వాదిస్తున్నాడు.

మరొక వైపున: "కుమార్‌ను ఆనంద్‌బాబు హత్య చేశాడనటానికి కావలసిన సాక్ష్యాలన్నీ ఉన్నాయి. పిస్టల్ కుమార్ ప్రక్కన పెట్టినంత మాత్రాన హత్య, ఆత్మహత్యగా మారదు. పిస్టల్ మీద వేలి గుర్తులు, తోటలో ఆనంద్‌బాబు అడుగుజాడలు మొదలైన సాక్ష్యాలన్నీ ఈ హత్య ఆనంద్‌బాబే చేశాడని చెపుతున్నాయి"—అంటూ ప్రాసిక్యూషన్ తరపున పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదిస్తుంటాడు.

వాద ప్రతివాదాలను న్యాయమూర్తి శ్రద్ధగా విని, వ్రాసికొంటూ ఉంటాడు. ఈ చక్కని సన్నివేశం జగపతి పిక్చర్సువారు ప్రస్తుతం సారథీ స్టూడియోస్‌లో నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలోనిది.

ముద్దాయి ఆనంద్‌బాబుగా, కథానాయకుడు అక్కినేని నాగేశ్వరరావుగారు 'బోను'లో నిలబడి ఉన్న దృశ్యం హృదయ విదారకం మాత్రమే కాదు, రసవత్తరం కూడా. కొద్దిగా మాసిన గడ్డంతో నలిగిపోయిన బట్టలు ధరించిన అక్కినేని, ఈ సన్నివేశంలో చక్కని హావ భావాలను ప్రదర్శించారు.

ముద్దాయి తరఫున న్యాయవాది శ్రీ నాగయ్య 'డైలాగులు' చదువుతుంటే, సారథీ స్టూడియోస్ మొదటి 'ఫ్లోరంతా' ప్రతిధ్వనించింది.

ఆత్రేయగారి ఘంటం నుంచి వెలువడిన పాటలలోను, మాటలలోను విశిష్టత ఎప్పుడూ ఉంటుంది ఇదే సత్యాన్ని లోగడ ఎన్నో చిత్రాలు నిరూపించినవి కూడా. ఇదే విధంగా జగపతి పిక్చర్సువారి ఈ చిత్రంలోని సంభాషణలు, మధురాతి మధురంగా ఉన్నాయి.

శ్రీ వి. మధుసూధనరావుగారిది సమర్థవంతమైన దర్శకత్వం. షూటింగ్ చూసేందుకు అప్పుడే కొత్తగా వచ్చిన వారు 'టీ' షర్టు తొడుక్కొని ఉన్న యువకుడే మధుసూదనరావుగారని చెపితే నమ్మరు ఒకటి, రెండుసార్లు 'రిహార్సల్సు' చేయించటం వాటిని మెరుగు పరచటం—ఆ తరువాతనే కెమెరాకు పని కల్పించటం—శ్రీ మధుసూదనరావుగారి చాకచక్యం.

యువ నిర్మాత శ్రీ రాజేంద్రప్రసాద్ నిర్మిస్తున్న ఈ చిత్రంలో ఇంకా బి. సరోజాదేవి, జగ్గయ్య రేలంగి, రమణారెడ్డి, గిరిజ, గుమ్మడి, కుటుంబరావు ప్రభృతులు నటిస్తున్నారు.

## అక్కినేని — అమెరికా

అమెరికా ప్రభుత్వ ఆహ్వానంపై మార్చి నెలాఖరులో ఆ దేశం వెడుతున్న అక్కినేని నాగేశ్వరరావుగారిని సన్మానించే విషయమై రాజధానిలో తర్జన భర్జనలు చెలరేగుతున్నాయి.

తెలుగు రాజధానిలో తెలుగువారి మధ్యన వున్న ఒక సుప్రసిద్ధ నటుడైన కళాకారుడు అమెరికా వెళ్లటం తెలుగు వారందరికీ గర్వ కారణం. ఈ సందర్భంలో వారిని సన్మానించటం అన్నది కూడా అదృష్టమే.

డిసెంబరు మధ్య ప్రాంతంలో ఘనంగా సన్మానించాలని ఎవరో కొందరు— ఒక సన్మాన సంఘంగా రూపొందారని వినికిడి. అందుకు రాష్ట్ర ఆర్థిక మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు అధ్యక్షులుగా ఉండటానికి అంగీకరించినట్లు కూడా తెలుస్తున్నది.

ఇదే విధంగా, అక్కినేనిని సన్మానించాలని, తద్వారా కళనే పరోక్షంగా గౌరవించాలని నగరంలో మరి కొన్ని సంఘాలు పోటీ పడుతున్నాయి. అది సహజం కూడా.

ఇంతకూ చెప్పొచ్చే దేమంటే—రోజు కొక సన్మానం వంతున నెల రోజులపాటు సన్మానాలు చేయటంకంటె, వీళ్లందరూ కలిసి ఒకే రోజున రవీంద్ర భారతిలో ఘన సన్మానం ఏర్పాటు చేయటం మంచిది.

మరొక విషయం చెప్పాలి. పుట్టలో పుట్టి, మట్టిలో మాసిపోయే ఈ చిన్న సంఘాలే ఈ భారాన్ని వహించటంకంటె, ఇందులో ప్రభుత్వం కూడా పాలు పంచుకోవటం మంచిది. అప్పుడే ఆ నటుణ్ణి ఘనంగా సన్మానించినట్లవుతుంది.

ప్రభుత్వం ఎందుకు చేయాలి?—అన్న ప్రశ్న ఉత్పన్నం కావచ్చును.

సాధారణంగా, ప్రభుత్వ స్థాయిన ఎప్పుడూ ఒక జాడ్యం ఉంటుంది. గురజాడ, కందుకూరి, రవీంద్రుడులాంటి వారి ప్రతిభను, ఆయా వ్యక్తులు సజీవులైవున్న రోజుల్లో గుర్తించక, వారు అంతరించాక, వారిపేర శత జయంత్యుత్సవాలు, స్మారక చిహ్నాలు వెలుస్తున్నాయి.

అందువల్ల, ప్రభుత్వమూ, నగర కార్పొరేషనూ శ్రీ అక్కినేనికి సన్మానం ఏర్పాటు చేయటంలో అసందర్భమేమీ ఉండదు. పెచ్చు, విశిష్టమైన ఒక కళాకారుణ్ణి, వాస్తవికమైన ఒక కళనూ సన్మానించిన ఖ్యాతి పొందగలిగిన వారవుతారు

ఇప్పటికయినా మించిపోయిందేమీలేదు నాగేశ్వరరావుగారి సన్మానించాలని యోచిస్తున్న చిన్న చిన్న సంఘాలను ఒకదరి చేర్చి, వాటన్నింటి

సహకారంతో ఒక కార్యక్రమం రూపొందించటం అవసరం.

ముక్కూ, మొహం తెలియని వాలెంటీనా, తెరెష్కోవాకు, వాళ్లంతా వియత్పథంలో విహరించారో లేదో తెలియకనే, కన్నులార చూడకనే— సన్మానం చేయటంకన్న, వాళ్లకోసం ప్రభుత్వ

## హైదరాబాద్ సినిమా

స్టాయిలో జోలెడంత "పబ్లిసిటీ" దండుగ చేయటంకన్నా — ముక్కోటి ఆంధ్రుల కన్నులలో వెన్నెల రాజుగా నిలిచిన అక్కినేనికి ఘన సన్మానం చేస్తే, ప్రభుత్వం ఒక ఘనకార్యమేచేసినట్లవుతుంది.



## నాటి రామదాసు_నేటి నాగయ్య

గత నాలుగైదు దశాబ్దాలుగా సినిమా రంగంలో సుప్రసిద్ధ నటుడుగా ఖ్యాతి కెక్కిన శ్రీ నాగయ్య ఇటీవలనే హైదరాబాదు వచ్చారు.

వీరి అధ్వర్యాన 'భక్త రామదాసు' అన్న చిత్రం నిర్మింపబడుతున్న విషయం ఆంధ్రపత్రిక లోగడనే ప్రస్తావించింది.

శ్రీ నాగయ్యను మా విలేఖరి కలిసికొని, "భక్త రామదాసు" ప్రస్తుత పరిస్థితిని గురించి ప్రశ్నించగా—

"ఏమో! నాయనా! ఆ రోజుల్లో భక్త రామదాసు అనుభవించినన్ని కష్టాలను అనుభవిస్తున్నాను. భక్తి, ముక్తి ఇచ్చే ఈ మహత్కార్యాన్ని త్వరలో సంపూర్ణం చేయాలని అనుకొంటున్నాం. కాని, అన్నీ అవాంతరాలే. అనుకోకుండా, ఈమధ్య సి. ఎస్. ఆర్. గారు పోయారు" అన్నారు శ్రీ నాగయ్య ... "ఏమైనా ఉగాది నాటికి విడుదల చేయాలని అనుకొంటున్నాం" అన్నా రాయన.

రాజధానిలో సినిమా పరిశ్రమ విషయం, దీన్ని అభివృద్ధి చేయటానికి జరుగుతున్న కృషి వివరించాను. "తమ అభిప్రాయం ఏమిటి?" అన్న నా ప్రశ్నకు సమాధానం ఇస్తూ, "మా నాగేశ్వర రావు ఎప్పుడు వచ్చాడో, అప్పటినుంచే ఇక్కడకు రావాలని మా కూ డా ఉన్నది. అయినా, కాలమూ, పరిస్థితులూ కలిసి రావద్దూ. అందుకే నిద్ర ఋణం, నీళ్ల ఋణం అంటారు మనవాళ్ళు అన్నారు ఆయన. వాశిరాజు ప్రకాశం. ★

## మద్రాస్ సినీమా వార్తలు

### పద్మశ్రీ పిక్చర్సు

పద్మశ్రీ పిక్చర్సువారు ఇంతవరకు 6 పాటలను రికార్డు చేశారు. 4 పాటలను చిత్రీకరించారు. 2 పాటలను చిత్రీకరించాలి. మరొక పాటను రికార్డు చేసి చిత్రీకరించాలి.

"ఊ అను— ఊ ! ఊ ! అను. . . .
ఔనను— ఔనౌనను. . . ."

పై పాట సి. నారాయణరెడ్డి వ్రాశారు. ఘంటసాల — సుశీల పాడేరు. నాగేశ్వరరావు, జమునలతో చిత్రీకరించారు.

"కనులు కనులు కలిసెను. . . .
కన్నె మనసు పిలిచెను. . . ."

ఈ పై పాటను కూడ సి. నారాయణరెడ్డి వ్రాశారు. ఘంటసాల పాడగా రికార్డు చేయబడింది. నాగేశ్వరరావుతో చిత్రీకరించారు.

"ఎక్కడ ఉన్నా— ఏమైనా. . . .
మన మెవరికి వారై— వేరైనా. . .
నీ సుఖమే నే కోరుకున్నా. . . ."

ఈ పై పాటను ఆత్రేయ వ్రాయగా, ఘంటసాల పాడగా రికార్డు చేయబడింది. నాగేశ్వరరావుతో చిత్రీకరించారు.

"వచ్చిందమ్మా వసంతము. . . .

# లక్మె వానిషింగ్ క్రీమ్ మరియు లక్మె కోల్డ్ క్రీమ్

## ప్రొద్దుట...సాయంత్రము...రోజంతా సుందరముగా నుండండి:

ప్రతి ప్రొద్దుట లక్మె వానిషింగ్ క్రీమ్...
తేలికైన, మంచులాంటి, కనబడని లక్మె వానిషింగ్ క్రీమ్ మీకు అత్యంతసొగసైన రూపమునిచ్చి దానిని రోజంతావుంచును. దాని మీద పౌడరుబాగా అద్దుకొనును. దానంతట అదికూడ పట్టులా, మీ చర్మమును మెత్తగా చేయును.

ప్రతి రాత్రి లక్మె కోల్డ్ క్రీమ్...
పోషించు, సమృద్ధయిన, లక్మె కోల్డ్ క్రీమ్‌తో మేకప్‌ను, మలినమును పూర్తిగా తుడిచివేయండి మీరు నిద్రపోయినప్పుడు, దాని సువాసనైన, అందము నిచ్చు నూనెల వలన మీ రూపమును సొగసుగా చేసుకొనండి ప్రత్యేక కానుక. మేకప్, అంద సంరక్షణను గురించి

**లక్మె**



వస్తాడమ్మా నీ దైవము. . . ."

'పై పాటను ఆత్రేయ వ్రాశారు. సుశీల పాడగా రికార్డు చేయబడింది. జమునతో చిత్రీకరించారు.

"మ్రోగునా ఈ వీణ. . . .
మూగ పోయిన రాగహీన— అనురాగహీన'

పై పాటను ఆత్రేయ వ్రాశారు. జానకి పాడగా రికార్డు చేయబడింది. గీతాంజలితో చిత్రీకరించారు.

"ఏమని— ఏమని— అనుకుంటున్నది ....
నీ మనసేమని కలగంటున్నది. . . ."

పై పాటను ఆత్రేయ వ్రాశారు. సుశీల పాడగా రికార్డు చేశారు. గీతాంజలితో చిత్రీకరించారు.

"ఘల్లు ఘల్లని— గజ్జెలు మ్రోగాలి. . .
మొనగాడికి ఝల్లనిపించాలి. . . . .'

పై పాటను దాశరథి వ్రాశారు. యల్. విజయలక్ష్మి నృత్యంతో చిత్రీకరిస్తారు.

ఇంతవరకు 11 రీళ్లకు పైగా హైద్రాబాదు సారథీ స్టూడియోలో చిత్రాన్ని పూర్తి చేశారు.

ఈ చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావు, యస్. వి. రంగారావు, గుమ్మడి, రమణారెడ్డి హరనాథ్, వై. వి. రాజు, జమున, సూర్యకాంతం, గీతాంజలి, యల్. విజయలక్ష్మి, శారద మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మూల కథ. కుమారి పి. రాధా, మాటలు : ఆత్రేయ, పాటలు : ఆత్రేయ : సి. నారాయణరెడ్డి, దాశరథి, ఛాయ: మాధవ బుల్ బులే, సంగీతం : మాస్టర్ వేణు, నృత్యం : వెంపటి పెద్దసత్యం, కళ : సుబ్బారావు, కూర్పు : హనుమంతరావు, దర్శకత్వం : పి. పుల్లయ్య, సహాయ దర్శకులు : శే. వరప్రసాదరావు, వి. వి. సుబ్బారావు, కె. రాఘవేంద్రరావు, నిర్మాత : వి. వెంకటేశ్వర్లు, సి. ధర్మారావు. ★




Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Chief Editor S. Sambhu Prasad.



'కలవారి కోడలు'లో కృష్ణకుమారి

